అపరాధ పరిశోధన అనుబంధం—101

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## డర్టీ గేమ్
రచన : సికిందర్

## దొడ్డి దారి
రచన : వసుంధర

## గంగులుగాడి పగ
రచన : ఎమ్.వి.వి. సత్యనారాయణ

## చిదంబర రహస్యం
రచన : టెంపోరావ్

రక్తం త్రాగే పిశాచం-పదకొండవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—101
మే, 1982
వెల: రు. 5-00
ఏడాది చందా: 60 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# డర్టీ గేమ్

## సికిందర్

ఆ కిటికీ దగ్గర కూర్చుని అనిత కోసం చూస్తున్నాను. సమయం ఆరు కావస్తోంది. ఆమె అయిదున్నరకే వచ్చేస్తానన్నది. ఆమె కోసం ఇంకా ఈ ఎదురు చూపులు నాలో అసహనాన్ని పెంచుతున్నాయి.

ఇలా నే నెవరికోసం ఎదురు చూడను. చెప్పిన సమయానికి రాకపోతే నా పనిలో పడతాను వాళ్ళని మర్చిపోయి. కానీ ఇప్పుడీ అనితని మర్చిపోలేక పోతున్నాను. మనసును మరి దేనిమీద లగ్నం చేయలేక పోతున్నాను. ఆలస్యం చేసేకొద్దీ అసహనంతో పిచ్చెక్కినట్లవుతోంది....

అసలు ఆమెతో పరిచయం చిత్రంగా జరిగింది. మా స్నేహం కేవలం మూడురోజులదే. ఈ మూడురోజుల్లోనే ఆమె నన్నిలా పిచ్చివాణ్ని చేసేసింది....

ఆ రోజు నేను మామూలుగా సాయంత్రం కూర్చుని ఏం రాయాలో ఆలోచించుకుంటున్నాను. ఇంతలో

# 4

ఇంటిముందు కారాగిన చప్పుడైంది. ఎవరో ననుకొని నేను పట్టించుకోలేదు. కానీ అంతలో బెల్ మోగింది. ఎవరై వుంటారా అనుకొంటూ వెళ్ళి తలుపు తీశాను.

ఎదురుగా చిరునవ్వుతో అత్యంతాధునికమైన యువతి ఒకామె!

"హలో, మీరు డిటెక్టివ్ రచయిత కిరణ్ కుమార్ గారు కదూ?" తియ్యటి పలకరింపు.

కంగారుగా తలూపాను.

ఆమె నవ్వింది. అంతలోనే బిడియంగా తలవంచుకుంది. నాకేం అర్థంగాలేదు. అలా చూస్తూండిపోయాను కళ్ళప్పగించి.

ఇరవై ఏళ్ళుంటాయి ఆమెకు. తెల్లని తెలుపు. సన్నని సన్నం. నాజూకంటే నాజూకైన శరీరం. నిలువెత్తు పూలమొక్కలా వుంది. కళ్ళూ, నోరూ, నాసిక, చంద్ర తీర్చిదిద్దినట్టున్నాయి. ఆమెనలా చూస్తూనే నాలో కెమికల్ రియాక్షన్ మొదలైంది—అవయవాలు తియ్యగా మూల్గాయి!

చటుక్కున దృష్టి మరల్చి కారులోకి చూశాను. అందులో ఎవరూ లేరు. మళ్ళీ ఆమెను చూశాను.

"మీరు నాకోసమే వచ్చారా?"

తలూపిందామె ముఖం ఎత్తి. ఆ కళ్ళలో వేయి నక్షత్రాలు ఒక్కసారి తళుక్కుమన్నాయి.

"రండి—" అన్నాను లోపలికి దారితీస్తూ.

ఆమె లోపలికొచ్చి నేను చూపించిన కుర్చీలో కూర్చుంది. ఓసారి చుట్టూ చూసి, ఇంట్లో ఇంకెవరూ లేనందుకు కొద్దిగా కలవరంచెంది, అంతలోనే సర్దుకొని చెప్పసాగింది. చెబుతూ కాస్సేపట్లోనే ఆమె కొత్త

మర్చిపోయి చనువుగా మాట్లాడసాగింది. నేను శ్రద్ధగా వింటున్నాను తలూపుతూ.

ఇటీవల అచ్చయిన నా కథ ఒకటి తనకెంతగానో నచ్చిందట. స్వయంగా కలుసుకొని కాంప్లిమెంట్ చేద్దామనే ఉద్దేశంతో పత్రికాఫీసుకెళ్ళి అడ్రసు కనుక్కొని వచ్చిందట ఇలా. ఆమెకు నా ధన్యవాదాలు తెలిపాను, కొద్దిగా ఆశ్చర్యపోతూ. కాలేజీలో వచ్చిన నన్నెవరూ అభినందించలేదు.

ఆమె ఇంకా చెబుతూ తను చదివిన నా కథలన్నీ ఏకరువు పెట్టసాగింది. ముఖ్యంగా 'దొరగ్గానే దొంగలు కారు' కథలో తాగుబోతు గంగులు పాత్ర అద్భుతమంది. అలాంటి పాత్ర డిటెక్టివ్ సాహిత్య చరిత్రలోనే ఇంత వరకు లేదంది.

"కిరణ్ గారూ, నేను మీ అభిమానిని. మీరు రాయడం మొదలు పెట్టినప్పట్నుంచీ చదువుతున్నాను. మీ గురించి నాకన్నో తెలుసు. కానీ కలుసుకొనే అవకాశం ఇంతవరకూ కలుగలేదు. మీరొకప్పుడు పేరు పొందిన డిటెక్టివ్ రచయిత. ఎన్నెన్నో మంచి మంచి కథలు మీరు రాశారు. ఆ సక్సెస్ తోనే సినిమాల్లో కెళ్ళారు. వరుసగా మూడు హిట్ చిత్రాలకి కథలు సమకూర్చారు. మరింత పేరు ప్రఖ్యాతులు వచ్చాయి.

"కానీ అప్పుడే మీ దశ మారింది. ఆ తర్వాత మీ నాలుగు చిత్రాలూ కథలు ఒకే పక్కలో ఉండడం మూలాన అవన్నీ వరుసగా ఫెయిల్ అయ్యాయి. దాంతో మిమ్మల్ని ఎవరూ పట్టించుకోలేదు. మీకు నిరుత్సాహం కలిగింది. మీలో నమ్మకం సడలింది. విరక్తి చెంది అక్కడ్నుంచి తిరిగి ఈ హైదరాబాదుకొచ్చేశారు. ఇక్కడ

మళ్ళీ పూర్వపు రచయితలాగానే కాలక్షేపం చేస్తున్నారు.... అవును కదూ?"

ఆమెని ఇంకా ఆశ్చర్యంగా చూశాను. అప్పుడన్నాను. "అవును, నిజమే, కానీ సినిమాల్లో నాకు నేనుగా పోలేదు. వాళ్ళే పట్టుకెళ్ళారు, వాళ్ళే వెళ్ళగొట్టేశారు. నేనిప్పుడు బాధపడుతూ కూర్చోలేదు. సీసా పుచ్చుకొని మందు భాయీ అయిపోలేదు. కష్టాల్ని తేలికగా తీసుకుంటాను. అప్పుడే హెల్తు బాగుంటుంది."

"మీరసలు మందు పుచ్చుకోరా?" అడిగిందామె చటుక్కున.

"ఎందుకు పుచ్చుకోను? మద్రాసులో ఉండగా పుచ్చుకొనేవాడ్ని. కానీ ఇప్పుడు ఆపేశాను...." నా ఆర్ధిక దుస్థితి ఎలా చెప్పుకోను? మద్రాసు నన్ను ముంచేసింది! దానికోసం ఉన్న ఉద్యోగం వదులుకొని పోయాను. ఇప్పుడు ఎటూగాకుండా అయిపోయాను.

"మిస్ అనిత, నా ఈ గడ్డుపరిస్థితిలో కూడా మీ అభిమానం చెక్కుచెదరక పోవడం, మీరిలా వచ్చి నన్ను పలకరించడం నాకెంతో ...."

"ఆపండి!" అందామె అడ్డు తగిలి, "మనిషికి విశ్వాసం కావాలి. ఏవో కొన్ని అవరోధాలు, విశ్వాసాన్ని దెబ్బతీయవచ్చు. వాటికి తట్టుకొనే మనో బలం కూడా ఉండాలి. అది మీకుంది. శక్తిసామర్థ్యాలు ఉన్నాయి. ఇక విశ్వాసాన్ని ప్రోది చేసుకుంటే విజయం మీదే అవుతుంది తప్పక తిరిగి."

ఆమెవైపు కృతజ్ఞతగా చూశాను. ఇంత మంచి మాటలు నాకెవరూ చెప్పలేదు. ప్రపంచమంతా కపటత్వమే. ఆ క్షణంలో ఆమె నాకెంతో ఆత్మీయంగా

కనిపించింది ...

ఆ తర్వాత మాటల్లో దొర్లిన విషయాలు చాలా వున్నాయి. ఆమె ఒక బిజినెస్ మాగ్నెట్ కుమార్తె. ఆమెకు తల్లీ తండ్రీ ఒక అన్నయ్యా వున్నారు. అన్నయ్య మణిపాల్‌లో చదువుకుంటున్నాడు.

ఆమె క్రిందటి సంవత్సరమే చదువు పూర్తిచేసి ప్రస్తుతం వూరికే వుంటోంది. ఇంట్లో ఏమీ తోచదు. ఎవరితోనూ స్నేహం చేయాలనిపించదు. పుస్తకాలు చదువుకుంటూ వుంటుంది. ఉద్వేగం వస్తే కవిత్వం వ్రాస్తుంది. రాత్రులు నక్షత్రాలు చూస్తూ జేసుదాస్ పాటలు వింటుంది....

ఆమె నా గురించి కూడా కొన్ని అడిగి తెలుసుకుంది. నన్ను రోజూ కలుసుకుంటే అభ్యంతరమా అంది. కాదు మహాభాగ్యమన్నాను. అంతే. అలా మొదలైంది మా స్నేహం. బంజారా హిల్స్‌లో లంకంత బంగళా వుంది వాళ్ళకు. కుటుంబ సభ్యులు ముగ్గురే. ఇంకో ముగ్గురు పనివాళ్ళున్నారు. ఒక వంటమనిషి, ఒక డ్రైవరు, ఒక పాలేరు.

గేటుతీయడానికొచ్చిన ఒక లావుపాటి ఆకారాన్ని చూపి అతనే పాలేరు అంది. పేరు శంభూ అట. భీకరంగా వున్నాడు. నల్లటి శరీరం. నిక్కరు తొడుక్కున్నాడు. అతను పాలేరులా లేడు. స్టంటుమాష్టర్ శెట్టిని గుర్తుచేశాను. నవ్వింది అనిత.

కారు డోర్ తీయడానికొచ్చిన ఇనుపకడ్డీ ఆకారం డ్రైవరట. విలన్‌లా పోజు పెట్టాడు. ఏడుపుగొట్టు మొహం. ఎక్కువ మాట్లాడడట. ఎప్పుడూ నవ్వడట. పేరు శంకర్.

మేం కారు దిగి ఇంట్లోకి పోతోంటే ఆ యిద్దరు జీతగాళ్ళు జాగిలాల్లా చూడసాగారు.

అనిత నన్ను తన తల్లికి పరిచయం చేసింది. ఆమెకు నలభై అయిదేళ్ళుంటాయి. గంభీరంగా వుంది. కానీ కళ్ళలో ఆర్ద్రత వుంది. ముఖంలో సౌమ్యత వుంది. ఆమె శరీరం ఇంకా బిగువును కోల్పోలేదు. శిరోజాలు తెల్లబడనూలేదు. వంట్లో తన పనులు చేసుకోగలిగినంత శక్తి వుందింకా. ఆమెమీద నాకు గౌరవభావం కలిగింది.

అనిత నన్ను పరిచయం చేస్తోంటే, తలుపుల చాటునించీ గోడల చాటునుంచీ జీతగాళ్ళిద్దరూ తొంగి తొంగి చూడడం గమనించాను.

అనిత తల్లి అంటోంది పరిచయాలయ్యాక. "మీ గురించి అంతా చెప్పింది అమ్మాయి నిన్న. మీ పరిస్థితికి ఎంతో చింతించాను. కళాకారులు విరక్తి చెందకూడదు. ఒక రంగం అనుకూలంగా లేకపోతే మరోదాన్నెన్నుకోవాలి. మీరీ ఖూనీలూ చావుల కథలు కట్టిపెట్టి, కన్నీటి కథలూ ప్రేమకావ్యాలూ వ్రాయండి. నిర్మాతలే వస్తారు మీదగ్గరికప్పుడు. కన్నీటికీ ప్రేమకూ వున్న డిమాండ్ కుస్తీపట్లకులేదు కిరణ్, సినిమాల్లో. కన్నీటి కథలు అప్పుడూ ఇప్పుడూ ప్రజాదరణ పొందుతూనే వున్నాయి. కాని కుస్తీపట్ల సినిమాలే గాలివాటంగా వచ్చి పోతూంటాయి..."

ఆమెకీ సినీ పరిజ్ఞానమెక్కడిదో నాకాశ్చర్యంగా వుంది.

ఆమె ఇంకా చెప్పసాగింది. నేను శ్రద్ధగా వింటున్నాను. మధ్య మధ్యలో ఆమె కళ్ళు నన్నదోలా, సంశయంగా, పరీక్షగా గమనిస్తోండడం కనిపెట్టాను.

అయిష్టమా? జాగారూకతా? తన కుమార్తె ఒకప్పటి సినిమావాడితో తిరుగుతోందన్న వ్యాకులతా? అలా అయితే కూతురు నా గురించి అంతా చెప్పినప్పుడే నన్నిక కలుసుకోవద్దనీ, ఇంటికి పిలవొద్దనీ వారించాలి కదా?

ఆ తల్లీకూతుళ్ళని ఒకసారి పరిశీలనగా చూశాను. రంగు ఒకటే అయినా రూపురేఖల్లో ఎక్కడా సామ్యం లేదు. అనితవు తండ్రి పోలికా? తండ్రి ఫోటో కోసం చుట్టూ చూశాను. గదిలో ఎక్కడా కన్పించలేను.

ఆ మధ్యాహ్నం అక్కడే భోజనం చేసి వచ్చాను. అనిత నన్ను తన గదికి తీసికెళ్తుందనీ, తన వస్తువులూ అభిరుచులూ ప్రదర్శిస్తుందనీ ఆశించాను. కానీ అలాంటిదేమీ జరగలేదు. ఆమె తిన్నగా నన్ను ఇంటికి తెచ్చి డ్రాప్ చేసి వెళ్ళిపోయింది.

అనిత నన్నొక స్నేహితునిగా, తానభిమానించే రచయితగా తప్ప మరోలా చూడలేదనీ, ఆమె మనసులోకి వేరే భావాలు రావనీ నాకు స్పష్టంగా తెలుసు. అంతస్సుల తారతమ్యం. ఇది నా పొరపాటు అవగాహన అయితే, మున్ముందు ఆమె వైఖరిలో మార్పు వుంటుందేమో ఇప్పుడూహించడం కూడా కష్టమే. అయితే నాలో ఆ మార్పు వచ్చేసింది....

ఆమెని మొదటిసారి చూసినప్పుడే ఆమెపట్ల ఓ ప్రత్యేకమైన-సాహసోపేతమైన భావాలు నా మనసులో నాటుకున్నాయి. రాను రాను ఆమెపట్ల ఆకర్షణ, వ్యామోహం కూడా పెరిగిపోతున్నాయి. అంతేకాదు, రాకూడని ఆలోచనలు రేయింబవళ్ళుపట్టి వేధిస్తున్నాయి. అయితే నా ఈ పరిస్థితికి పూర్తిగా నేనే కాదు

బాధ్యుడ్ని—ఇందుకు ప్రేరేపించిన పరిస్థితి—సంఘటనలు రెండు జరిగాయి నిన్న.

నిన్న సాయంత్రం కిచెన్‌లో నేను కాఫీ పెడుతున్నపుడు ఆమె నా వెనుకగా వచ్చి కబుర్లలో పడింది. ఇంతలో ఏమైందో తెలీదు, ఆమె గట్టిగా కేక పెట్టి కింద పడిపోయింది వెల్లకిలా.

నేను గిరుక్కున తిరిగి చూస్తే అప్పటి దృశ్యం—ఆమె చీర మోకాళ్ళపైవరకు తొలగిపోయి వుంది! అసలు జరిగిందేమీ లేదు. ఎలుక ఒకటి ఆమె కాళ్ళమీదుగా ఉరికిందట. ఆమెను లేపి నిలబెట్టాను ఎలాగో.... నా మనసు మనసులో లేదు! ఆ మోకాళ్ళ వరకు దృశ్యం.... అదే కదులుతోంది కళ్ళముందు! నునుపుగా, తెల్లగా, సుతిమెత్తగా.... ఓహ్, నా మతిపోయిందప్పుడు!

ఆ తర్వాత ముందు గదిలో కూర్చుని కాఫీ తాగుతున్నపుడు.... ఏదో జోక్‌కి ఆమె పగలబడి నవ్వసాగింది. అప్పుడు పైటజారిపోయిందన్న సంగతి ఆమెకు తెలియదు. అలా వదిలేసి పడీపడీ నవ్వుతోంది. నా కళ్ళు చెదిరిపోయాయి ఆ దృశ్యాన్ని చూసి. నాలో కెమికల్ రియాక్షన్ మొదలైంది ఆణచుకోలేనంతగా.

దాంతో నిన్న రాత్రంతా నాకు నిద్రలేదు.

ఇప్పుడా సంఘటనలు మెదిలి మళ్ళీ అలజడి రేగింది. నాకేం కావాలో, నా మనసు ఏం కోరుతోందో నాకిప్పుడు స్పష్టంగా తెలుసు. అది మంచి పనా కాదా, పరిణామం ఎలా వుంటుందని అన్నది నాకు అవసరంలేదు. ఒక్కసారి—ఒక్కసారి ఆమెను రుచి చూస్తే ఎలా వుంటుంది?

ఇదే నా ఆలోచన.

నా గుండె వేగంగా కొట్టుకోసాగింది ఈ ఆలోచనకి. తేలిక చేసుకొని మళ్ళీ ఆలోచించసాగాను అదెలా వీలవుతుందో.

అప్పుడు బయట హారన్ విన్పించింది....

ఉలిక్కిపడి తేరుకొని చూశాను.

అనిత కారు దిగి వస్తోంది వయ్యారంగా....

## 2

ఆమె నవ్వుతూ చూసి, "కిరణ్, నేనాలస్యం చేశానా?" అంది.

అప్పుడు ఆరున్నర కావస్తోంది సమయం.

"లేదు, మీరాలస్యం చేయలేదు" అన్నాను.

ఆమె జాలిగా చూసింది. "నా కోసం ఎదురుచూసీ చూసీ మీ కళ్ళెలా ఎర్రబడ్డాయో చూడండి!"

రాత్రంతా ఆమె మూలంగా నిద్రలేదని ఏం తెలుసామెకి?

"ఓహ్. మీ నిరీక్షణలో కాలం తెలియదు! కళ్ళు అలసట నెరుగవు! మనసు మరి దేనిమీదా నిలవదు!"

ఆమె కిలకిలా నవ్వింది. "రచయితగారూ.... కవిత్వం వద్దండీ, సార్! రచయితకు ఓర్పు, నిగ్రహం చాలా ముఖ్యం. నేను త్వరగానే వచ్చేయాలనుకున్నాను. కానీ సమయానికి కారు తేలేదు శంకర్."

ఆమె అచ్ఛాదనలేని వొంటిని అలాగే ఊహించుకుంటూ కూర్చోమని చెప్పాను. ఆమె కూర్చోగానే నవ్వాను. ఆ నవ్వు పేలవంగా వుందని నాకు తెలుసు. మనసులో వేరే ఆలోచనలు దహించి వేస్తోంటే, ముఖం మీద సహజ భావాలెలా వస్తాయి?

"మీరిలా వస్తూవుండడం మీవాళ్ళకు అభ్యంతరం

కాదా?" అన్నాను.

ఆమె ముఖం చిట్లించి చూసింది, "ఎందుకభ్యంతరం? అదేమీ లేదు, నామీద చాలా నమ్మకం. నా ఇష్టాల్ని ఎప్పుడూ కాదనరు."

నిన్నటి సంఘటనలు మళ్ళీ మెదిలాయి. ఆమె గుండెలకేసీ పాదాలకేసీ దొంగచూపులు చూశాను. ఆచ్ఛాదన తొలగించి వాటిని ఊహించుకున్నాను. నరాలు జివ్వుమన్నాయి! రక్తప్రసరణ హెచ్చి, నోరు తడారింది.

ఆమె చెప్పుకుపోతోంది తన ధోరణిలో. "నేనింట్లో చెప్పేసి వచ్చాను, చాలా రాత్రిదాకా రానని. సినిమా ప్రోగ్రాం వేసుకున్నాను, సెకండ్ షో. మనం అలా బయటికెళ్ళి హోటల్లో తినేసి వెళ్దాం. అప్పటికి సెకండ్ షో టైం అవుతుంది. మళ్ళీ తెచ్చి మిమ్మల్ని డ్రాప్ చేస్తాను. ఏమంటారు?"

ఈ లోకంలోకొచ్చాను, "ఏ సినిమా?" అన్నాను మామూలుగా.

"డాగర్ ఆఫ్ ఐస్."

"వద్దు. మీరు చూడలేరు."

"ఎందుకు చూడలేను?"

"ఆ సీన్స్ తట్టుకోలేరు. నాకే ఒక రాత్రంతా నిద్ర పట్టలేదు."

"నాకేం కాదు."

"అవుతుంది. మీకేదైనా అవుతే మీవాళ్ళు నన్నే...." ఆపేశాను.

నా ఉద్రేకం చప్పున చల్లారిపోయింది. చెమటలు పట్టసాగాయి. ఆందోళనగా ఆమెవైపు చూశాను. ఆమెను నేనేదైనా చేస్తే ఆమెవాళ్ళు ఊరుకుంటారా?

శంభూ, శంకర్ మెదిలారు నా మనసులో. వాళ్ళిద్దరు కలిసి వన్నుతికేస్తారేమో?

"ఆ పేశారేం? ఏంచేస్తారు మావాళ్ళు?" అందామె నవ్వుతూ.

తేరుకొని చూశాను. నా ఆందోళన ఇంకా తగ్గలేదు. అయినా ఉద్దేశ్యం మారలేదు. ముందు ధైర్యంచేయాలి. పరిణామాలు తర్వాత ఎదుర్కొందాం!

"మిస్ అనిత, మిమ్మల్ని ఒకటడగాలనుకుంటున్నాను" అన్నాను చిన్నగా.

ఆమె కుతూహలంగా చూసింది. "ఏమిటి?"

"మీరు నాతో వుండిపోతారా?"

"అంటే?" ఆమె ముఖం చిట్లించింది.

"ఈ ఒక్క రాత్రి నాతో గడుపుతారా?"

"ఏ—ఏమన్నారూ?" ఆమె ఎగిరిపడింది.

జాగ్రత్తపడ్డాను. "అలా కంగారుపడకండి! మీరెలాగూ సినిమాకెళ్తున్నట్లు ఇంట్లో చెప్పి వచ్చారు. ఇక్కడ నాతో ఉండి వెళ్తే వాళ్ళేమీ అనుమానించరు."

ఆమె కోపంగా చూసింది. చటుక్కున లేచి,

"మీకు సిగ్గుగాలేదూ ఇలా అడగడానికి?"

"సిగ్గు నాకెందుకు—మగవాణ్ని."

"నేను సిగ్గుపడుతున్నాను! మిమ్మల్ని ఇలా ఊహించలేదు!"

"మరెలా వూహించారు?"

"వేరుగా.... అందరు రచయితల్లాగే ఉన్నతంగా."

"రచయితలంతా ఉత్తములు కారు."

"మిమ్మల్ని ఇలా అనుకోలేదు! మీరెంతో మర్యా

దస్తులు, మంచివారు అనుకున్నాను. ఇలా నీచమైన ఆలోచనలుంటాయనుకోలేదు!"

"అది పొరపాటు, మిస్. నేను వ్రాసేది వేరు చేసేది వేరు. ప్రత్యక్షంగా చూడకుండా కొందరిమీద నమ్మకాలేర్పరచుకోకూడదు."

ఆమె రెచ్చిపోయింది. "ఓహ్, అభిమానులతో ఇలాగే ప్రవర్తిస్తారా మీరు!"

ఆమెను సూటిగా చూశాను.

"నేనూ మనిషినే, మగవాణ్ని. మీలాటి అందమైన యువతిని చూస్తే సహజంగానే కోర్కె కలుగుతుంది. కోరిక కలిగినప్పుడు అది తీర్చుకునే హక్కు రచయితగా నేను కోల్పోయానంటే, అదుగో అటు చూడండి—ఆ పుస్తకాలూ కాగితాలూ చెత్తంతా అక్కడ పోగేసి నిప్పంటించేస్తాము!"

"అది మీ మనో దౌర్బల్యం!" అరిచిందామె.

"ఒప్పుకున్నాను."

"అయితే మీ కోసం వచ్చేవారందరినీ ఇలాగే...."

"నా కోసం మీలాగా ఎవరూ రాలేదు. మీరొచ్చేవరకూ నాకు ఆడ అభిమానులున్నట్లు తెలీదు."

"అయితే వస్తే ఇలాగే చేస్తారన్నమాట."

"అది వచ్చేవాళ్ళనిబట్టి వుంటుంది."

"నాకసహ్యమేస్తోంది మీరంటే!"

"వెల్ మిస్, ఐ డోంట్ మైండ్. అసహ్యంలోనే ఆనందముందన్నాడో కవి."

ఆమె కంగారుపడి చూసింది, "అయితే పెళ్ళి చేసుకుంటారా నన్ను?"

నాకు నవ్వొచ్చింది ఆమె అడిగిన తీరుకి.

"పెళ్ళా! ఆ మాటెత్తకండి దయచేసి. మీరు లక్షాధికారి కూతురు కావచ్చు. కానీ నాకు లక్షలు తెచ్చే భార్య అవసరంలేదు."

"అయితే నా జోలికి రాకండి, నేను చచ్చి పోతాను!"

"మీరు చావలేరు. నానుంచి తప్పించుకోలేరు. మిమ్మల్ని ఎత్తుకెళ్ళి బెడ్‌రూంలో పడేస్తాను. అప్పుడు మొత్తుకున్నా ఎవరికీ విన్పించదు. లాభంలేదు, నాముందు మీరు అబల. అసహాయ, సుకుమారి. ఇది గ్రహించి వెంటనే మీరు మర్యాదగా లొంగిపోవడం మంచిది!"

ఆమె కెవ్వుమంది. చటుక్కున నోరు నొక్కాను. గోళ్ళతో రక్కింది. చేతులు మెలితిప్పి పట్టుకున్నాను. పెనుగులాడింది. లేపుకెళ్ళి బెడ్‌రూంలో పడేశాను.

ఆమె మరో కేకవేసింది. నేనాలస్యం చేయకుండా ఆక్రమించుకున్నాను. ఒకసారి నా కళ్ళు జిగేలుమన్నాయి. ఆమె మళ్ళీ అరవకుండా నా పెదవులు ఆమె నోటికి అడిమిపట్టాను. మరో మెరుపు మెరిసింది కళ్ళముందు. ఆమె తన్నుకుంటోంటే కాళ్ళు పెనవేసి బంధించాను. మరో వెలుగు వెలిగింది తళుక్కున. ఆమెని పూర్తిగా నా అధీనంలోకి తెచ్చుకొని చెయ్యి వీపుకిందికి పోనిచ్చాను. నా భుజంమీద బలమైన హస్తం పడింది. ఆవేశంగా ఆమె హుక్స్ పట్టి లాగాను. ఆ హస్తం నన్ను వెనక్కిలాగి పడేసింది.

"చాల్లే, ఇక ఆపు!" అన్నాడతను.

అప్పుడు అదిరిపడి చూశాను అతనివైపు.

# 3

నా పని అయిపోయిందిప్పుడు.

అతను నవ్వుతూ చూస్తున్నాడు. నోట్లో సిగరెట్ వెలుగుతోంది. కాలు తాపీగా నేలమీద కొడుతూ టప్—టప్—టప్ మని లయ సృష్టిస్తున్నాడు. అది అతనికి వినోదంగా ఉన్నట్లుంది. నాకు ముచ్చెమట్లు పోశాయి. నాలుక పిడచగట్టుకుపోయింది.. కళ్ళు రెప్ప పడడంలేదు.

శంభూ!

అతని మెడలో వ్రేలాడుతూ కమేరా! దానికి కిరీటంలా ఫ్లాష్ గన్!

కొంతదూరంలో, తలుపు దగ్గర తయారుగా శంకర్!

అతను నోట్లో ఏదో వేసుకొని నముల్తున్నాడు. నన్ను ఓరకంట చూస్తున్నాడు.

తేరుకొని గబుక్కున లేచి కూర్చున్నాను.

శంభూ అనితవైపు చూసి చిటికె వేశాడు. ఆమె వెంటనే లేచి బట్టలు సరిచేసుకుంది. శంభూ ఆమెకు ఐదు వందనోట్లు తీసిచ్చాడు.

"చిలకా, ఇంద డబ్బు. చెక్కేయ్ ఇక!"

ఆమె డబ్బు తీసుకొని నా వైపు తిరిగి జాలిగా చూసింది.

"బైబై మై పూర్ డియర్!" నవ్వుతూ చెయ్యూపి, వయ్యారంగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

నేను అయోమయంగా చూశాను శంభూకేసి. అతను నా పక్కన కూర్చుని నవ్వాడు. నా భయం ఇంకా పోలేదు. వాళ్ళిద్దరు నాకే హాని చేయరని పరిస్థితినిబట్టి అర్థమయింది.

శంభూ వెకిలిగా నవ్వి, "డిస్టర్బ్ చేశానా, కిరణ్?" అన్నాడు.

నేను కోపంగా చూశాను, "ఏమిటిది? ఏమిటి నీ ఉద్దేశ్యం?"

"ఏమీ లేదు కిరణ్, అలా అరవకు. కొన్ని ఫోటోలు అవసరమయ్యాయి, తీసుకున్నాను. అంతే."

అప్పుడు గుర్తొచ్చింది నాకు, ఇందాక మాటిమాటికీ కళ్ళు జిగేలుమనడం!

అతని కెమేరాని చూసి, "దేనికి తీశావు?" అన్నాను ఉద్రేకంగా.

"పనుంది, మా కవసరం."

"మీరంటే ఎవరెవరు?"

"అవన్నీ తర్వాత తెలుస్తాయి. నువ్వేం భయపడకు— నీకేం కాదు. నువ్వు నా మాట వింటే ఈ ఫోటోలు భద్రంగా వుంటాయి. లేకపోతే రెక్కలొచ్చి పత్రి కాఫీసుకెళ్ళిపోతాయి. హెడ్డింగ్. 'అభిమానిమీద రచయిత అఘాయిత్యం!' ఛఛ, ఎంత చెడ్డగా వుంటుంది. నీ పరువు, ప్రతిష్ఠ, ప్రతిభా అన్నీ వీధికెక్కుతాయి. నీకది ఆరోగ్యదాయకం కాదు!"

గభాల్న మీదపడి కెమేరా ఊడలాక్కున్నాను.

శంకర్ మెరుపులా వచ్చి నా గెడ్డంకింద ఒక్కటిచ్చాడు.

కళ్ళు తిరిగి పడిపోయాను వెనక్కి. పిడుగుపడితే ఎలా వుంటుందో నాకు తెలీయదు. ఇప్పుడు తెలిసింది. పళ్ళు కదిలినట్లు అనుమానం వేసింది. కళ్ళు ఇంకా ఆనడం లేదు. కదలకుండా అలాగే వుండిపోయాను.

శంభూ లేచి కెమేరా తీసుకున్నాడు.

"వద్దు, కిరణ్. మా దెబ్బ నువ్వు కాచుకోలేవు. కథలు రాసినంత సులభంకాదు ఫైట్ చెయ్యడం. నువ్వీ సీను కథలో పెడితే శంకర్ని పడగొట్టించేస్తావు. కానీ యథార్థం యథార్థమే కదా? సాక్షిని నేను. అందుకని నువ్వు కాస్త వాస్తవిక దృష్టితో నడచుకో. ఇంకెప్పుడు ఇలా రెచ్చిపోకు. రేపొద్దున నీకన్ని విషయాలు తెలుస్తాయి. ఇక వస్తాం, సెలవు!"

బాధగా లేచి కూర్చున్నాను. అప్పటికి వాళ్ళు వెళ్ళిపోయారు. నా ముఖమంతా నొప్పిగా వుంది. అద్దంలో చూసుకుంటే దుఃఖం ముంచుకొచ్చింది. అందమైన రూపం ఎలా మారిపోయింది! ఆందోళనగా సిగరెట్ వెల్గించుకుని ముందు గదిలోకొచ్చి కూర్చున్నాను.

ఓహ్, ఇంతా చేసి నేను ఉవ్విళ్ళూరింది ఓ కాల్ గర్లు కోసమా, మై గాడ్! తల పట్టుకున్నాను. అనితను మర్చిపోవడానికి ప్రయత్నించసాగాను.

వాళ్ళేం చేస్తారు? ఆ ఫోటోలతో నన్ను దేనికి వాడుకుంటారు? అంతు చిక్కలేదు. ఈ వలయంనుంచి నేనెలా బైటపడాలి? అసలు వలయం ఏమిటో తెలిస్తే గానీ ఏంచేయాలో తోచదు.

ఈ రాత్రి కూడా నాకు నిద్రలేదు.

నిన్న రాత్రి విరహం అయితే, ఈ రాత్రి విషాదం!

## 4

ఉదయం పదిగంటలకి వచ్చాడు శంకర్. నాకో కవరు ఇచ్చి అమ్మగారు వెంటనే రమ్మన్నారన్నాడు. ఆమె పేరేమిటని అడిగాను. ప్రభావతీ దేవి అని చెప్పాడు. నాకు వళ్ళు మండింది. దేవియట! దేవి!

కవరు విప్పి అందులో మూడు ఫోటోల్ని చూశాను. మూడు మూడు భంగిమల్లో. వాటిని జేబులో పెట్టుకుని మాట్లాడకుండా వెళ్ళి కారెక్కి కూర్చున్నాను. శంకర్ పోనిచ్చాడు.

కారు పోతోంటే తిరిగి ఆలోచనలు ముసురుకున్నాయి. రాత్రి నిద్రలేక కళ్ళు మండుతున్నాయి. ఆ ఫోటోలు కళ్ళముందు మెదిలి నామీద నాకే అసహ్యమేసింది. సిగ్గుతో శరీరం కుంచించుకుపోయింది. నేనలా చేసి వుండ వలసింది కాదు. అనిత ఎవరైతే అవుగాక, ఆమెనొక అభిమానిగానే చూసి మంచి మర్యాదలతో మసలు కుంటే ఈ ముప్పు ఏర్పడేది కాదు. వెతుక్కుంటూ వచ్చిన అభిమానిపై వివేకం నశించి వికృతాలోచనలా! తీరా వికటించాక ఇప్పుడు పరువు మర్యాదల కోసం వెంపర్లాడటమా! బాగుంది, ఏమైంది నా బుద్ధికి?

మద్రాసు జీవితం నన్ను భ్రష్టుడ్ని చేసింది! అంతకు ముందు ఎలా వుండేవాడ్ని! కళ్ళు మూసుకున్నాను ఆవేదనగా. ఓసారి ఒక చుట్టాలమ్మాయి నా దగ్గర మరీ పోగొట్టుకుంటే మందలించి పంపాను. ఇవ్వాళ నేనే పోగొట్టుకున్నాను! నాకీ శాస్తి జరగాల్సిందే ఇప్పుడు!

కారు బంగళాలోకి తిరగడం నేను గమనించలేదు. తేరుకొని చూస్తే శంకర్ దిగి డోర్ తీస్తున్నాడు. కంగారుగా దిగి నిలబడ్డాను. తోటలో ఎవరూ కన్పించ లేదు. పోర్టికోలో శంభు నిల్చున్నాడు. శంకర్ నన్ను తీసుకొని నడిచాడు. ఇల్లంతా భయంకర నిశ్శబ్దం తాండ విస్తోంది.

“రచయితగారికి సుస్వాగతం!” అన్నాడు శంభూ నన్ను చూసి.

"తాద్పునుగాళ్ళకి పోయేకాలం!" అన్నాను ముందుకు సాగిపోతూ.

"ఇదేమిటి కూతి?" అన్నాడతను వెనుక వస్తూ.

"నన్నెన్నుకొని మీ చావు తెచ్చుకున్నారు" అన్నాను కటువుగా.

శంకర్ హాలుగుండా నన్ను కుడిపక్క గదిలో ప్రవేశ పెట్టి వెళ్ళిపోయాడు. శంభూ నా వెంట వచ్చాడు. ఆ గదిలో సోఫాలో కూర్చునుందామె గంభీరంగా. ఆ గాంభీర్యం చూసి నాకు వళ్ళు మండింది. ఈ వంచకిని మొన్న గౌరవమర్యాదలతో చూశాను!

ఆమె శంభూకేదో సైగ చేసింది రహస్యంగా. అతను వెంటనే నా వళ్ళంతా తడిమి చూశాడు. "ఏమిటిది?" అన్నాను అతన్ని, తోసేస్తూ.

"టేప్ రికార్డర్ లాంటిదేమైనా తెచ్చుకున్నావేమోనని అమ్మగారికి అనుమానం. ఆమె టాప్ సీక్రెట్ ముచ్చటిస్తారు నీతో."

"ఇక కూర్చో కిరణ్. మరోలా భావించకు" అందామె మృదువుగా.

కోపం అణచుకుంటూ కూర్చున్నాను. ఆమె చిన్నగా నవ్వింది. ఆమె కళ్ళలోకి తీక్షణంగా చూస్తూ అన్నాను, "నేను బుద్ధిలేనివాణ్ని సరే, ఈ లూజ్ క్యారెక్టర్స్‌ని తార్చే ఖర్మ మీకెందుకు పట్టింది?"

ఆమె ముఖం ఎర్రబడింది నా మాటలకి. "అవసరం అంటి పని చేయించడంలో ఆశ్చర్యంలేదు" అంది పొడిగా.

"అవసరమొస్తే మీరెలాంటి పనైనా చేస్తారన్న మాట."

"నా ప్రతిష్ఠకు ముప్పురానంతవరకూ."

"ఈ పని మీ ప్రతిష్ఠకు ముప్పు తేలేదా?"

"ఆలోచించు—ఎవరి ప్రతిష్ఠకు ముప్పో."

ముఖం తిప్పుకొని కిటికీ బైట చూశాను. ఈ ఆడది తెలివిగలది. పకడ్బందీగా ఏర్పాట్లు చేసుకుంది. జాగ్రత్తగా వ్యవహరించాలి....

ఓ ఆడమనిషి లోపలికొచ్చింది కాఫీ కప్పులతో. ఆమెని చూస్తూనే నా శరీరం గగుర్పొడిచింది! నల్లటి శరీరం. ఎత్తు పళ్ళు. చింపిరి జుత్తు. కప్పులు ముందు పెట్టి తిరిగిపోతూ నా కేసి భయంగొలిపేలా చూసింది. వెంటనే నేనక్కడ్నుంచి వెళ్ళిపోవాలనుకున్నాను. ఆ ఇంటి వాతావరణం భయంకరంగా తోచింది. భూతాల గృహంలా అనిపించింది.

"కాఫీ తాగు. వూరికే ఆలోచించి మనసు పాడు చేసుకోకు."

"నా మనసు పాడవదు."

"అదే నేను కోరేది."

"కాఫీ తాగను. మనం విరోధులం ఇప్పుడు."

"మనం మిత్రులం. నా మనసులో శత్రుత్వం లేదు."

"అయితే నన్నెందుకు మోసం చేశారు?"

"ముందు కాఫీ తాగు, చల్లారిపోతోంది."

"పోనిండి, నేను వేడెక్కి వున్నాను."

"సరే, బలవంతం ఏమీ లేదు...." అందామె తన కప్పు అందుకుంటూ, "కిరణ్, అవసరాలు మనుషుల్ని చిత్రంగా కలుపుతుంటాయి. నీ దీనావస్థ ఓ పత్రికలో చదివినప్పట్నుంచీ ఎంత కలత చెందానో తెలుసా? నా మనసు మనసులో లేదు. నిన్నెందుకు నేను ఆదుకోకూడదు

అనిపించింది. అప్పుడు నువ్వేమిటో తెలుసుకోవాలను కున్నాను. అంటే నీ టాలెంట్స్ అన్నమాట. అప్పుడు నీ పుస్తకాలు ఓ రెండు తిరగేశాను. సినిమాలు చూసే అవకాశం కలుగలేదు. ఆ పుస్తకాల్లో అడుగడుగునా నీ కృషి, ప్రతిభ కన్నాకట్టుకున్నాయి. కానీ ఏం లాభం? అదృష్టముండాలి. విధి నిన్ను చాలా చిన్న చూపు చూసింది."

ఆ దుష్ట స్త్రీ వైపు అసహ్య భావంతో చూశాను, "మీ సానుభూతి వచనాలు నామీద పనిచెయ్యవు. సంగతేమిటో సూటిగా చెప్పండి!"

"ఆ అమ్మాయి—అనిత నీకు చెప్పేవుండాలి—తనకో అన్న ఉన్నాడని. నిజంగా ఆమెకు కాడనుకో, కానీ నాకో కుమారుడున్నాడు మణిపాల్‌లో. నువ్వతన్ని చంపెయ్యాలి."

నేను తదేకంగా చూడసాగాను ఆమెవైపు. ఆమె మాటలు నన్ను కలవరపెట్టింది వాస్తవం.

"మీరు తమాషా చేయడంలేదు కదా? ఇలాటి తమాషా ఎవరూ చేయరు" అన్నాను నవ్వుతూ.

ఆమె క్రోధంగా చూసింది. "నవ్వకు. నవ్వు నాలుగు విధాలు చేటు. ఇది తమాషాకాదు. తమాషాలు నేను చెయ్యను. అది నా స్థాయికి తగదు. సీరియస్‌గా ఆలోచిస్తాను, కచ్చితంగా నిర్ణయం తీసుకుంటాను. మళ్ళీ చెప్తున్నాను, సునీల్‌ని నువ్వు చంపెయ్యాలి!"

ఒక సిగరెట్ తీసి వెలిగించుకున్నాను. గట్టిగా నాలుగు దమ్ములులాగి, పొగవృాదులతో పేపర్లో అక్షరాలు చూడసాగాను. గజిబిజిగా కనిపించాయి .... గుండెలో అదురు పుట్టుకొస్తోంది. తలెత్తి ఆమె ముఖంలోకి

చూశాను, "మీ కొడుకు సునీల్ ని?"

"అవును, సునీల్ ని."

"ఏమిటి గొడవ?"

"వాడు నాకు తగడు."

"ఏం చేశాడు?"

"నా భవిష్యత్తుకు అడ్డు నిలిచాడు."

"నేను నమ్మను."

"ఏమిటి నమ్మవు?"

"తల్లులు త్యాగాలు చేస్తారు."

ఆమె పిడికిలి బిగించి సోఫామీద కొట్టింది. "వాడు నా కొడుకైతే కదా త్యాగాలు చేసేది!"

"మీ కొడుకు కాడా?"

"సవతి కొడుకు!"

"ఓహ్....ఐసీ...." ఆశ్చర్యం అణచుకున్నాను.

"వాడికి మూడేళ్ళప్పుడు తల్లిపోయింది. నన్ను చేసుకున్నారు. వాడికిప్పుడు ఇరవై మూడుంటాయి. వాడంటే నాకు పడదు. మొదట్నుంచీ దూరంగా వుంచాను. వాణ్ని ముట్టుకోవాలన్నా అసహ్యం నాకు! ఎంతైనా వాడు నా రక్తంకాదు. వాణ్ని చూసుకోవడానికే నన్ను చేసుకున్నారనుకుంటాను. కానీ వాడంటే నాకసహ్యం! ఎవరి ఓడ్డనో నేను పెంచడమేమిటి? వాణ్ని నా ఛాయలకి కూడా రానివ్వలేదు—"

"అందుకే మీకు దేవుడు పిల్లలివ్వలేదనుకుంటాను."

"ఇదుగో, నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుసుకొని మాట్లాడు! నీ అంతస్తేమిటో, నువ్వున్న పరిస్థితేమిటో గ్రహించుకో. ఇలా నా సహనాన్ని రెచ్చగొట్టావంటే నిన్ను నామరూపాల్లేకుండా చేస్తాను."

"ఎలా? మీ ఫోటోలతో నేనా? కానివ్వండి. అలాగే చెయ్యండి. అప్పుడు నేను చస్తాను. ఏం, నేనెందుకు బ్రతకాలి? నావల్ల ఎవరికి ప్రయోజనం వుంది? నాకు భవిష్యత్తులేదు. సునీల్‌కు హాని తలపెట్టి సుఖమయ జీవితాన్ని చూడలేను. ఆ పాపం వెన్నాడుతుంది. అంతకంటే ఇప్పుడు చచ్చిపోవడమే మేలు. చార్మినార్ ఎక్కి దూకుతాను! మీరప్పుడా ఫోటోలు ఊరంతా పంచండి! పత్రికలన్నిట్లో అచ్చేయించండి!"

"కిరణ్, నువ్వూరికే ఆవేశపడుతున్నావ్. అది నీకే మంచిది కాదు. శాంతంగా ఆలోచించు. ఆవేశంతో బాగుపడ్డవాళ్ళెవరూ లేరు. సునీల్ నా భవిష్యత్తుకి అడ్డు నిలిచాడన్నాను. వాడు మణిపాల్‌లో ఇంజనీరింగ్ చేస్తున్నాడు. ఈ సంవత్సరంతో చదువైపోతుంది. పరీక్షలు రాసి ఎల్లుండి వచ్చేస్తున్నాడు. ఇక జీవితంలో స్థిరపడతాడు. నాకభ్యంతరంలేదు.

"కానీ వాడికీ ఇంట్లో స్థానం కల్పించడం నా మనసు అంగీకరించడంలేదు. ఇకనుంచీ అడుగడుగునా వాడు నా కాటంకంగా వుంటాడు. ఒక్కచోట మేం ఈ ఇంట్లో ఎలా మసలుకుంటామో! తగవులు, గొడవలు, తలనొప్పి తప్పవు! తండ్రికి వాడంటే ప్రాణమే, కానీ నేనంటే కూడా ఇష్టమే—"

"ఐ పిటీ హిమ్ సో మచ్."

"నువ్వు మధ్యలో రాకు! తండ్రికి రోజులు దగ్గరగా పడ్డాయి. ఆరోగ్యం అంత బాగాలేదు. సునీల్ రాగానే వాడికన్నీ అప్పగించేసి తను హాయిగా రెస్టు తీసుకోవాలనుకుంటున్నారు .... అప్పుడు చూడు నా పరిస్థితి! అన్నిటికీ ఆ కొడుకునే అడుక్కోవాలి! ఆ అధికారంతో

నామీద వాడు పగ తీర్చుకుంటాడు! వాడు నాకెప్పుడు ఎదురుతిరగలేదు. కానీ లోపల లోపల కసి బాగా పెంచుకున్నాడు. అదిక వెళ్ళగక్కుతూ నా బ్రతుకు దుర్భరంచేస్తాడు! నాకు నరకం చూపిస్తాడు, కిరణ్! ఈ భయం నన్ను నిద్రపోనియ్యడంలేదు! అంతేగాకుండా-"

"చెప్పండి, ఇలాంటి ఏడుపులు వినడం నాకు తృప్తిగా వుంటుంది."

"ఆయన వీలునామా వ్రాస్తే-అది త్వరలోనే జరుగుతుందని నా అనుమానం — వాడికి మైనారిటీ కూడా తీరింది—అప్పుడు నేను మునిగిపోతాను! వాణ్ని సర్వాధిపతిని చేసి పోతారు! పైకి నేనంటే ఎంత ప్రేమ వున్నా లోపల ద్వేషం వుంది — కొడుకుని నేను సరిగా చూడనందుకు, ఆ కసి ఇలా తీర్చుకుంటారు! ఏ పదివేలో నా ముఖాన పారేసి, మిగతావన్నీ వాడికి చెందేటట్లు చేసేస్తారు! ఆ పదివేలతో నేను వీధిలో నిలబడాలి!

"నాకు నా అనేవాళ్ళెవరూ లేరు. నన్నెవరూ ఆదుకోరు, డబ్బు లేకపోతే. నేనేం చేయాలి చెప్పు? అందుకే ఈ నిర్ణయానికొచ్చాను. సునీల్‌ని అడ్డు తొలగించాలి. అదొక్కటే నాకు పరిష్కారం. ఆ తర్వాత ఆస్తికి ఎలాగో తంటాలు పడతాను. ఆయనకూ ఇంకెవరూ లేరు. ఇదంతా నా పరం చెయ్యాక తప్పదు. నేనీ ఇంట్లో—నన్ను కంటికి రెప్పలా చూసుకునే నా మనుషులతో—ఎప్పటిలా సుఖంగా జీవిస్తాను."

ఆమెవైపు దీర్ఘంగా చూసి తలూపాను. "మీ ఆలోచన బాగానే వుంది...కానీ నేనొప్పుకోకపోతే?"

ఆమె అంది కటువుగా. "ఇందాక అన్నావు చూడు—అలా చచ్చిపో!"

నేను మరో సిగరెట్ తీసి వెలిగించుకున్నాను. పరిస్థితి నాకు బోధపడ్తోంది. ఆందోళనగా చూశానామెవైపు. సందేహంలేదు, ఒప్పుకోకపోతే ఈమె నన్ను వీధి కెక్కిస్తుంది. అప్పుడు నేను బ్రతికినా చచ్చినా ఒక్కటే. ఇవన్నీ వెధవ పనులు చేసేటప్పుడు తట్టవు. కానీ నేననుకున్నాను కదూ, పరిణామాలు త్వరలో ఎదుర్కొందామని? వెల్, ఇప్పుడీ పరిణామాన్ని ఎలా ఎదుర్కోవాలి?

"కిరణ్ —" అందామె సీరియస్‌గా, "నువ్వాలోచించి బుర్ర పాడుచేసుకోకు. బుర్రని పనిమీదకు లగ్నం చెయ్. నువ్వీ పని శుభ్రంగా చేసిపెడతావని నిన్నెన్నుకున్నాను. ఎలాగైనా చెయ్యి, మనకే ముప్పూరాకూడదు. నాకిక్కడ స్థానం దక్కాలి. నీకు పరువూ డబ్బూ! ఇప్పుడు అయిదువేలు అడ్వాన్సు ఇస్తాను — మిగతావి పనయ్యాక, మొత్తం యాభై వేలు!"

చటుక్కున ఆమె ముఖంలోకి చూశాను. అబద్ధం కాదు. ఆమె ప్రతీదీ సీరియస్‌గా తీసుకుంటోంది. నా గుండె ఝల్లుమంది. యాభై వేలు! నేనే సినిమాకు పూర్తి నిడివి కథ రాసినా అయిదువేలు రాలేదు. ఈమె ఒక చిన్న మర్డర్ ప్లాట్‌కు యాభై వేలు ఆఫర్ చేస్తోంది! వంద నవలలు లేదా పది సినిమాలకొచ్చే పారితోషికం!

హఠాత్తుగా నా మనసు చలించింది. ఆ డబ్బు సొంతం చేసుకుంటే! అవును; నా కష్టాలన్నీ గట్టెక్కుతాయి. యాభై వేలతో చేయలేనిదేమిటి? ఓహ్, జీవితం! కానీ—అదెలాంటి డబ్బు? మర్డర్ మనీ! దాంతో సుఖపడగలనా? లేకపోతే చావుకి సిద్ధపడాలి. కానీ నేనెందుకు చావాలి? ముక్కూ మొహం తెలియనివాడికోసం నే

నెందుకు త్యాగం చేయాలి?

నా మనసు చలించడం మానేసి, అప్పుడు నేను మార్గాన్ని ఎన్నుకున్నాను. విధిలేని పరిస్థితిలో సాహసంగా నిర్ణయం తీసుకున్నాను. ఇంతకంటే నేనేం చేయగలను? చావు నాకిష్టంలేదు.

ఆమెవైపు తిరిగి అన్నాను. "అలాగే చేస్తాను, సునీల్‌ని చంపుతాను."

ఆమె సంతోషంగా చూసింది.

## 5

రైల్వేస్టేషను కోలాహలంగా వుంది.

అప్పుడే వచ్చి ఆగిన రైలులోంచి దిగే జనం, ఎక్కే జనంతో సందడిగా, హడావుడిగా వుంది. రైల్వేస్టేషన్లు మంచి కాలక్షేప స్థలాలు.

ఓ మొదటి క్లాసు పెట్టెలోంచి ఆత్రుతగా చూస్తూ దిగాడొక యువకుడు. అతని ముఖంలో ఉత్సుకత, ఆనందం కట్టలు తెంచుకొని ప్రస్ఫుటమవుతున్నాయి. అతన్ని చూస్తూనే పరుగున వెళ్ళి చేరుకున్నాడు తండ్రి. తనయుడి శరీరాన్ని ఆప్యాయంగా తడిమి తడిమి చూశాడు. మాటలు రావడంలేదు. ఒక్కసారి గాఢాలింగనం చేసుకున్నారిద్దరూ. ఆ ఉద్వేగం అలాంటిది. కళ్ళు చెమర్చాయి.

శంకర్ పెట్టెలోకి ఎక్కి లగేజి తీస్తున్నాడు. తండ్రి కొడుకులిద్దరు వేరుపడి ముందుకు సాగారు. కుమారుడి చెయ్యి బలంగా, భద్రంగా పట్టుకొని నడుస్తున్నాడు తండ్రి. అతనొక అమూల్య వస్తువుగా, అతనే తన జీవితానికి ఆధారంగా కోల్పోతే అగాధాల్లోకి జారిపడిపోతాడన్నంత గట్టిగా పట్టుకొని నడుస్తున్నాడు.

"బాబూ, సునీల్! ఎన్నాళ్ళకు చూశాను నిన్ను!"
"నేనిప్పుడు మీ దగ్గరే వుంటాను కదా, డాడీ!"
"పరీక్షలు బాగా రాశావా, సునీల్?"
"రాశాను డాడీ, తప్పకుండా ప్యాసవుతాను."
"ఏ విషయమూ గుడ్ లక్, మై గాడ్!"
"మమ్మీ వుంటే ఇప్పుడెంత సంతోషించేదో..."
తండ్రి ముఖంలో విషాదచ్ఛాయలలుముకున్నాయి.
"ఆమె ఆశీర్వాదం నీకెప్పుడూ ఉంటుంది, బాబూ!"
"మమ్మీ ఎలా వుంటుందో గుర్తులేదు. మీరామె ఫోటో కూడా ఉంచలేదు."
"ఫోటో వుండేది బాబూ, కానీ...."
"కానీ.... నాకు తెలుసు, డాడీ!" సునీల్ ముఖం ఎర్రబడింది, తండ్రి చెయ్యి విడిపించుకున్నాడు చటుక్కున. "పిన్ని తీసేసింది! తీసి__"
తండ్రి కంగారుగా అతని భుజం పట్టుకున్నాడు. "ఇప్పుడు కోపావేశాలు వద్దు బాబూ, ఇంటికి పద!"
అలా వాళ్ళు బైటికెళ్ళి కారెక్కేవరకూ గమనించాను. కారు వెళ్ళిపోయాక టెలిఫోన్ బూత్ లోకెళ్ళి నెంబర్ తిప్పాను. వెంటనే ప్రభావతి అందుకుంది.
"పార్టీ దిగింది .. ఇంటికొస్తున్నారు" అన్నాను.
"మంచిది. ఏం ఆలోచించావు?"
"అతన్ని చూస్తే జాలేస్తోంది. చెయ్యివేస్తే పాపం అనిపిస్తోంది."
"అన్పిస్తుంది. మళ్ళీ మొదటికొచ్చావా?"
"లేదు, ముందుకే పోతున్నాను. మీవారు ఇవ్వాళ రేపట్లో ఎక్కడకైనా వూరగ్తున్నారా?"
"ఎందుకు?"

"తెలుసుకోని చెప్పండి. నాకో ఆలోచన వుంది ఎలా చెయ్యాల్లో."

"చెప్పు!"

"రేపు" ఫోన్ పెట్టేసి బయటకొచ్చాను.

# 6

సాయంత్రం అయినున్నాను ఆ కారు బయల్దేరు తోంటే చూశాను. వెంటనే ఆటోని పోనివ్వమన్నాను. ఆ కారుని వెంటాడుతూ సిగరెట్ మీద సిగరెట్ కాల్చాను. పద్దెనిమిది నిమిషాల ప్రయాణం తర్వాత ఆ కారు ఖైరతాబాద్ చేరుకుంది. హోటల్ మయూర్ కాంపౌండ్‌లోకి తిరిగింది.

నేను బయటే దిగి ఆటోని పంపేశాను. గబగబా లోపలికి నడిచాను. సునీల్ అప్పుడే కారు పార్కు చేసి దిగుతున్నాడు. అక్కణ్నుంచ తన్ని రిసెప్షన్‌లో వరకూ అనుసరించి, అక్కడ క్షణమాగి, అతను స్పెషల్ లాంజ్‌లోకి ప్రవేశించిన వెంటనే నేను కదిలాను.

సునీల్ ఓ మూల టేబిల్ దగ్గర చోటు చూసు కుంటున్నాడు. అక్కడెవరూ లేరు. తేలిగ్గా ఊపిరితీసు కున్నాను. మొత్తం లాంజ్‌లోనూ జనం పల్చగా వున్నారు. అడుగులో అడుగు వేసుకుంటూ మార్గమధ్యంలో ఆగిపోయి, ఆశ్చర్యం నటించి, "హాయ్ సునీల్!" అన్నాను చెయ్యూపుతూ.

అతను తలఎత్తి కలవరంగా చూశాడు.

నేను గబగబా అతన్ని చేరుకున్నాను, "హలో, మిష్టర్ సునీల్‌కుమార్!" అన్నాను నవ్వుతూ, చెయ్యి చాపి.

అతను ఇంకా కలవరంగా చూడసాగాడు. యాంత్రి

కంగా చెయ్యి అందించాడు. చెయ్యి మృదువుగా నొక్కి నేనతని ముందు కూర్చున్నాను.

"ఎక్స్‌క్యూజ్ మీ, మీరు....మిమ్మల్ని నేను గుర్తించలేదు" అన్నాడతను తటపటాయిస్తూ.

అతని ముఖంలోకి పరీక్షగా చూశాను నవ్వి. కర్ణాటక వాతావరణం బాగా వంటబట్టించుకొచ్చాడు. అక్కడి వాళ్ళు సహజంగానే తెల్లగా వుంటారు. సునీల్‌కు ఈ తెలుపు ఎంతో ఆకర్షణ తెచ్చిపెట్టింది. పైగా అమాయకత్వం వుట్టిపడే ముఖం. ఏదో పోగొట్టుకున్నట్టుండే కళ్ళు.

అతని చెయ్యి తట్టి అన్నాను, "నన్ను మీరు చూసి వుండరు. కాని విశ్వేశ్వరరావుగారి అబ్బాయిగా మీరు నాకు బాగా తెలుసు."

"ఓహ్, ఐసీ...." ఇప్పుడతను నెమ్మదిపడి నన్ను పరిశీలనగా చూడసాగాడు. అలా చూస్తూంటే అతని ముఖభావాలు మారిపోసాగాయి. అయిష్టత వ్యక్తమవుతోంది.

నాకు తెలుసు, అతని కళ్ళకి నేనెలా కన్పిస్తున్నానో. సర్కస్‌లో రింగ్ మాస్టర్‌లా, ఈ వదులు కోటూ, నెక్ టై, పైకి దువ్విన తల, నల్ల కళ్ళజోడూ....ఇవన్నీ నన్ను, తమాషాగా, కృత్రిమంగా కన్పింపజేస్తున్నాయి. నా బంగారు రోజుల్లో ఇలాటి కోట్లు నాలుగుండేవి. అవిప్పటికీ వున్నాయి. నేను చిక్కిపోవడం కారణం ఒకటీ, దుర్భర జీవితాన్ని గడుపుతూ సూటూ బూటూ వేసుకు తిరిగితే జనం నవ్వుతారనే భయం ఒకటీ— ఇన్నాళ్ళు వీటి జోలికి పోకుండా చేశాయి. ఇవ్వాళ వేసుకోవాల్సి వచ్చింది అవసరంగా....

వెయిటర్ వచ్చి నానుంచి పదార్థాలు ఆర్డర్ తీసు

కళ్ళాక, సునీల్ వైపు తిరిగి అతన్ని మాటల్లో పెట్టాను. కుశల ప్రశ్నలు వేసి, అతని చదువు గురించీ, అక్కడి జీవితం గురించీ అడిగాను. అయిష్టంగానే చెప్పాడు. తర్వాత నన్ను పరిచయం చేసుకున్నాను. నా పేరు రామేష్ అని చెప్పాను.

"మిస్టర్ సునీల్, మీ డాడీకి నా గురించి — మా ఫర్మ్ గురించి బాగా తెలుసు. మేం తరచుగా కలుసుకొంటూంటాం. మా ఆఫీసు తిలక్ రోడ్‌లో వుంది. కె అండ్ కె కన్‌స్ట్రక్షన్స్. నాతో పార్ట్‌నర్ వున్నాడు. కరుణాకర్. మేం బిల్డింగ్స్ అవీ కాంట్రాక్టు తీసుకొని కడుతూంటాం. ఈ మధ్య మీ డాడీని కలిసి చాలా రోజులైంది. ఎలా వుంది ఆయన ఆరోగ్యం? మీరిక్కడికొస్తున్నట్లు మొన్న తెలిసింది మీ పిన్ని ద్వారా. ఇప్పుడు అనుకోకుండా మిమ్మల్నిక్కడ చూశాను. సంతోషంగా వుంది. మీరు సివిల్ ఇంజనీరింగ్ పరీక్ష వ్రాసివచ్చారు. ప్యాసవుతారని మీ డాడీ గట్టి నమ్మకం. మా ఫర్మ్‌లో మిమ్మల్ని పెట్టి ట్రైనింగ్ ఇవ్వాలనుకుంటున్నారు.... ఇది తెలిసి మేం చాలా ఆనందించాం. మీకీ బిజినెస్‌లో మెలుకువలు నేర్పడం మా అదృష్టంగా భావిస్తున్నాం. ముఖ్యంగా...."

"డాడీ మీకలా చెప్పారా?" అన్నాడతను చటుక్కున అందుకొని.

"కాదు, మీ పిన్ని చెప్పిందట — నా మిసెస్ అనితకు —"

నాలుక కరచుకున్నాను. గాభరాగా చూశాను.

అతను ఇంకా అడిగాడు. "ఎప్పుడు — ఎప్పుడు చెప్పింది?"

"మొన్న — నాలుగు రోజుల క్రితం. లేడీ హైదరీ క్లబ్‌లో ఏదో ఫంక్షన్‌లో కలుసుకున్నారట. వారిద్దరు బాగా స్నేహితులు. మీ గురించి మీ పిన్ని చెప్పిందంతా నా మిసెస్ నాకు చెప్పింది. మిమ్మల్ని మా ఫర్మ్‌లో పెట్టించి ఈ లైన్‌లో ట్రైనింగ్ ఇప్పించాలనుకుంటోంది. తగినంత అనుభవం గడించాక మీకో సంస్థ నెలకొల్పి మీ అభివృద్ధిని చూసి గర్వపడాలనుకుంటోంది. మీ భవిష్యత్తు గురించి ఎన్నెన్ని ఆలోచనలు చేయడం లేదామె! మీ సుఖం కోసం అహర్నిశలూ కష్టపడు తున్నట్లుంది.... అప్పుడే మీకు సంబంధాలు కూడా—"

"ఆపండి!" అరిచాడతను టేబిల్ మీద కొట్టి. "ఆమె చెప్పిందంతా అబద్ధం! షి ఈజె లయర్! హిపొక్రైట్! ఆమె మాటలు నమ్మకండి! లోకానికి నామీద ప్రేమ కురిపిస్తుంది. ఇంట్లో రాచి రంపాన పెడుతుంది! ఆమె గురించి నా దగ్గర చెప్పకండి. ఐ హేట్ హెర్! ఆమె చెప్పేవన్నీ అబద్ధాలు! ఆమెకసలు నేనంటే ఇష్టమే లేదు. ప్రేమ లేదు. రాక్షసి ఆమె! షి ఈజె డెవిల్! నన్ను బాధిస్తుంది! హింసిస్తుంది!"

"నాకాశ్చర్యంగా వున్నాయి మీ మాటలు ..."

"మీకేం తెలుసు? ఇవ్వాళే నేనిట్లో కొచ్చాను. ఆమె నన్ను పలకరించిందా? కనీసం కన్నెత్తి కూడా చూడ లేదు! చూస్తుందని నేను ఆశించనూ లేదు. నేనామెని పట్టించుకోను. ఆమె ఎలా ఏడిస్తే నాకెందుకు? కానీ మిగవా వాళ్ళు—మా జీతగాళ్ళు కూడా మారిపోయారు. ఇంట్లో చాలా మార్పు వచ్చింది. స్మశానంలా వుంది. వాళ్ళంతా దెయ్యాల్లా వున్నారు! నన్నెవరో కొత్త మనిషి — వింత మనిషిని చూసినట్లు చూస్తున్నారు.

దూరం దూరంగా తప్పుకుంటున్నారు! ఆ శంభుగాడు జోక్స్ చెప్పి నవ్వించేవాడు. వాడిప్పుడు సరిగ్గా మాట్లాడడంలేదు. నాతో ఎవరూ మాట్లాడడంలేదు! పగలంతా ఉన్మాదుమని గడిపి ఆ స్మశానంలోంచి బైట పడ్డాను, కొంచెం రిలీఫ్ పొందుదామని. ఇక్కడా మీరు వేధిస్తున్నారు నన్ను!"

"అయాం సారీ...." అన్నాను అతని చెయ్యితట్టి, "నాకీ విషయాలన్నీ తెలీవు!"

ఆ రాత్రి కూర్చుని నేను చాలా వ్రాశాను. పది పేజీలు రాసి, ఒకటికి రెండుసార్లు చదివి తృప్తిచెందాను. ఇలా నేనెందుకు చేయవల్సి వచ్చిందో, నా ఇబ్బందేమిటో అంతా విపులీకరించాను అందులో. ఆ కాగితాలు ఒక కవరులో వేసి సీలుచేసి, సొరుగులో పెట్టి తాళం వేశాను. రేపు ఉదయం దాన్ని పోస్టుచేయాలి.

# 7

ఉదయం త్వరగా లేచి తొమ్మిదిన్నరకు బయట పడ్డాను. పోస్టాఫీసుకెళ్ళి ఆ కవరును రిజిష్టరు పోస్టులో పంపి, ఆటో ఎక్కి సుశీల్ ఇంటికి బయల్దేరాను.

వాళ్ళింటి రెండు సందులివతల సందులో ఆటోని ఆపించి కూర్చున్నాను.

సమయం పదిన్నర కావస్తోంది. నిమిషాలు చకచకా గడిచిపోతున్నాయి. ఆటోవాడికి ఈ ఏర్పాటు ముందే చెప్పి చేసుకున్నాను. అయినా వాడికి బోరుకొట్టకుండా 'స్కైరైడర్స్' సినిమా కథ చెప్తూ వినోదం కల్గించసాగాను.

గంట గడిచింది. అప్పుడు వీధిలో హారన్ వినిపించింది,

గబుక్కున ముందుకు వంగి చూశాను. కొన్ని క్షణా లయ్యాక ఆ కారు కన్పించింది.... మేం వున్న సందు దాటి వెళ్ళిపోతోంది....ఆత్రంగా చూశాను. శంకర్ కారు తోలుతున్నాడు. వెనుక సీట్లో ప్రభావతి వుంది. తేలికపడి నిట్టూర్చాను. వెంటనే ఆటోని పోనివ్వ మన్నాను.

ఆ కారు శరవేగంగా పోతోంది....చకచకా పంజా గుట్ట, ఖైరతాబాద్, సెక్రటరియేట్, టాంక్‌బండ్ దాటేసి, బషీర్‌బాగ్ వైపు తిరిగింది.

ఇంకో అయిదు నిమిషాల తర్వాత తిలక్ రోడ్‌లో వుంది. అక్కడ వేగం అకస్మాత్తుగా తగ్గి నెమ్మదిగా వెళ్ళసాగింది. ప్రభావతి ఎడమవైపు కిటికీలోంచి తల బైటపెట్టి చూడసాగింది బిల్డింగ్ వరసని. శంకర్ కుడివైపు చూస్తున్నాడు. కారు అలా సాగిపోతోంది... రోడ్డు చివరకంటా అలాగే వెళ్ళి ఆబిడ్స్‌లో ప్రవే శించి, నాంపల్లీవైపు దారితీసింది.

నా ఆటో తోకలా దాని వెంట వెళ్ళింది.

నాంపల్లిలో ఓ ఇరుకైన్న వీధిలోకి ఆ కారు తిరిగి మళ్ళీ వేగం తగ్గింది. వీధి మొదట్లోనే నేను ఆటోని ఆపించి చూశాను.

కారు ఆ వీధి చివరకు వెళ్ళి ఓ యింటిముందాగింది. వాళ్ళిద్దరు గేటు తీసుకుని లోపలికెళ్ళారు. నేనాటో దిగిపోయి డబ్బిచ్చేసి వేగంగా ఆ యింటికేసి నడిచాను.

ఆ ఇంటిని చేరుకొని జాగ్రత్తగా లోపలికి చూశాను. వాళ్ళు వరండాలో నిల్చుని తలుపు కొడుతున్నారు. ఇంతలో తలుపు తెరుచుకుంది. కంగారుపడి చూసింది అనిత వాళ్ళవైపు. వాళ్ళు చటుక్కున లోపలికెళ్ళి

తలుపు మూశారు.

వీధిలో నే నటూ ఇటూ చూశాను. ఒకరిద్దరు నన్ను గమనిస్తోన్నా లెక్క చేయకుండా లోపలికి వెళ్ళి పోయాను. ఇంటి కుడిపక్క కరికి, మాటలు విన్పిస్తోన్న గది కిటికీ దగ్గర ఆగి నిలబడ్డాను. జాగ్రత్తగా పక్కనుంచి లోపలికి తొంగిచూశాను. వాళ్ళు ముగ్గురు కన్పించారు. నిలబడే వున్నారు.

ప్రభావతి ముఖంలో క్రోధావేశాలున్నాయి. శంకర్ క్రూరంగా చూస్తున్నాడు. అనితకేమీ అర్థంగాక అయోమయంగా చూస్తోంది.

"ఏమే పిల్లా, యేదో ప్లాను వండుతున్నావట?"

"నేను__నే నేం చేశాను?"

"ఏం చేశాననకు! ఏం చేస్తున్నావో చెప్పు!"

"నే నేం చేస్తున్నాను? ఏమిటి మీరంటున్నది?"

"నే నేమంటున్నాను? నువ్వాడుతున్న నాటకమేమి టంటున్నాను!"

"నాటకమా! నే నేం నాటకమాడాను? మీ రాడ మన్నది ఆడాను, డబ్బు తీసుకున్నాను. అంతే, మిమ్మల్ని మర్చిపోయాను కూడా!"

"మరి నిన్న చేసిందేమిటే, పిల్లా! సునీల్ దగ్గరికి ఎవణ్నో నీ మొగుడిగా పంపి నామీద చాడీలు చెప్పించింది ఎవరట?"

అనిత తికమకపడింది ఇంకా. "ఏమిటి మీర నేది? నే నెవర్ని పంపాను? ఎందుకు పంపుతాను?"

"ఎందుకు పంపావో తెలుసుకుందామనే వచ్చాను! సునీల్ ఎందుకు అబద్ధాలు చెప్తాడు? నువ్వే చెప్తున్నావు! ఎవణ్నో నీ మొగుడిగా సునీల్ దగ్గరకి పంపి నామీద

చాడీలు చెప్పించావు! మా మధ్య గొడవ పుట్టించాలని చూశావు. ఏమిటి నీ ఉద్దేశ్యం? కామేష్ అట వాడి పేరు. కె అండ్ కే కన్స్ట్రక్షన్స్ పార్ట్నరట. సునీల్ తండ్రికి బాగా తెలుసునట! ఇవన్నీ సునీల్ రాత్రి తండ్రికి చెప్పాడు. తండ్రి నన్నడిగారు. నాకేం అర్థంగాలేదు. అలా నేనెవరితోనూ చెప్పలేదు.

"ఆ కామేష్ ఎవరో మావారు తనకూ తెలియదన్నారు. డైరెక్టరీ వెతికితే ఫోన్ నెంబర్ లేదు. తిలక్ రోడ్‌లో ఆఫీసు వుందన్నాడట. నేనిప్పుడిక్కడికి వస్తూ చూస్తే ఎక్కడా బోర్డు కన్పించలేదు. బోర్డూ ఫోనూ లేకుండా అదేం కంపెనీ? ఆ కామేష్ ఎవడో బోగస్!

"నల్ల కళ్ళద్దాలు పెట్టుకుని, సూటు బూటులో వున్నాడట. తల వెనక్కి దువ్వాడట. ఎంత తెలివిగా మాట్లాడినా భార్య పేరు నోరుజారి చెప్పేశాడట— సరిగ్గా నీ పేరు! నా అనుమానం ధృవపడింది. నువ్వు తప్పకుండా ఏదో నాటకమాడుతున్నావు! ఏమిటి నీ ఉద్దేశ్యం చెప్పు? ఏం చేయాలనుకుంటున్నావసలు?"

"మీ మాటలు నాకేమే అర్థంగావడంలేదు!" అర్చింది అనిత.

ఆడపులిలా చూసింది ప్రభావతి. "చూడు పిల్లా, నువ్వింకా చిన్నదానివి. నా సంగతి నీకింకా తెలీదు. నాతో చెలగాటమాడి చేతులు కాల్చుకోకు. నువ్వే చూడు— వీడు నీ పని పడతాడు. నిన్ను కురూపిని చేసి వదుల్తాడు. అడుక్కు తినాలంతే."

శంకర్ వైపు తిరిగి, "పద!" అని బయటికి దారి తీసిందామె.

వెళ్ళిపోతున్న వాళ్ళవైపు అలాగే చూస్తూ నిల్చుంది అనిత.

కారెక్కి వెళ్ళిపోతున్న వాళ్ళని చూసి నేను తేలికగా వూపిరి పీల్చుకున్నాను. ఒక సిగరెట్ తీసి వెల్గించుకుని, అక్కడ్నించి కదిలి ఇంటిముందుకొచ్చాను. చప్పుడు గాకుండా లోపలికెళ్ళిపోయాను.

అదిరిపడి చూసింది అనిత. "నువ్వు—నువ్వా!"

"నేను నేను—నువ్వు నువ్వే!" అన్నాను నవ్వి.

"ఎలా వచ్చావిక్కడికి?"

"ఎలా రాలేనో చెప్పు నువ్వే!"

"ఓహ్, ఏమిటిదంతా! ఇందాక వాళ్ళు వచ్చి గొడవ చేశారు. ఇప్పుడు నువ్వు—ఏమిటీ గోల!"

"గోల ఏమీ లేదు, నీ సందేహాలు తీరుస్తాను. భయపడకు, నన్ను మోసం చేసి పారిపోయినందుకు నీమీద నాకేం పగలేదు. ఎందుకంటే, నేనూ వెధవ పని చేశాను కాబట్టి. ఇప్పుడు మనం పరస్పరం గౌరవించుకుందాం. ముందు వెళ్ళి కాసిని మంచినీళ్ళు పట్రా, తాగి అంతా చెప్తాను పరిస్థితి."

ఆమె తెచ్చిన గ్లాసందుకుని తాగి, ఆమెని పైనించి కిందిదాకా పరికించి చూశాను. ఎన్నెన్నో వూహాలు మెదిలాయి. ఇదివరకటిలా పాడు వూహలు కావు, పవిత్రమైనవి. ప్రతి బ్రహ్మచారి విధిగా గాంచి, ఆచరించదగినవి.

"ఏమిటలా చూస్తావ్?"

నవ్వాను తేరుకొని. "నీకంతా అయోమయంగా వుంది కదూ? చెప్తాను. ప్రభావతి నిన్ను నా దగ్గరికి ఎందుకు పంపించిందో తెలుసా?"

"నాకు తెలియదు. ఆమె కా ఫోటోలు కావాలంది. సమాకరించాను, అంతే. వాటితో ఆమె ఏం చేసుకున్నా నా కనవసరం."

"కానీ వాటితో నువ్వు నన్నెలాంటి ట్రాప్ లో పెట్టి వెళ్ళావో తెలుసా? ఆమె నిన్న బ్లాక్ మెయిల్ చేసింది. ఆ వివరాలన్నీ తర్వాత చెప్తాను. ముందు నాకు నిన్ను కలుసుకోవాలనిపించింది. నువ్వెక్కడుంటావో ప్రభావతి చెప్తుందా? చెప్పదు. అలాగని ఆ ఫోటోలు పట్టుకొని ప్రతి క్లబ్బుకీ, హోటల్ కూ తిరగలేనుగా నీ కోసం? అందుకని షార్టుకట్ ఆలోచించాను.

"వేషం మార్చుకుని నిన్న సాయంత్రం సునీల్ ని కలుసుకున్నాను. అతని పిన్ని నీకు చెప్పినట్లుగా అతని గురించి కొన్ని విషయాలు చెప్పాను. నువ్వు నా భార్య వంటూ నీ పేరు చెప్పి నాలిక కరచుకున్నాను. అదంతా సునీల్ తండ్రికి చెప్తాడని నాకు తెలుసు. తండ్రి భార్యని అడుగుతాడు. దాంతో ఆమె నిన్ను అనుమానిస్తుంది. ఈ గూడుపుఠాణీ ఏమిటో తెలుసుకుందామనే ఉత్సుకతతో బయల్దేరి నిన్ను కలుసుకోవచ్చు. అలా నీ దగ్గరికి నాకు దారి చూపించవచ్చు. ఇప్పుడు సరిగ్గా అలాగే జరిగింది. ఆమెని వెంటాడివచ్చి నిన్నిక్కడ పట్టుకున్నాను—!"

"ఎందుకు? ఏం చేస్తావు నన్ను?"

"నాతోపాటు తీసుకుపోతాను."

"ఎక్కడికి?"

"ఎక్కడికో అక్కడికి. సుఖంగా వుండే చోటికి! ఇక ముందంతా సుఖమే."

"అంటే—?"

"పిచ్చిదానా, అర్థంగాలేదా? నిన్ను నా అర్థాంగిగా చేసుకుంటున్నాను."

"ఏ—ఏమిటీ!" విస్మయంగా అర్చిందామె. ఆమె ముఖం పాలిపోయింది. మరుక్షణంలో కొయ్యబారిపోయి, చూస్తూండిపోయింది పిరికిగా.

"ఇది నా నిర్ణయం, నీ కభ్యంతరమా?" అన్నాను ఆమె చేయి అందుకొంటూ.

ఆమె అలాగే చూస్తోంది, చలనంలేదు.

"కాదనకు దయచేసి, తట్టుకోలేను."

ఆమె తేరుకొని అతికష్టంమీద అంది, "మీరు—మీరేమంటున్నారూ?"

"నిన్ను కోరుతున్నాను, నాతో వచ్చెయి నువ్వు. నువ్విప్పుడు మిసెస్ కిరణ్ కుమార్. అన్నీ ఆలోచించే నేను నిర్ణయానికొచ్చాను."

ఆమె నా చేతులు బలంగా పట్టుకొని వూపేసింది. ఆమె కళ్ళు ఒక్కసారిగా వర్షించాయి. "ఇది—ఇది కలా, నిజమా? ఓ.హ్, నేను—నాకింత భాగ్యమా! నేనీ అదృష్టానికి నోచుకుంటానా! మీరెంత పుణ్యాత్ములండీ! ఆ భగవంతుడే ఇలా మిమ్మల్ని—"

వెంటనే ఆమె నోరు మూశాను. "నన్నేదో గొప్పవాణ్నిగా భావించకు. నేనెవర్నీ ఉద్ధరించడానికీ, దేన్నీ సంస్కరించడానికీ బయల్దేరలేదు. నా బ్రతుకునిప్పుడు సరిదిద్దుకోవాలి. పెంటలా తయారైంది. ఈ పెంటని నీ వలపు తోటలో ఎరువుగా మార్చి పూలు పూయించు. నాకు అహ్లాదాన్ని కల్గించు.

"నిన్ను చూసినప్పుడే మనసు పారేసుకున్నాను. నువ్వెవ్వరో, నీ చరిత్రేమిటో నా కనవసరం. నేనూ

చరిత్రహీనుణ్ని. నీలో నేను కోరే లక్షణాలున్నాయి. తియ్యటి కబుర్లు చెప్పగలవు. మంచి సలహాలివ్వగలవు. ప్రోత్సాహమివ్వగలవు. నువ్వు కష్టసుఖాలు తెలిసిన దానివి. బరువు బాధ్యతలు మోసినదానివి. జీవితానుభవం వున్నదానివి. నాకిదే చాలు, నీతో జీవితం ఒడిదుడుకులు లేకుండా సాగిపోతుంది...."

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది నా గుండెలపై వాలి. ఆమె కళ్ళు తుడిచి ముద్దుపెట్టుకున్నాను నుదుటి మీద.

# 8

ఆ సాయంత్రం కారేసుకొని వచ్చేసింది ప్రభావతి. వస్తూనే నన్నెక్కమని తొందరచేసి, రేపు భర్త ఊరి కెళ్తున్నాడనే వార్త చెవిన వేసింది. నేను ఉత్సుకతను అణచుకున్నాను. కారు బయల్దేరి రోడ్డుమీద తిరుగుతున్నప్పుడు, ఆమె నా వైపు తిరిగి అనుమానంగా చూడ సాగింది.

"ఏమిటి సంగతి, కళకళలాడిపోతున్నావు?"

తృప్తిగా నవ్వాను. "జీవితం తిరిగి వికసిస్తోంది...."

"వికసిస్తుంది. డబ్బొంచేనే జీవితం."

"అదొక్కటే కాదు, మంచి తోడు కూడా వుండాలి."

"ఎవరు—ఎవరామె?"

"తర్వాత—తర్వాత చెప్తానండి—"

"ఈసారి వచ్చినప్పుడు నాకు చూపించు, దీవిస్తాను."

నవ్వుకున్నాను. ఆ సన్నివేశాన్ని వూహించుకున్నాను. దీవించడం మాట అటుంచి, మూర్ఛపోవా తలతిరిగి?

"మళ్ళెప్పుడూ ఇలా రాకండి, మా వీధిలో వాళ్ళు

కన్నింగ్ ఫెలోస్!" అన్నాను.

"సరే, నీ ప్లాను సంగతి చెప్పు ఇప్పుడు."

"రేపు మీవారు ఊరికెళుతున్నారా?"

"అవును మధ్యాహ్నం బండికి. వైజాగ్."

"తిరిగి ఎప్పుడొస్తారు?"

"రెండు రోజులయ్యాక."

"అయితే రేపు రాత్రికే చేస్తాను."

"ఎలా చేస్తావు?"

"చెప్తాను. ముందు మీ యింట్లో విలువైనవి ఏమున్నాయో చెప్పండి."

"ఎందుకు?"

"ఎత్తుకుపోతాను."

"సరిగా మాట్లాడు!"

"నేను సరిగానే మాట్లాడుతున్నాను, మీరే అర్థం చేసుకోవడంలేదు. అదుగో — కారాపించి ఆ సపోటాపళ్ళు ఓ డజను తీసుకోండి, అవంటే నాకెంతో ఇష్టం."

ప్రభావతి కారాపించి సపోటా పళ్ళు కొనిపెట్టింది. తింటూ మొదలెట్టాను.

"మీ ఇంట్లో విలువైన వస్తువులు ఏమైనా వుంటే అవి నేనెత్తుకుపోతాను. అందుకు మీరంగీకరించాలి. రేపు మీవారు ఊరికెళుతున్నారు. ఇదే ఛాన్సు. ఇంట్లో మీ గ్యాంగ్, సునీల్ తప్ప ఎవరూ వుండరు. కనుక సాక్షులంటూ ఎవరైనా వుంటే వాళ్ళు మన అనుకూలురే— మీ శిష్యులు. వాళ్ళూ మీరు కూడా పోలీసులకి రేపిలాగే చెప్తారు. అవును, అది మేం కళ్ళారా చూశాం. ఆ దొంగ పారిపోతూ అడ్డుకోబోయిన సునీల్ని కత్తితో పొడిచేశాడు."

ఆమె చటుక్కున అంది, "కత్తితో పొడుస్తావా?"

"కత్తితో నే పొడుస్తా-" అన్నాను మూడో పండుని అతి ఇష్టంగా తింటూ, "రేపు రాత్రి ఒంటిగంటకి వస్తాను. వెనుక తలుపు తీసివుంచండి. లోపలికొచ్చి బాల్కనీగుండా మీ బెడ్ రూంలోకొస్తాను. కిటికీ తెరచి వుంచండి. గదిలోకొచ్చి మీ తలగడకింద తాళాలతో సేఫ్ నో, అలమారనో తెరుస్తుంటాను— సేఫ్ ఆ గదిలోనే వుంటుందా?"

"అవును, కానీ తాళాలు నా దగ్గరుండవు. ఆయన తీసుకుపోతారు."

"ఓహ్, అయితే బయట ఇంకేముంటాయి?"

"బిందెలు, చెంబులు, పళ్ళేలూ...."

"ఆ సంసారం ఎక్కడ మోయను...." అన్నాను ఆమె పైకేసి తదేకంగా చూస్తూ, "మీ వస్తువులు ఎక్కడ పెట్టుకుంటారు?"

"నగలైతే సేఫ్‌లో వుంటాయి—"

"మీ మెడలో ఈ హారం బాగుంది. ఇంద్ర ధనస్సులా వుంది. దీన్ని రాత్రులు పెట్టుకునే పడుకుంటారా?"

"ఇది నా మెడలోనే వుంటుందెప్పుడూ. ఎందుకు?"

"అది నేను తెంపుకుపోతాను."

"నువ్వు సరిగా మాట్లాడు!"

"సరిగానే మాట్లాడుతున్నాను. రసవత్తరంగా వుంటుంది. కిటికీలోంచి నూకి మీ మెళ్ళో ఈ హారాన్ని కత్తిరించుకుపోతాను. అది బాగుంటుంది. మీరప్పుడు నిద్ర నటిస్తూండాలి. నా చేయి తాకగానే లేచి కేక వెయ్యాలి. మీ అరుపులకి అంతా మేల్కొంటారు.

"ముందు మీ పక్క గదిలో సునీల్ పసిగెత్తు

కొస్తాడు. తర్వాత బయట అవుట్ హౌస్‌లోంచి మీ శిష్యులు ముగ్గురూ వస్తారు. నేను మీ హారాన్ని తెంపుకుని తలుపు తెరిచి పారిపోతాను. అప్పుడు గది బయట సునీల్‌ని పొడుస్తాను కడుపులో. ఆ కత్తిని అలాగే వదిలేస్తాను. నా చేతులకి గ్లవ్స్ వుంటాయి.

"ఇంతలో మీ శిష్యులు నన్ను పట్టుకోబోతారు. వాళ్ళని నాలుగు తన్ని తప్పించుకుంటాను. వాళ్ళు జుట్టూ, బట్టలూ చిందరవందర చేసుకుంటారు. నన్ను కొంత దూరం వెంటాడి వెనక్కి వచ్చేస్తారు. మీరు సునీల్ శవంమీద పడి ఏడుస్తుంటారు. మీ శిష్యుల్లో ఒకరు పోలీసులకి ఫోన్ చేసి పిలుస్తాడు. అప్పుడు వాళ్ళకి ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో మీకు తెలుసను కుంటాను ...."

ఆమె సందేహిస్తూ అంది, "అలా చేయడం బాగుం టుందా? ఇందులో మా ప్రమేయం లేకుండా నువ్వే చేస్తావనుకున్నాను."

"ఇలాగే చేయాలి. ఇదొక్కటే నమ్మకమైనదీ, సులు వైనదీను. అయితే ఆ దొంగని వర్ణించేటప్పుడు పొర పాటున నా ఆనవాలు చెప్పేసేరు!"

"అలా చెయ్యం. ఏదో కల్పించి చెబుతాం ...."

"గుడ్! ఆ గొడవలో సహజత్వం కోసం నేను నాలుగు కొట్టినా మీరేం అనకూడదు. ఆ నగ కత్తిరించుకు నేందుకు మీరు సహకరించాలి."

"నన్ను కొడతావా? ఏమిటి నువ్వనేది?" అర్చింది ఆమె.

"కోప్పడకండి, గట్టిగా ఏమీ కొట్టను. అలా చేయక పోతే మీ ప్రవర్తనలో నాటకీయతతో పట్టుబడిపోతారు.

మీరు మంచి నటి అనుకోను. దెబ్బలు తింటేనే మీ ప్రవర్తనలో సహజత్వం చూపగలరు. దెబ్బ తినకుండా వాస్తవానుభవం లేకుండా ప్రయత్నిస్తే ఏ కళయినా పేలవంగానే ఉంటుంది. అలా కాకూడదు. అక్కణ్నించి అంతా మీ నటనమీదే ఆధారపడివుంది."

"నా మీద కసి తీర్చుకుంటున్నట్లున్నావు!"

"కసి నా కెందుకు?" అన్నాను నవ్వి, "నాకిప్పుడనిపిస్తోంది——నా అదృష్టంకొద్దీ మీ చేత చిక్కి ఇలా జీవితాన్ని బాగుచేసుకునే అవకాశం పొందానని. నాకు మేలుచేసిన వారిని ఎందుకు అవమానిస్తాను? నా స్వార్థం కోసం ఒక అమాయకుడ్ని బలిచేయడం కొంచెం బాధాకరమైన విషయమే అయినా, ఇందులో సెంటిమెంట్స్‌కి తావులేదని గ్రహించాను."

# 9

ఈ రాత్రి నా జీవితాన్ని మార్చివేసే రాత్రి.

నా కష్టాలన్నీ తీరిపోతాయి. అనిత వస్తుంది ఆమనిలా.

నేను చాలా జాగ్రత్తగా వ్యవహరించాలిప్పుడు. ఎంతో మెలకువతో చేయాలీపని. ఏమాత్రం పరాకుగా వున్నా నా బ్రతుకు మసి అవుతుంది. చావు తప్పదు!

చావు ఇష్టంలేక నే నే నీ సాహసానికి పూనుకున్నాను. ఎవరికైనా స్వసుఖం తర్వాతే లోకంలో ఏదైనా. త్యాగాలు చేసేవారు ఎక్కడో వుంటారు. అతనెవరో సునీల్ కోసం నేను త్యాగంచేయడమేమిటి, అర్థం లేకుండా? నేను చచ్చినా అతను బ్రతుకుతాడనే గ్యారంటీలేదు.

నేనా యింట్లో ప్రవేశించాను. నా శరీరం ఇప్పుడు

విపరీతంగా వణుకుతోంది. జీవితంలో ఇలాంటి పని ఇదే. ఏదో అర్ధరాత్రులు కునికిపాట్లు పడుతూ పాత్రలచేత కాగితాలపైన ఖూనీలు చేయించే వాడిని, ఇలా నిజ జీవితంలో స్వయంగా చేయవలసివస్తుందని కలలో కూడా అనుకోలేదు!

గ్లవ్స్ తొడుక్కుని, కత్తిని మరోసారి తుడిచి, దాన్ని తొడుగులో పెట్టి జేబులో వేసుకున్నాను. ఈ కత్తిని బయట మార్కెట్‌లోనే కొన్నాను. వాడిగా వుంది. ఒక్క పోటుకి పిడికంటా దిగబడుతుంది. స్ప్లిట్ సెకండ్ ఆపరేషన్. అంతా స్వయంగా జరగాలని మనసులో ఇష్టదైవాన్ని ప్రార్థించుకుంటూ పైపు పట్టుకుని పైకి ప్రాకసాగాను....

బాల్కనీలోకి దిగిన వెంటనే, గదిలోపల పచార్లు చేస్తున్న ఆకారాన్ని చూసి బెదిరిపోయాను. తర్వాత దాన్ని గుర్తించి నెమ్మదిపడ్డాను. ఎందుకలా తిరుగుతోందామె పడుకోక? ఆమె టెన్షన్‌ని నేనూహించుకోగలను. నన్ను చూసి గబుక్కున కిటికీ దగ్గర కొచ్చింది.

"వచ్చావా?" అడిగింది.

తలూపి కిటికీలోంచి లోపలికి దూకాను.

"రెడీయా?" అడిగాను.

తలూపిందామె ధైర్యంగా.

అప్పుడు నా అక్కసునంతా వెళ్ళగక్కుతూ లాగి కొట్టానామె చెంపమీద!

కెవ్వుమంటూ ఆమె ముఖం పట్టుకుని, వెనక్కి తూలి పడబోతూ సంభాళించుకుంది. నేను మరోసారి కొట్టే ఉద్రేకాన్ని అణచుకొన్నాను.

అప్పటికే ఆమె కేకలకి ఇంట్లో కదలిక ప్రారంభమైంది. ఆలస్యం చేయకుండా ఆమె మెడలో గొలుసు పట్టి లాగాను. ఆమె గింజుకుంటోంది. ఒకటే అరుస్తూ నిజంగానే జరుగుతున్నట్లు భావిస్తోంది.

బయట వేగంగా అడుగులు విన్పించాయి. నేను రెండు చేతులతోనూ గొలుసు లాగి తెంపేసి జేబులో వేసుకోగానే, తలుపులు పెద్దగా చప్పుడు చేశాయి. దాంతోపాటు అవతలనుంచి అరుపులు తీయమంటూ. అది సునీల్ గొంతు.

అంతే, నేనాలస్యం చేయకుండా ఒక్క దూకులో వెళ్ళి తలుపుతీసి బయటపడ్డాను చేతిలో కత్తితో—

ఆ కత్తిని సునీల్ మీదకి ఝుళిపించగానే చటుక్కున తప్పుకుని అతను నా కడుపులో గుద్దాడు. దెబ్బని ఓర్చుకొని మళ్ళీ కత్తి లేపాను. సునీల్ కాలు గాల్లోకి లేచి నా చేతిని తాకబోతుండగా, ఒడుపుగా పట్టుకొని లాగేశాను. అతను కిందపడలేదు, నా మెడ చుట్టూ చెయ్యివేసి నిలదొక్కుకొని, మరో చేత్తో నా కత్తివున్న చేతిని పట్టుకున్నాడు పైకి లేవకుండా.

ప్రభావతి బయటకొచ్చి కేకవేస్తోంది. అప్పుడే పని మనుషులు పైకి పరుగెత్తుకొచ్చారు.

నేను సునీల్ చేతిని ఒక్క దులుపుతో వదిలించుకుని, కత్తిని అతని ఛాతీలోకి దింపబోయాను బలంకొద్దీ. గురి తప్పలేదు, కానీ పట్టు తప్పింది. కత్తి జారిపోయింది. కత్తి జారిపోయి ఎగిరివెళ్ళి కింద హాలులో పడింది నా చేతిలోంచి!

నా గుండెలదిరిపోయాయి. అతన్ని వదిలించుకొని పరుగులంకించుకున్నాను అక్కడ్నుంచి! మెట్లమీంచి

పిచ్చిగా ఉరికాను కిందకు! నా వెనుక ఎవరూ పడలేదు. ప్రభావతి అరుపులింకా మానలేదు! హాల్లోకొచ్చి నేను తల పైకెత్తి చూస్తే—వాళ్ళంతా కన్పించారు సునీల్‌ని ఉద్రేకంగా చుట్టుముడుతూ....

నేనాగలేదు. పరుగుతీశాను బైటికి గుడ్డిగా. పోర్టికోలో ఓ ఆకారం కదిలింది నన్నకస్మాత్తుగా. దద్దరిల్లిపోయాను. నా వొళ్ళు చల్లబడిపోయింది నిలువునా!

కళ్లు చీల్చుకొని చూశాను అతని ముఖంలోకి. నా రక్తం గడ్డకట్టుకుపోయింది! హూంకరించాడతను. అతని చేతిలో రైఫిల్ నా గుండెకు ఆనింది—

"తిరుగు వెనక్కి!"

గబుక్కున తిరిగి నిలబడ్డాను.

"పద లోపలికి!" ఇప్పుడు రైఫిల్ నా వీపుకు ఆనింది. నన్ను ముందుకు తోశాడు.

"త్వరగా నడువ్!"

అతను వెనకనించి తోస్తుంటే ముందుకు దారితీశాను. నా వెన్ను జలదరిస్తోంది రైఫిల్ బ్యారల్ స్పర్శకి! ధైర్యం కూడదీసుకుంటూ నడిచాను.

అక్కడ హాలులో—సునీల్ మేడమీంచి తప్పించుకొచ్చాడేమో, వాళ్ళక్కడ దొరికించుకొని చితగ్గొట్టేస్తున్నారు. అతను కిందపడి దొర్లుతున్నాడు. వాళ్ళ పిడికిలి గుద్దులు ఎడ తెగకుండా పడుతున్నాయి. ప్రభావతి అరుస్తోంది బిగ్గరగా, పూనకం వచ్చినదానిలా. "కొట్టండ్రా! కొట్టండి! చంపెయ్యండి వీడ్ని!"

అనుచరుల దాడి ఉధృతమైంది. సునీల్ తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరవుతున్నాడు. హృదయవిదారకంగా అరుస్తున్నాడు. "శంభూ, నన్ను చంపకురా! మీకేం

రావాలో ఇచ్చేస్తాను ..."

వాళ్ళు విన్పించుకోడంలేదు. ప్రభావతి అతని జుట్టు పట్టి తల నేలకేసి బాదుతోంది. "చావు! నువ్వు చచ్చిపోవాలి! కత్తి ఎక్కడ్రా? దాన్ని వెతకండి త్వరగా."

శంకర్ తలతిప్పి అటూ ఇటూ చూశాడు. శంభూ పిడికిలితో గట్టిగా సునీల్ పొట్టలో గుద్దాడు. సునీల్ ముఖంలో నెత్తురు తన్నుకొచ్చి గావుకేక వేశాడు. వంట మనిషి అతని కాళ్లు బలంగా పట్టుకుంది.

అదంతా చూస్తూ నా గుండెలు బేజారెత్తిపోయాయి.

అప్పుడన్నాడు నాతో వచ్చిన మనిషి. "చంపండి, వాణ్ని చంపెయ్యండి."

అతని కంఠం కంచులా మోగింది. వాళ్ళు నల్గురు అదిరిపడి చివాల్న తలెత్తి చూశారు. ప్రభావతి బిగ్గరగా అరిచి లేచిపోయింది. అనుచరులు తలో దిక్కుకు పరుగెత్తారు.

హఠాత్తుగా నిశ్శబ్దం ఏర్పడింది. కాలం స్తంభించినట్లయింది. వాళ్ళెవరి ముఖాల్లోనూ కత్తివేటుకు రక్తపు చుక్క లేదు! కళ్ళు విప్పార్చుకొని చూస్తున్నారు వెర్రి చూపులు....

సునీల్ నేలమీద పడున్నాడు బోర్లా. బాధగా మూల్గుతున్నాడు. అస్పష్టంగా ఏదో గొణుగుతున్నాడు. బట్టలు బాగా చినిగిపోయి, వంటిమీద రక్కులు వాపులు కన్పిస్తున్నాయి. శరీరం ఎర్రగా కందిపోయింది....

అతని స్థితి చూసి తండ్రి చలించిపోయాడు. దుష్టుల వైపు తిరిగి నిప్పులు చెరగుతూ చూశాడు. "ఆగిపోయారేం, అలా చూస్తారేం, కానివ్వండి!"

పోయిన మతి తిరిగి వచ్చినట్లుంది ప్రభావతికి, గుటకలు

వేసూ అంది.

"మీరు—మీరెలా వచ్చారిప్పుడు? వూరికెళ్ళలేదా?"

అతను ఏవగింపుగా చూశాడామెని, "అయితే ఇదన్నమాట నీ నిజరూపం! వాడంటే ఇన్నాళ్ళ నీ అయిష్టం వెనుక ఇంత కక్ష వుంటుందని నేనెప్పుడనుకున్నాను! పాపిష్టిదానా, నువ్విక్కడ వుండతగవు! నీ స్వార్థం చూశాను. వాడిపై ద్వేషం చూశాను. లోకంలో సవతి తల్లులకి మామూలుగా వుండే జబ్బులని ఎంతో ఓర్పుగా నిన్ను సహించాను. కానీ ఇప్పుడు—ఇంత దుర్మార్గానికి ఒడిగట్టాక నిన్ను నా భార్యగా చెప్పుకోవడానికి సిగ్గుపడుతున్నాను! నువ్వెళ్ళిపో ఇక్కడ్నుంచి! నా కళ్ళకు కన్పించకు దయచేసి!"

అతను రైఫిల్ గురి అనుచరులమీదికి పెట్టాడు. "వెధవల్లారా, నా ఉప్పుతింటూ నాకే ఎసరు పెడతారన్నమాట! కుక్కలకున్న విశ్వాసం లేకపోయింది మీలో, ద్రోహుల్లారా, ఇంకొక్క క్షణం ఇక్కడున్నారంటే కుక్కలకన్నా హీనమైన చావు చస్తారు, పారిపోండి వెంటనే!"

ప్రభావతివైపు తిరిగి అరిచాడు మళ్ళీ. "ఆఖరుసారి చెపుతున్నాను ప్రభావతీ, ఇక నువ్వెళ్ళిపో ఇక్కడ్నుంచి! నీ ముఠాతో తక్షణం వెళ్ళిపో ఈ ఇల్లు విడిచి! ప్రాణం మర్యాద దక్కుతాయి. లేకపోతే ఈ రైఫిల్‌తో నేనేం చేస్తానో నాకే తెలియదు—"

అతని ముఖంలో క్రౌర్యం, దృఢ నిశ్చయం చూసి పూర్తిగా బెదిరిపోయారు ప్రభావతి అనుచరులు. రైఫిల్ ఫీల్డులోంచి వెంటనే తప్పుకొని పరుగు తీశారు తలుపు

దగ్గరికి. అది చూసి అప్పటికి చెమటలో బాగా తడిసి పోయివున్న ప్రభావతి, తేరుకొని వురికింది వాళ్ళ వెనుక వెర్రిగా.

ఆమె వెనుక నేనూ వురకబోయాను. అతను నా కాలరుపట్టి వెనక్కు లాగాడు, "నిన్నప్పుడే వదలను!" అన్నాడు కఠినంగా.

నేను బిత్తర చూపులు చూశాను.

వాళ్ళు ఇంట్లోంచి బైటపడి తోటలో వురుకు తున్నారు. సునీల్ తండ్రి వాళ్ళని గేటువరకూ తరిమి, వీధిలోపడ్డాక కొన్ని క్షణాలు చూసి, ఆయాసపడుతూ తిరిగివచ్చాడు.

నేనతన్ని సందేహిస్తూ చూశాను.

అతను నా వైపో చూపు విసిరి, రైఫిల్ని గోడకిపెట్టి వచ్చి, అమాంతం నన్ను కావలించుకున్నాడు. విపరీతంగా చలించిపోతూ నన్ను గట్టిగా అదుముకున్నాడు.

"ఓహ్, టేకిట్ ఈజీ...." అన్నాను వీపు తడుతూ.

అతను నన్ను వదిలి చేయి అందుకున్నాడు. "థాంక్స్ మిష్టర్ కిరణ్. థాంక్యూ వెరీమచ్! మిమ్మల్ని ఎలా అభినందించాలో—మీ ఋణం ఎలా తీర్చుకోవాలో—"

"అంత మాటనకండి. మీ సహకారంవల్ల నాకూ గండం తప్పింది. పదండి, సునీల్ పరిస్థితి బాగాలేదు...."

మేం వేగంగా సునీల్ దగ్గరికెళ్ళి అతన్ని బెడ్ రూంలో చేర్చాం. అతనిప్పుడు అపస్మారకంగా వున్నాడు. డాక్టర్ని పిలుస్తానని వెళ్ళాడు తండ్రి. నేనొకసారి సునీల్ని సానుభూతిగా చూసి అతని వెంట నడిచాను.

"సునీల్ని ఈ దాడినుంచి తప్పించలేకపోయాను..."

అన్నాను బాధగా, అతను ఫోన్ చేశాక.

"అసలు సరిగ్గా ఇలాగే జరుగుతుందని మీరెలా అనుకున్నారు?" అడిగాడతను, సిగరెట్ ముట్టించుకుంటూ.

"సైకాలజీ ...." చెప్పాను చిన్నగా, "నేను సునీల్‌ని పొడిచినట్లు పొడిచి కత్తి జారిపోయినట్లు నటించి పారిపోతే, వాళ్ళప్పుడు చూస్తూ వూరుకోరు. అప్పటి వాళ్ళ స్థితిలో—ఆత్రుతకొద్దీ ఆ పని వాళ్ళే పూర్తిచేసేసి దొంగమీదకి నెడతారు. సరిగ్గా అలాంటి క్షణంలో మీరు ప్రత్యక్షమైతే, వాళ్ళ కుళ్ళుబుద్ధి మీ కళ్ళెదుటే రుజువయిపోతుంది. వాళ్ళు మీకు కుట్రదారులుగా దొరికిపోతారు. అంతే జరిగింది...."

"ఓ గాడ్, మీ ఉత్తరం చూసి నేనెంత గాభరా పడ్డానో! నా ఇంట్లో ఇలాంటి కుట్ర జరుగుతున్నట్లు నేనూహించలేదు! మీరా ఉత్తరంలో కోరినట్లుగా నే వూరికెళ్తున్నట్లు వెళ్ళి హోటల్‌లో వుండివచ్చాను— మీరు ఫోటోల గురించి రాశారా ఉత్తరంలో. అవి నిన్న వెతికాను రహస్యంగా. ఆమె బీరువాలో నే చీర మడతలో దొరికాయి. తీసి వేరేచోట దాచాను. తెస్తానుండండి—"

అతను పైకివెళ్ళి రెండు నిమిషాల్లో తిరిగివచ్చాడు ఓ కవరుతో. అది అందుకొని విప్పాను. మూడు నెగటివ్‌లూ, ఫోటోలూ వున్నాయి. తేలిగ్గా నిట్టూర్చి వాటికి నిప్పంటించాను.

అవి కింద బూడిదవుతోంటే అన్నాను చూస్తూ. "మీ సహాకారం మరువలేను, చాలా థాంక్స్. మీ ఇంట్లో ఇలాంటి వ్యక్తులుండడం దురదృష్టం. ఇంక జరిగిందంతా మర్చిపోండి! సునీల్‌కు ప్రమాదం తప్పింది. మీ

మిసెస్ గురించి బాధపడుతున్నారా?"

"లేదు, ఆమెని వెళ్ళగొట్టి మంచిపని చేశాను. భవిష్యత్తులోనైనా ఆమెవల్ల వాడికి హాని వుంది. నా వంశాన్ని నిలబెట్టేవాడు సునీల్. ఆమెవల్ల నాకు ప్రయోజనంలేదు, షి ఈజ్ బారెన్ వుమన్."

"ఆమె నాకిచ్చిన అయిదువేలూ రేపు మీకిచ్చేస్తాను, ఇప్పుడు ఈ గొలుసు వుంచండి...." అన్నాను గొలుసు తీసిస్తూ. సోఫా దగ్గరికి కదిలి కిందనుంచి కత్తిని అందుకున్నాను. అతను దగ్గరకొచ్చి ఓ నోట్లకట్ట నా చేతులో తోశాడు.

"ఈ డబ్బు వుంచండి, ఆ డబ్బు తిరిగివ్వకండి."

నేనాశ్చర్యపోయాను. "ఇది నా వృత్తికాదు...."

"అయినా సరే, నా తృప్తి. నన్ను చిన్నబుచ్చకండి."

ఆ కట్ట జేబులో వేసుకొన్నాను. "ఇక వస్తాను. సునీల్ కోలుకుంటే నా క్షమాపణలు తెలుపండి" అన్నాడు.

"వాడు మీకు కృతజ్ఞతలు చెప్పాలి" అన్నాడతను నవ్వుతూ.

నేనూ నవ్వాను. అతనికి షేక్‌హాండ్ ఇచ్చి బయటికి నడిచాను.

బయట చల్లటి గాలి వీస్తోంది. శరీరంలో నూతనోత్సాహం వచ్చింది. తలెత్తి ఆకాశంలోకి చూశాను. చంద్రుడు కన్పించాడు నిండుగా నవ్వుతూ. నిట్టూర్చాను. గ్రహణం విడిపోయింది. ఇప్పుడు స్వేచ్ఛా ప్రపంచంలోకి అడుగు పెట్టాను.

సిగరెట్ వెల్గించుకొని గబగబా నడిచాను. ఇం

కెప్పుడూ ఇలాటి బుద్ధి తక్కువ పనులు చేయకూడదు. అనితను చేపట్టాను. జీవితం ఒక దారిలో పడుతుంది. రేపే ప్రారంభించాలి రిజిష్టరు మేరేజికి సన్నాహాలు. ఈ డర్టీ గేమ్‌లో నాకు పదివేలు గిట్టుబాటయింది. ఎక్కడైనా సుందర ప్రదేశాలలో అనుభవించాలి తొలి సమాగపు తియ్యదనాన్ని, మావెంత సెకండ్ హేండ్ బ్రతుకులైనా.

గేటు దాటి రోడ్డెక్కాను. చకచకా నడవసాగాను. నా సంతోషానికి హద్దులేవు! ఈ వలయంనుంచి ఇంత సులువుగా బయటపడ్తాననుకోలేదు! ప్రభావతి నా మాటలు నమ్మేసింది! లేకపోతే—

"ఆగు, కిరణ్ ...."

వెనుకనించి విన్పించాయి మాటలు.

పదునైన కత్తి నా వెన్నులోకి దిగినట్లయింది. నా కాళ్ళు నేలకతుక్కుపోగా, కొయ్యబారిపోయాను వెనక్కి చూసి. వాళ్ళు నల్గురు వేగంగా నన్ను సమీపిస్తున్నారు ఆ చీకటి సందులోంచి. నా పని అయిపోయిందను కున్నాను — క్షణంలో నన్ను చుట్టుముట్టినవాళ్ళ ముఖాలని చూసి! నన్ను కొట్టి చంపేస్తారనుకున్నాను అంతా ఒకేసారి—

"కిరణ్, ఏమిటిలా జరిగింది?"

ప్రభావతి గొంతులో దుఃఖం నన్ను మామూలు స్థితికి తెచ్చింది. కళ్ళు మూసుకొని గాఢంగా ఊపిరి పీల్చి వదిలాను.

"సారీ, నేనిలా జరుగుతుందనుకోలేదు. కత్తి జారి పోయింది నా చేతిలోంచి...." అన్నాను విచారంగా.

"అదే మంచిదైంది! లేకపోతే .... ఓహ్, జైల్లో

వుండేవాళ్ళం!"

"మన దురదృష్టం."

"ఆయనింకేమన్నాడు? నిన్నేం చేశాడు?"

"నన్నీ రాత్రి వూరొదిలి పారిపొమ్మన్నాడు. తెల్లారి కనిపిస్తే తుపాకితో కాల్చేస్తానన్నాడు."

"పోలీసుల్ని పిలుస్తానన్నాడా?"

"వాళ్ళ ప్రస్తావన తేలేదు."

"హమ్మయ్య! అలాగే జరుగుతుందనుకున్నాను.... బ్రతికిపోయాం! అయితే ఇప్పుడు ఏమిటి చేయడం? నీకో గమ్యం వుంది. నీ కోసమంటూ ఓ. మనిషి ఎదురు చూస్తోంది. వెళుతున్నావు. మరి నేను? నాకెవరూ లేరు! నేనెక్కడికి పోవాలి? ఎలా బ్రతకాలిప్పుడు?"

"మీకున్నారుగా శిష్యులు — వీళ్ళే కూలీనాలీ చేసి పోషిస్తారు!" అని ముందుకు సాగిపోయాను.

నలుగురూ చేష్టలుడిగి దీనంగా నిలుచుండిపోయారు, రోడ్డుమీద వెర్రి చూపులతో.

—:ఐ పో యిం ది:—

# దొడ్డి దారి

## వసుంధర

రమణమూర్తి అంటే ఒక విధంగా నాకు అసహ్యం.

మరో విధంగా ఇష్టం.

అతడికి మగాడినన్న అహంభావం ఎక్కువగా ఉన్నా నేను తప్పుపట్టేవాణ్ని కాదు. ఆడదాన్ని కూడా మనిషిగా గుర్తించి సానుభూతితో అర్థం చేసుకోని మగాళ్ళంటే నాకు చాలా అసహ్యం.

అలాగని నాకు రమణమూర్తి గురించి పూర్తిగా తెలియదు. నాకు బహుశా అతను రెండేళ్ళ సీనియరను కుంటాను. కాలేజీలో చాలాసార్లు చూశాను కానీ ప్రత్యేకంగా గుర్తించలేదు. ఆ తర్వాత అతని చదువు పూర్తయి మా ఊళ్ళోనే ఉద్యోగం కూడా దొరికింది. ఎప్పుడైనా బజార్లో కనబడితే ఏదైనా తెలిసిన ముఖం అనుకునేవాణ్ని తప్పితే పలకరింపుగా చిరునవ్వు కూడా మా ఇద్దరికీ అలవాటు లేదు.

రమణమూర్తి వ్యక్తిత్వం గురించి ఇంతో అంతో

నాకు మొదటిసారిగా తెలిసింది—కుసుమ పెళ్ళిచూపుల సమయంలో!

కుసుమ మా వీధిలోనే ఉంటున్నది. చాలా అందంగా ఉంటుంది. నాకంటె మూడేళ్ళు చిన్నది. కాలేజీలో రెండేళ్ళు జూనియర్.

కుసుమ చలాకీ అయిన పిల్ల. అందానికి చలాకీతనం తోడు కావడంవల్ల ఆమెకు కాలేజీలో చాలామంది ప్రేమలేఖలు వ్రాస్తూండేవారు. అలా వ్రాసినవారిలో నా స్నేహితులు కూడా ఉన్నారు. నేను మాత్రం ఎప్పుడూ రాయలేదు. స్నేహితులు తామేం రాస్తున్నారో నాకు చెబితే ఆ భాష విని నేనూ ఆనందించేవాణ్ని.

“కుసుమను పెళ్ళాడేవాడెవరో గానీ—చాలా అదృష్టవంతుడౌతాడు—” అంటూండేవారు నా స్నేహితులు. వారి అభిప్రాయాలతో నేనూ ఏకీభవించేవాణ్ని. మానసికంగా నాకూ అంతో ఇంతో కుసుమపట్ల ఆరాధన ఉన్నది. మా వీధి పిల్ల కావడంవల్లనో, నేను పెరిగిన వాతావరణమో నాలో చొరవ ఆట్టే లేకుండా చేసింది. వాతావరణం గురించి ఎందుకనవలసి వచ్చిందంటే—కుసుమకే కాదు—మరే ఆడపిల్లకూ నేను ప్రేమలేఖలు వ్రాయలేదు.

కుసుమ ఎవ్వరికీ జవాబులు వ్రాయలేదు. ఆమె మామూలుగా కాలేజీకి వస్తూ పోతూండేది. ఆమె నడవడిక, వేషధారణ నలుగురికీ గౌరవం కలిగించే విధంగానే ఉండేవి.

కుసుమను చూసుకొనేందుకు రమణమూర్తి వచ్చాడు. పెళ్ళి చూపుల్లోనే కట్నం ప్రసక్తి కూడా వచ్చింది. అన్నీ యించుమించు నచ్చినట్లే! పెళ్ళికొడుకుతో

మాట్లాడడం కోసమని కుసుమ తండ్రి నన్ను వాళ్ళింటికి పిలిచాడు.

అప్పుడే నేను రమణమూర్తితో మొదటిసారిగా మాట్లాడేను.

వాటం చూస్తే అతడికి కుసుమ నచ్చినట్లే కనబడింది.

కుసుమకు పెండ్లి అవుతున్నదంటే నాకు రవంత బాధ అనిపించింది కూడా!

రమణమూర్తి నన్ను పక్కకు పిలిచి—"ఇలా అడుగుతున్నందుకు ఏమీ అనుకోకండి—కుసుమ చాలా అందమైనది కదూ!" అన్నాడు.

"చాలా చాలా అందమైనది—" అన్నాను.

"ఆమెకు నేను తగిన వరుడినేనా?" అన్నాడతను వెంటనే.

"ఇది ఆమె చెప్పవలసిన మాట!" అన్నాను.

అప్పుడు అడిగాడు రమణమూర్తి — అంతవరకూ నేనూహించని ప్రశ్న .... "అడగ్గానే చాలా చాలా అందమైనది అని చెప్పారు. ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకండి — ఆమె గురించి మీరు చాలా ఆలోచించారా?"

"పెద్ద దెబ్బ కొట్టావు గురూ!" అనుకున్నాను. అటు నుయ్యి, ఇటు గొయ్యి అన్నట్లు ఈ ప్రశ్నకెలా జవాబిచ్చినా తప్పే అవుతుంది. ఆలోచించాను అంటే నాకు దెబ్బ. లేదు అంటే అతన్ని తృప్తిపర్చడంకోసం నోటికొచ్చిన అబద్ధం చెప్పాననుకోవాలి....

అదృష్టవశాత్తూ మంచి సమాధానం స్ఫురించింది— "ఆడపిల్లల గురించి ఎక్కువగా ఆలోచించే అలవాటు నాకులేదు. నా స్నేహితులామె అందాన్ని తరచుగా

నా దగ్గర పొగుడుతూం డేవారు—" అన్నాను.

ఈ నిజం చెప్పడంవల్ల అతడు తన అదృష్టాన్ని గ్రహిస్తాడని నేననుకున్నాను. కానీ అతడి ప్రశ్నల పరంపర అంతటితో ఆగలేదు — "వాళ్ళసలు మీ దగ్గర కుసుమ ప్రసక్తి ఎందుకు తీసుకొచ్చేవారు? మీరు ప్రోత్సహించేవారా?"

"ఓరినీ—" అనుకున్నాను. పెళ్ళిచూపులు కుసుమకా, నాకా అన్న సందేహం కలిగింది. నెమ్మదిగా అసలు విషయం చెప్పాను. కుసుమకు యెందరో ప్రేమలేఖలు వ్రాసేవారు. ఆమె బదులుకోసం ఎదురుచూస్తూ ఆమె గురించి చర్చలు జరుపుతూం డేవారు. ఎవ్వరికీ ఆమెనుంచి బదులు మాత్రం వచ్చేది కాదు.

"ఆమె ఎప్పుడూ ప్రిన్సిపాల్ కి రిపోర్టు చ్చేది కాదా?"

"లేదు. ఆమె మనసు చాలా మంచిది—" అని నాలిక్కొరుచుకున్నాను. మనసు మంచిదని నాకెలా తెలుసునని అడుగుతాడేమోనని భయంవేసింది. కానీ అతనింకేమీ అడగలేదు—"మా పెద్దవాళ్ళు చేసుకోమంటే కుసుమను చేసుకోవడం మీకిష్టమేనా?" అని మాత్రం అడిగాడు.

ఏ మాత్రమూ ఆలోచించకుండా—ఇష్టమేనని బదులిచ్చాను.

పెళ్ళిచూపులు అయిపోయాయి. రెండ్రోజులతర్వాత కబురు తెలిసింది రమణమూర్తికి పిల్ల నచ్చలేదని. ఆ తర్వాత రెండ్రోజులకు రమణమూర్తి నన్ను ఓసారి స్వయంగా కలుసుకొని ధన్యవాదాలు చెప్పాడు. అప్పుడు నాకు తెలిసిందేమిటంటే కుసుమ గురించి అంతవరకూ అతడికేమీ తెలియదు. అతడామెను నిరాకరించడానికి కారణం నేనిచ్చిన సమాచారమే!

నేనాశ్చర్యంగా—"నేనిచ్చిన సమాచారంలో ఆమె గురించి తప్పేముంది?" అన్నాను.

అతను చెప్పాడు. కుర్రాళ్ళు అందరాడపిల్లలకూ ప్రేమలేఖలు వ్రాయరుట. ఆడపిల్లలో ఏదో బలహీనత కనపడితేనే ప్రేమలేఖలు వ్రాయడం జరుగుతుందట. ప్రేమలేఖలు వచ్చిన ఆడపిల్లల మనసులు పవిత్రంగా ఉండవట. వాళ్ళు ఉత్తరాలు రాసిన మగపిల్లల గురించి ఆలోచిస్తారుట. ఆ మగపిల్లలపైన ఎంతో కొంత అభిమానం, సానుభూతి ఉంటేతప్ప—ఆ ఉత్తరాల గురించి ఫిర్యాదివ్వకపోవడం జరుగదట.

"నేను యెంతో పవిత్రమైన యువతిని పెళ్ళిచేసుకోవాలని అనుకుంటున్నాను. మీరు కుసుమ గురించిచ్చిన సమాచారం నాకెంతో సహాకరించింది—"

నేను తెల్లబోయి—"ఇలా అయితే మీకు పెళ్ళికాదు. కాలేజీలో చదివే చాలామంది అమ్మాయిలకు ప్రేమలేఖలు వస్తాయి. అది వాళ్ళ తప్పుకాదు—" అన్నాను.

"అంతగా అవసరమైతే ఏ పల్లెటూరి అమ్మాయినో చేసుకుంటాను తప్పితే—ప్రేమలేఖలు అందుకొని ఫిర్యాదివ్వకుండా ఊరుకున్న అమ్మాయిని మాత్రం పెళ్ళి చేసుకోను—" అన్నాడు రమణమూర్తి.

"అంతా మీలాగే ఆలోచిస్తే — అసలు కుసుమకు పెళ్ళేకాదు!"

"అలాగెందుకనుకోవాలి? అప్పుడడిగితే మీరామెను చేసుకుందుకు సిద్ధంగా ఉన్నట్లే చెప్పారు—...." అని వెళ్ళిపోయాడతను.

అప్పుడు నా బుర్ర పనిచేయడం ప్రారంభించింది.

కుసుమ ఇంట్లో తెలియదు కానీ ఆమె వివాహం

కేవలం నా కారణంగా ఆగిపోయింది. నేను తెలివితక్కువ వాడినై రమణమూర్తికి ఏమేమో చెప్పాను—ఫలితం గురించి ఆలోచించకుండా!

నేను చేసిన తప్పుకు పరిహారంగా నేనేం చెయ్యాలి? కుసుమ ఇంట్లో విచారించగా సంబంధం తప్పిపోయినందుకు వారేమీ బాధపడడంలేదనిపించింది. కుదిరితే వెంటనే చేసేద్దామనుకున్నారు తప్పితే—ఆమె వివాహం గురించి వారేమీ తొందరపడడంలేదు.

మొదటిసారిగా నేను ధైర్యంచేసి ఒక ఆడపిల్లతో మాట్లాడేను. ఆ ఆడపిల్ల కుసుమ. ఆమెకు జరిగినదంతా చెప్పి—"తప్పంతా నాదే! అతడిలా అర్థంచేసుకొని పెళ్ళి కాదంటాడని నేనూహించలేదు—" అన్నాను.

కుసుమ సానుభూతితో నా వంక చూసి—"ఇందులో మీ తప్పేమీ లేదు. పైగా మీరు నాకెంతో ఉపకారం చేశారు. ఇలా అనుమానించే మనిషిని పెళ్ళి చేసుకొంటే జీవితాంతం నరకం అనుభవించాలి. మీ కారణంగా ఈ సంబంధం తప్పిపోయిందంటే అందుకు నేను మీకు ఋణపడివుంటాను—" అంది.

కుసుమవంటి ఆడపిల్ల నాకు ఋణపడివుంటానంటే ఆ మాటలకే నా శరీరంలో ఏదో విద్యుత్తు ప్రవేశించింది.

"ఇంకెప్పుడూ యెవ్వరికీ ఆ మాట చెప్పను—" అన్నాను.

"చెప్పకండి. చెబితే నిజంగానే నాకు పెళ్ళికాదు-" అంది కుసుమ.

"అంతా రమణమూర్తిలాగే ఉంటారంటారా?" అన్నాను.

"అందరి సంగతీ యెందుకు? మీ సంగతి చెప్పండి."

అందామె.

ఉలిక్కిపడ్డాను. తడబడ్డాను. ఆమె ఇలాగంటుందని అనుకోలేదు. ఒక్క పిసరు ఆవేశం కూడా కలిగింది. అందమైన ఆడపిల్ల యెదురుగా కూర్చుని నన్ను సవాలు చేస్తున్నట్లనిపించింది. చటుక్కున—"నా చదువు పూర్తి కాలేదనీ, ఉద్యోగంకోసం ఎదురుచూడవలసి ఉందనీ సందేహిస్తున్నానుగానీ నాకు మీరంటే చాలా చాలా యిష్టమన్న సంగతి యెప్పుడో చెప్పివుండేవాణ్ని!" అన్నాను.

కుసుమ కనులు రెపరుపలాడించి ఆశ్చర్యంగా నావంక చూసి—"మంచి సంబంధం వచ్చిందని మా వాళ్ళు పెళ్ళి చూపులు ఏర్పాటుచేశారుగానీ నా పెళ్ళికి అర్జంటేమీ లేదు. మీరు నిజంగా నన్ను ప్రేమిస్తూండివుంటే ఆ విషయం పెద్దవాళ్ళకు చెబితే — అంతకాలం ఆగడానికి వాళ్ళకూ, నాకూ కూడా అభ్యంతరముండదు—" అంది.

ఒక్కసారి గాలిలో తేలిపోయినట్లుంది నాకు. ఆమె ఈ ఒక్కమాట అన్నందుకు నేనామెకు జీవితాంతం ఋణపడి ఉండగలను. వయసు, అనుభవం ఉండివుంటే ఈ దేశంలోని ఆడపిల్ల ప్రేమకు అంత విలువనిచ్చి ఉండేవాణ్ని కాదు. కానీ నా కాలేజీ జీవితం, ఉరకలు వేసే వయసు — కుసుమపట్ల నాకు అనురాగాన్ని కలిగించాయి. నేను ఇంట్లో నా ప్రేమ గురించి చెప్పాను.

కుసుమ పెద్దలు మా పెద్దల్ని అడిగారు. పెళ్ళి నిశ్చయమయింది.

"ఆ రోజు జరిగిన పెళ్ళి చూపులు—నీతో నే జరిగా యనుకుంటాను—" అన్నాడు కుసుమ తండ్రి నాతో.

ఆ తర్వాత మూడు సంవత్సరాలు కుసుమ, నేను

ప్రేమికులుగా జీవించాం. ఆ జీవితం నాకు సువర్ణాక్షురాలతో లిఖించుకోదగినది. ఒకరినొకరు అభిమానించుకుంటూ, ఒకరినొకరు ప్రేమించుకుంటూ, ఒకరినొకరు పొగుడుకుంటూ-ప్రేమానురాగాలను మాటలకుమాత్రమే పరిమితం చేసుకుంటూ గడిపిన ఆ రోజులు ప్రతి యువకుని జీవితానికి అద్భుత వరాలు.

నాకు ఉద్యోగం వచ్చినాకనే కుసుమతో నా వివాహం జరిగింది. వివాహం జరిగేక—ఉద్యోగం కోసం యెదురుచూస్తూ ఎలాంటి చనువు, ఆత్మీయత పోగొట్టుకున్నానో అర్థమయింది. అర్థాంగిగా కుసుమ నాకు దేవుడిచ్చిన వరం.

రమణమూర్తి అంటే ఒక విధంగా నాకు అసహ్యామైనా—మరో విధంగా ఇష్టంకావడానికి కారణమిదే!

## 2

నేను, కుసుమ ఒక మహాపట్నంలో జీవితం ఆరంభించాం. అసలు మాకు వేరొకళ్ళ గురించి పట్టించుకోవాలని లేదు. అంతగా ఒకరినొకరు ప్రేమించుకుంటున్నాం. అయినప్పటికీ మా ఎదురింటి దంపతుల్ని పట్టించుకోకుండా ఉండలేకపోయాం.

ఆయన పేరు కృష్ణారావు. ఆమె పేరు చంచల. చెప్పుకోదగ్గ అందగత్తె. కృష్ణారావులో ఏ ప్రత్యేకతా లేదు కానీ కురూపి మాత్రం కాదు.

కృష్ణారావు యెక్కడ పనిచేస్తున్నాడో తెలియదు కానీ యెక్కువగా అఫీసు టూర్ల మీద వుంటాడు. ఇంట్లో గడిపేది నెలకు అయిదారు రోజులుంటుందేమో! ఆ అయిదారు రోజుల్లోనూ రాత్రిళ్లు క్లబ్బులో పేకాడుతాడు. ఒకోసారి తెల్లవారుఝాముదాకా ఇంటికి రాక

పోవడం కద్దు.

ఆ భార్యాభర్తలిద్దరు కలిసి మాట్లాడుకోవడం, కలిసి సినిమాలకు వెళ్ళడం మేమెప్పుడూ చూడలేదు. ఇద్దరూ మాకులాగే చిన్నవారు. కానీ వారి జీవన విధానం మాకు పూర్తిగా విరుద్ధం.

"యెవరి పద్ధతి వారిది—" అని సరిపెట్టుకున్నా మాకు కుతూహలం ఆగలేదు. వాళ్ళెందుకు కలాగుంటున్నారో తెలుసుకోవాలని నాకు ఆత్రుతగావుండేది.

ఇలా ఉండగా నా శ్రీమతి ఒక రోజున నాకో పెద్ద విశేషం చెప్పింది. చంచల ఇంట్లో ఆ రోజు మధ్యాహ్నం ఒక మగాడు దూరాడట. సాయంత్రం దాకా బయటకు రాలేదట.

ఇది వినగానే నా మనసు పరిపరివిధాల పోయింది. భర్త నిర్లక్ష్యం చేస్తున్నాడనా ఆమె ఇలా చేస్తోంది?

"ఒకవేళ ఆయన ఆమె భర్తేనేమో?"

"కాదని కచ్చితంగా చెప్పగలను. ముఖం సరిగ్గా కనపడకపోయినా ఇతడిది పచ్చటి ఛాయ. కృష్ణారావు గారి రంగు నలుపుగదా!" అంది కుసుమ.

"అయితే ఓ పని చెయ్యి—ఆమె ఇంటికి వెళ్ళి మీ ఇంటికెవరూ చుట్టాలొచ్చినట్లున్నారు—అను. ఆవిడ తడబడుతోందో, ఏం చెబుతోందో చూడు—" అన్నాను.

కుసుమ కుతూహలం అన్నింటినీ జయించింది. వాళ్ళ పుస్తకం ఒకటి మా ఇంట్లో వుంది. అది తిరిగి ఇచ్చేసే వంక పెట్టుకుని ఆమె వాళ్ళింటికి వెళ్ళి తలుపు తట్టకుండానే తిరిగి వచ్చేసింది.

ఇదంతా నేను మా ఇంటి కిటికీలోంచే చూస్తూనే ఉన్నాను. కుసుమ రాగానే—"ఏం కుసుమా? తలుపు

తట్టనేలేదు...." అన్నాను.

"ఏం తలుపు తట్టనండీ—సిగ్గేసింది కూడాను. లోప ల్నుంచి ఆవిడ కిలకిలలాడిపోతోంది—" అంది కుసుమ.

నా ఆసక్తి పెరిగిపోయింది—"ఒకవేళ భర్త వచ్చాడేమో...."

"పోదురూ — కృష్ణారావుగారి కామాత్రం సరసం కూడానూ—" అంది కుసుమ నా మాటల్ని తీసి పారేస్తూ.

"ఆయన సరసం గురించి నీకేం తెలుస్తుంది? కొందరు నిండు కుండలా ఉంటారు. తలుపులు మూసినప్పుడాయన ఏం చేస్తాడో నీకూ నాకూ ఏం తెలుస్తుంది? ప్లీజ్ వెళ్ళిరా కుసుమా!" అన్నాను.

నిజానికి ఆసక్తి కుసుమకూ ఉంది. కానీ నా కోసం వెడుతున్నట్లే వెళ్ళింది. లేని అయిష్టాన్ని నటిస్తూ వెళ్ళింది.

ఈసారి కుసుమ తలుపు తట్టింది. తలుపులు తెరుచుకోడానికి అయిదు నిముషాలు పట్టింది. తలుపు చంచలే తీసింది. ఆమెను చూడగానే అప్పుడే ప్రియుని గాఢ పరిష్వంగంలోంచి వచ్చినట్లు తెలిసిపోతుంది. బొట్టు, జుట్టు చెదిరిపోయాయి.

తర్వాత కుసుమ లోపలకు వెళ్ళింది. వెనక్కు రావడానికి పదినిమిషాలు పట్టిందామెకు.

కుసుమ ఇంట్లో అడుగుపెడుతూనే-"అతను ఇంట్లో నే ఉన్నాడు—" అంది. అందులోనే నాకు సగం సమాధానం దొరికింది. కృష్ణారావింట్లో ఉంటే ఆయన అని అంటుందామె. నేనింకా ఏదో అడిగే లోగానే—"చంచల మంచిదికాదు—" అంది. పక్కలో బాంబు పేలినట్లు ఉలిక్కిపడ్డ నేను ఆ షాక్‌నుంచి తేరుకునేలోగా

ఆమె—"హవ్వ!" అంటూ బుగ్గలు నొక్కుకున్నది.

"ఏం జరిగింది కుసుమా?"

"నేనన్నానూ — మధ్యాహ్నం మీ ఇంటికెవరో చుట్టాలొచ్చినట్టున్నారు—....అని. దానికామె వెంటనే అతను మీ కంటబడ్డాడూ—నేను చెబుతూనే ఉన్నాను దొడ్డిదారిని రమ్మనమని—యెవరు చూస్తారులే అంటాడు. మీరు చూడనేచూశారు — అంది. అంది కానీ ఏమీ గాభరాపడినట్లు కనపడలేదు. నేను ఏమీ ఎరుగనిదానిలా దొడ్డిదారిని రావడమేమిటండీ అన్నాను. దానికామె పగలబడి నవ్వింది. అవునులే—మీకెందుకు తెలుస్తుందీ— అన్నది. మరీ బరితెగించినదానిలా ఉంది. మీ ఇంటికి దొడ్డిదారి సదుపాయం లేదుకదూ అని మళ్ళీ నవ్వింది. నేను పుస్తకం ఇచ్చేసి మరో పుస్తకం తెచ్చుకొని వచ్చేస్తూంటే—మా ఇంటికి చుట్టాలొచ్చారనీ—అందులోనూ మగ చుట్టాలొచ్చారని యెవరిదగ్గరా అనకండి. అందరికీ మాట్లాడుకుందుకు ఇదే టాపిక్ అవుతుంది— అన్నది. నేనేమీ అనకుండా వచ్చేశాను—"

ఇదంతా వినగానే నాకు మతిపోయినట్లయింది. చంచల వ్యవహారం నడపడమేకాదు—చాలా ధైర్యవంతురాలిలా గున్నది. అందుకామెను మెచ్చుకోవాలా, నిందించాలా? ఆలోచిస్తూంటే కొంత తప్పు కృష్ణారావుదేననిపించింది. అయితే మాకు సరిగ్గా వారి జీవిత విధానం గురించి తెలియదుకదా — అలాంటప్పుడు కృష్ణారావు గురించి ఒక అభిప్రాయం ఏర్పరచుకోవడం సబబుకాదనిపించింది.

# 3

ఆ రోజు నేను ఆఫీసునుంచి లేటుగా బయల్దేరాను. బస్సునందుకోవడం కోసం నడక వేగం హెచ్చించాను. ఆ సమయంలో వెనకనుంచీ నా భుజంమీద యెవరిదో చేయి పడింది. ఎవరా అని చూస్తే కృష్ణారావు.

ఆశ్చర్యంతో ఆగిపోయాను.

మేమిద్దరం ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం కొత్త కాదు. కానీ ఇలా చనువుగా భుజంమీద చేయివేసి పలకరించడం ఇదే ప్రథమం.

"మీరింటికి వెళ్ళడానికి వేగిరపడుతూంటారని నాకు తెలుసు. కానీ ఒక్క పది నిముషాలు నా కోసం వృథా చేయగలరా?" అన్నాడతను దీనంగా.

"అయ్యో-యెంతమాట?" అన్నాను నొచ్చుకుంటూ.

ఇద్దరం దగ్గరోవున్న పార్కుకు వెళ్ళాం.

"మీరు చాలా అదృష్టవంతులు—" అన్నాడతను.

"మీ గురించి ఏమో చెబుతానన్నారు?" అన్నాను మొహమాట పడుతూ. నా అదృష్టం గురించి యెవరు మాట్లాడినా నాకు మొహమాటం వేస్తుంది. నా అదృష్టమేమిటో కూడా నాకు తెలుసు.

"చెబుతాను. నాకు మీలాగే భార్యతో కలిసి విహరించాలనీ, సరదాగా గడపాలనీ ఉంటుంది—" అన్నాడతను.

"దానిదేముంది? అందుకు ఉద్యోగం కూడా సహకరించాలిగదా—అన్ని ఉద్యోగాలూ ఒక్కలాగుండవు-" అన్నాను.

"అదేం లేదు. నా ఉద్యోగంలో నాకు కావలసినంత ఫ్రీ టైం ఉన్నది—" అన్నాడు కృష్ణారావు.

అత నేం చెప్పబోతున్నాడో నాకు అర్థంకాలేదు.

"కావాలంటే నేను సరిగ్గా సాయంత్రం అయిదింటికి ఇల్లు చేరవచ్చు. అర్థాంగితో షికార్లు కొట్టవచ్చు. టూర్లు మానేసి యెప్పుడూ ఊళ్ళోనే ఉండవచ్చు. కానీ నా భార్యకది ఇష్టంలేదు...." అతనో క్షణం ఆగాడు.

"యెందుకని?" అన్నాను అప్రయత్నంగా.

"చెప్పటానికి సిగ్గుపడవలసిన విషయమిది. కానీ చెప్పక తప్పదు. నా భార్యకు నేనంటే ఇష్టంలేదు—" అన్నాడు కృష్ణారావు.

"ఎందుకని?"

"ఆమె ఎవర్నో ప్రేమించిందట. తలిదండ్రులు తనకు ఇష్టంలేని పెళ్ళి చేశారట. ఈ విషయం నాకు తెలిసే అంగీకరించానని ఆమె అనుమానం. అందుకని ఆమె నా జీవితం నరకం చేయాలని సంకల్పించుకున్నది. ఆమెకు నామీద కసి. నేనంటే కోపం. నన్నవమానించడమే ఆమె ధ్యేయం. యెప్పటికైనా ఆమె మారకపోతుందా అని ఆశగా యెదురుచూస్తున్నాను. కానీ ఆమె మరీ బరితెగించిపోయింది. పరాయి పురుషులతో సంబంధం పెట్టుకోవడమే కాకుండా...." అని ఆగి ఓసారి అతను కళ్ళు తుడుచుకున్నాడు.

నేనాశ్చర్యపోయాను. అతన్నంతగా కదిలించిన ఆ విశేషమేమిటి? భార్య పరాయి పురుషులతో సంబంధం పెట్టుకుంటే ఏడ్వడం మినహా ఏమీ చేయలేడా అతను?

"చెప్పండి!" అన్నాను.

"చెబుతాను-" అన్నాడతను-"ఆమె ఒకొక్కరితో తన అనుభవాలు వర్ణించి చెబుతుంది. యెవరి ముద్దు ఎలా ఉంటుందో వివరిస్తుంది. అది నేను భరించలేను—"

"ఆమె చెబుతుంటే మీరు వింటారా?" అన్నాను ఆశ్చర్యంగా. యెందుకంటే యిష్టంలేనప్పుడు వినడమెందుకు?

"వినక ఏం చేయను? తన అనుభూతులు వేరెవరికైనా చెప్పుకుంటే తప్ప ఉండ లేద ట. నేను వినకపోతే వేరెవరికైనా చెప్పుకుంటానంటుంది. అందుకని నేనే వింటాను...."

నిజంగా నరకమేననిపించింది.

కృష్ణారావు మళ్ళీ అన్నాడు—"నాకు అందం వుంది. నాలో ఆకర్షణ వుంది. నేను మగాళ్ళని రప్పించుకుంటాను. నీకూ దొరికితే ఆడాళ్ళతో తిరుగు. నేనేమీ అనుకోను—అందామె. అది సవాలు. ఆ సవాలుపై నాకాసక్తిలేదు. ఆమె మారదని గ్రహించాక నేనో నిర్ణయానికి వచ్చేశాను...."

"విడాకులా?"

"కోర్టుకెక్కడం నాకిష్టంలేదు. కోర్టుకెక్కడంవల్ల మొత్తం కథంతా బయటపెట్టవలసి ఉంటుంది. సమాజంలో అలాంటి చేతకాని భర్తగా ముద్రవేయించుకోవడం నాకిష్టంలేదు. అందుకని...."

"అందుకని?" కుతూహలం ఆగడంలేదు నాకు.

"నేను చచ్చిపోదల్చుకున్నాను —" అన్నాడు కృష్ణారావు.

ఆశ్చర్యంతో నోరు తెరిచాను.

"ఈ విషయంలో నాకు మీ సహాయం కావాలి!"

"నా సహాయమా—మీరు చావడానికా?"

కృష్ణారావు విషాదంగా నవ్వి — "నేను నిజంగా చావను....చచ్చిపోయినట్లు నటిస్తాను...." అన్నాడు.

అసలు మొత్తం పథకం అర్థంచేసుకోవడానికి నాకు కాసేపు పట్టింది.

కృష్ణారావుకు టెలిగ్రాం వస్తుంది — ఓ ప్రాణ స్నేహితుడు చనిపోయినట్లు. ఆ షాక్ కు తట్టుకోలేక వెంటనే గుండె ఆగి మరణిస్తాడతను. డాక్టరు వచ్చి సహజ మరణమేనని సర్టిఫికెట్ ఇస్తారు. శవాన్ని దహనం కూడా చేస్తారు. ఆ శవం మాత్రం కృష్ణారావుది కాదు. యెవడో అభాగ్యుడిది. ఆ శవం కృష్ణారావుదేనని నేను సాక్ష్యం చెప్పాలి.

శవాన్ని ప్రభుత్వ ఆస్పత్రిలో ఇస్తామన్నారట. యెటొచ్చీ ఇద్దరు మనుషులు కావాలిట అందుకు. ప్రభుత్వోద్యోగి ఒక్కడైనా ఉండాలిట. అనాథ ప్రేత సంస్కారం చేస్తే తన తండ్రి ఆత్మ శాంతిస్తుందని కృష్ణారావు హాస్పిటల్లో అబద్ధం చెప్పాడు. నేను ప్రభుత్వోగిని కాబట్టి నా సాయం కోరుతున్నాడు.

"ఇదంతా ఎందుకు?" అన్నాను.

"మీతో అబద్ధం చెప్పను. నా జీవితాన్ని లక్ష రూపాయలకు ఇన్స్యూరు చేశాను. నా భార్య దానికి నామినీ. నేను పోతే ఆమెకు లక్షరూపాయలు వస్తాయి. అదీ ఆమెకు లాభం. ఈ లాభానికి ఆశపడి ఆమె ఈ పథకానికి ఒప్పుకుంది. కానీ ఇదంతా నా ఒక్కడివల్లా అయ్యేదికాదు—"

ఇందులో ఏదో తిరకాసుందనిపించింది నాకు—

"మీ రేమీ అనుకోవద్దు—ఇలా అడుగుతున్నానని! డబ్బు కోసం మీరిద్దరూ కలిసి ఆడుతున్న నాటకం కాదు కదా ఇది—" అన్నాను.

అతడి ముఖం పాలిపోయింది—"యెవరికైనా ఇలాంటి

అనుమానం రావడం సహజం. నా పరిస్థితి అలాంటిది. కానీ ఆ పాతకని వదిలించుకోవడానికి నాకు మిగిలిన మర్యాదైన మార్గం ఇదొక్కటే! ఆమెకు డబ్బాశ బాగా ఉంది. నేనాడేది నా కోసమాడే నాటకం కాదని తెలుసుకుందుకైనా మీరీ నాటకంలో సహాయం చేయాలి—"

అతడి ముఖం చూస్తూంటే జాలివేస్తోంది. కానీ ఇదేదో పెద్ద గూడుపుఠాణి అని నాకు అనుమానంగా ఉంది. సరువుగా బ్రతుకుతున్నాను. కుసుమతో జీవితం నాకెంతో హాయిగా ఉంది. ఇప్పుడనవసరంగా చిక్కుల పాలవుతానేమో! నాలో రకరకాల అనుమానాలు తలెత్తుతున్నాయి.

"చూడండి సార్! మిమ్మల్ని చూస్తే నాకు అసూయ. మీలాంటి జీవితం గడపాలన్నది నా కోరిక. అదృష్టమంతా మీ సొత్తేనన్నట్లు మీరు మాట్లాడకూడదు. నాబోటివారికి కాస్త అవకాశమివ్వాలి. ఈ పాతకని వదుల్చుకోడానికి నేను నిక్షేపంలాంటి ఉద్యోగాన్ని కూడా వదులుకొని వెళ్ళిపోతున్నాను. ఆ తర్వాత జీవితం ఎలా ఉంటుందో కూడా నాకు తెలియదు. కొత్త జీవితంలో స్థిరపడితే మీకులాగే నేనూ ఓ మంచి అమ్మాయిని పెళ్ళి చేసుకొని సుఖపడతాను. నాకో అవకాశమివ్వండి సార్! ఆలోచించండి సార్!" అన్నాడతను.

"ఏ విషయమైనా ముందు మా ఆవిడకు చెప్పాలి—" అన్నాను.

## 4

రెండు రోజుల తర్వాత నేనింటికి వెళ్ళేసరికి కుసుమ ముక్కు చీదేస్తోంది.

"ఏం జరిగింది కుసుమా!" అన్నాను.

"పాపం, మీరు ఆ కృష్ణారావుగారికి సాయం చెయ్యాలండీ—" అందామె.

"అరే—ఏమయింది కుసుమకు...." అనుకున్నాను. రెండు రోజుల క్రితం కుసుమకు కృష్ణారావు సంగతి చెబితే ససేమిరా వల్లకాదంది.

జరిగిందేమిటంటే చెల్లెమ్మా అని సంబోధిస్తూ కృష్ణారావు కుసుమకు ఉత్తరం రాశాడు. ఫలానా సాయం అని రాయకపోయినా తన పరిస్థితి వర్ణించేసుకుని నన్ను తనకు సాయంచేసేలా నచ్చచెప్పమని ఆమెను అర్థించాడు. ఆ ఉత్తరం చదివితే కఠిన శిలలే కరిగిపోతాయి. కుసుమ కోమలి అయిన కుసుమ ఎంత?

నాకు తప్పలేదు.

కృష్ణారావు అట్నించి నరుక్కు వచ్చాడు. తెలివైనవాడే!

నిజం చెప్పాలంటే ఏదో మూల నాకూ అతడికి సాయపడాలని ఉన్నది.

మర్నాడు సాయంత్రం అతడికా విషయం చెప్పాం. అప్పటికప్పుడు ఇద్దరం హాస్పిటల్ కి వెళ్ళాం.

శవం దొరికింది.

"అదృష్టవంతుడు. దిక్కులేని చావు చస్తాడనుకుంటే అన్నీ వైభవంగా జరుగుతున్నాయి—" అంటూ గొణుక్కున్నాడక్కడి వ్యక్తి.

శవాన్ని పెట్టెలో పెట్టి ఇంటికి తీసుకువెళ్ళాడు కృష్ణారావు.

ఓ రాత్రివేళ మా ఇంటికి చంచల వచ్చింది. ఏదో టెలిగ్రాం వచ్చిందనీ తన భర్త షాక్ తిని పడిపోయాడనీ

కదలడంలేదనీ చెప్పిందామె.

ఆమె యెంత సహజంగా నటిస్తోందంటే ముందుగా కృష్ణారావు చెప్పినప్పటికీ కూడా ఆమె చెప్పిందంతా నిజమేననిపిస్తోంది. మమ్మల్నిద్దర్నీ వాళ్ళింట్లో ఉంచి తను డాక్టరు దగ్గరకు వెళ్ళింది.

గదిలో చూద్దాము కదా — శవం రూపమే మారి పోయింది. ఇంట్లో కృష్ణారావు లేడు. అతను దొడ్డిదారిన వెళ్ళిపోయి ఉంటాడు. శవానికి చాలావరకూ కృష్ణారావు రూపం వచ్చేసింది. అది అతడి శవం కాదని తెలుసు కాబట్టి కానీ లేకపోతే అనుమానించడం చాలా కష్టం.

నా బుర్రలో రకరకాల ఆలోచనలు పరుగెడు తున్నాయి.

నిజంగానే ఈ భార్యాభర్తలకు ఒకరంటే ఒకరికిష్టం లేదా? లేక ఇద్దరూ కలిసి తెలివిగా నాటకమాడు తున్నారా? అలా తెలివిగా నాటకమాడడానికి కేవలం డబ్బే కారణమా? లక్షరూపాయల కోసం కృష్టారావు తన భార్య శీలం మంచిదికాదని అబద్ధం చెప్పేటంత నీచపు స్థాయికి దిగజారిపోయేడా?

చంచల డాక్టరుతో కలిసి వచ్చింది. డాక్టరు శవాన్ని పరీక్షించి గుండె ఆగి మరణించినట్లు చెప్పాడు.

నేను, కుసుమ ఇరుగు పొరుగులను పిలిచాం. వచ్చిన వాళ్ళు వచ్చారు. శవ వాహకులకు కబురు వెళ్ళింది. కృష్ణారావు గురించి రావలసిన వాళ్ళెవ్వరూ లేరు. అందువల్ల అప్పటికప్పుడు అన్ని ఏర్పాట్లూ జరిగి పోయాయి.

"ప్రాణ స్నేహితుడట. చిన్ననాటినుంచీ యెంతో సాయం చేశాట్ట. అతడి మరణవార్త వినేసరికి గుండె

ఆగి మరణించాడట. స్నేహమంటే వాళ్ళదీ స్నేహం—"
అందరూ వ్యాఖ్యానాలు విసురుతున్నారు.

నాకు ఏడుపు రావడంలేదు. నవ్వొస్తోంది.

తెల్లవారేలోగా శవ దహనం జరిగిపోయింది.

చంచల భోరున ఏడ్చింది. తనూ చచ్చిపోతానంది. కొందరామెను ఓదార్చడానికి ప్రయత్నిస్తున్నారు. కుసుమ మాత్రం ముందుకు వెళ్ళలేదు.

యెంత చక్కగా నటిస్తోంది? ఇంత చక్కని ప్రతిభ వున్న ఈమె భర్తకు తెలియకుండా తన రంకుతనాన్ని యెందుకు దాచలేకపోయింది? ఆతడికి జీవితం నరక ప్రాయం చేయాలన్న పట్టుదలా? లక్ష రూపాయలకోసం వ్యవహారాన్ని ఇంతవరకూ తీసుకవచ్చిన ఈమె ఎటువంటి ఆడది?

పక్కింటి బామ్మగారు చంచలపై పెద్దరికం తీసుకుంది. అంతకాలం ఆవిడకు చంచలమీద సదభిప్రాయముండేదికాదు. ఇప్పుడు కష్టాల్లో పడేసరికి ఆవిడకు జాలి కలిగినట్లుంది. ఆవిడకు కుసుమ అంటే యిష్టం. రోజూ వచ్చి—"ఆ పిల్ల భోజనం చేయనంటోంది. యెలాగో దగ్గరుండి ఎంగిలిపడేలా చేశాను. కానీ ఎన్నాళ్ళని ఇలా? ఆ పిల్ల దుఃఖం మాన్పూంటే నా గుండె తరుక్కుపోతోంది—" అని చెబుతూండేది. మా కావిణ్ణి చూస్తే జాలిగా వుండేది.

అయితే ఆవిడ అసలు తాపత్రయమేమిటో మాకు తర్వాత తెలిసింది. చంచల సంప్రదాయం పాటించదేమోనని ఆవిడ భయం. యెలాగో దగ్గరుండి రోజూ చంచలను ఎంగిలి పడేలా చేసినట్లే—కృష్ణారావు పోయిన పన్నెండవ రోజున దగ్గరుండి ఆమెను విధవరాలిని కూడా

చేయించాక బామ్మగారు మళ్ళీ మామూలు మనిషై చంచల గురించి పట్టించుకోవడం మానేసింది.

కృష్ణారావు చావు గురించి యెవరూ పట్టించుకోవడం లేదు. యెవరికీ దానిపై యెటువంటి అనుమానాలూ లేవు. ఇది చుట్టూ వున్న ప్రజల అమాయకత్వమా, పకడ్బందీగా పథకాలు వేయడంలో అతడికున్న ప్రతిభయా?

నాకు మాత్రం ప్రజల ఉదాసీనత ఒక విధంగా ఇష్టంగానూ, మరో విధంగా అయిష్టంగానూ ఉన్నది.

దారుణమైన మోసాన్ని గుర్తించలేని ప్రజలమధ్యన నేనంటున్నానన్న గుర్తింపు బాధను కలిగిస్తూంటే, కృష్ణారావాడిన నాటకంలో నేనూ ఒక పాత్ర నేనన్న గుర్తింపు నాకు ఉపశమనాన్ని కలిగిస్తోంది.

యెదురింట్లో చంచల ఉనికి కొనసాగుతోంది.

ఆమె నొసటన ఇప్పుడు కుంకుమలేదు. ఆమె చేతుల కిప్పుడు గాజులు లేవు. ఆమె నడిస్తే అందెలు సవ్వడి చేయవు. ఆమె తలలో అల్లరిచేసే మల్లెలుండవు. రంగుల సీతాకోకచిలుక తెల్లచీరలోకి మారిపోయింది.

అయినప్పటికీ ఆమె అందం తరగలేదు. ఆమె అలంకరణపై నాకు జాలి కలిగినా ఆమెపై నాకు జాలిలేదు. భర్త ఉన్నప్పుడే ఆమె పరాయి పురుషులను మరిగింది. ఇంక ఇప్పుడు ఆమెను ఆపగలిగిన వారెవ్వరు?

కొత్త జీవితం ఆమెలో మార్పు తెచ్చిందని కుసుమ అన్నది. ఆమె ఇప్పుడు అనుక్షణమూ కృష్ణారావు మంచితనాన్నే తల్చుకుంటుందట. అతడు లేకుండా ఎలా జీవించనూ అని వాపోతుందిట. ఇరవైనాలుగు గంటలూ దుఃఖసముద్రంలో మునిగి తేలుతున్నదట. అది నటన అని కుసుమకు తోచడంలేదుట.

ఆమె ఇంత నటన యెందుకు చేస్తున్నదో నాకు తెలియదు కానీ కుసుమకంటే ఎక్కువగా ఇరుగుపొరుగులు ఆమెపై జాలిపడుతున్నారట.

ఇన్సూరెన్స్ వారినుంచి ఆమె డబ్బు సంపాదించుకునే ప్రయత్నంలో వ్రాతమూలమైన సాయమంతా నేనే చూశాను. ఆమె అదృష్టమో ఏమో—చాలా త్వరగానే డబ్బు ఆమె చేతికందింది.

డబ్బు అందాక చంచలలో మళ్ళీ మార్పు వచ్చింది. ఆమె రంగు చీరలు కడుతోంది. గాజులు వేసుకుంటోంది. బొట్టు పెట్టుకుంటోంది. తలలో మల్లెలతో, అందెల ఘల్లుఘల్లులతో ఆమె యెందరో పడుచువాళ్ళ గుండెల్ని ఝల్లుమనిపిస్తోంది. ఆమెలోని ఈ మార్పు పక్కింటి బామ్మగారికి బొత్తిగా నచ్చలేదు.

ఒకరోజున ఆవిడ వెళ్ళి చంచలను హెచ్చరించిందట. జవాబుగా చంచల తాను మళ్ళీ పెళ్ళిచేసుకుంటానని అన్నదిట.

"అయ్యో రామా — నీకిదేం బుద్ధి?" అని ఆవిడ అంటే—పెళ్లాంపోయి నెల్లాళ్ళు తిరక్కుండా మగాళ్ళు పెళ్ళి పీటలమీద కూర్చుంటే తప్పుకాదా అని నిల దీసిందట.

అబద్ధమెందుకూ-ఇన్నాళ్ళూ చంచలపై నాకు అంతో ఇంతో సానుభూతి ఉండేది. అది కాస్తాపోయింది.

చంచల మళ్ళీ పెళ్ళిచేసుకుంటానంటే నా గుండె లదిరాయి. యెందుకంటే ఆమెను కట్టుకున్నవాడు కృష్ణా రావులాగానో, నిజంగానో చావక తప్పదు.

జరుగబోయేది చూడాలని నాకు చాలా కుతూ హలంగా ఉంది.

ఈలోగా ఇంకో ఉపద్రవం వచ్చి పడింది. కృష్ణారావుకు వచ్చిన పెలిగ్రాంలో చెప్పబడ్డ ప్రాణస్నేహితుడు అతడికున్నాడో లేడో తెలియదు కానీ నాకొకడు వున్నాడు. అతను నన్నోసారి తన ప్రాణాలకు తెగించి చెరువులోంచి రక్షించాడు. నాకు అవసరపడితే రక్తదానం చేశాడు. అతను నన్ను చూడ్డానికి వచ్చి అనుకోకుండా చంచలను చూసి మోహించాడు.

అతడికింకా పెళ్ళి కాలేదు. ఆమెను పెళ్ళిచేసుకుంటానంటున్నాడు.

## 5

నేను చాలా ఇరకాటంలో పడ్డాను.

వెంకటేశం కలవారబ్బాయి. అతడి చెల్లెలికి పెళ్ళి సంబంధం కుదరగానే అతడి పెళ్ళి జరుగుతుంది. ఓ మాదిరి సంబంధం అతడి తలిదండ్రులకు నచ్చదు. అతడి తలిదండ్రులు నాకు బాగా తెలుసు.

"చంచల లేనిదే నేను బ్రతకలేను—" అన్నాడతను మొట్టమొదటిసారిగా ఆమెను చూడగానే. ఆమె అందం సాధారణమైనది కాదనీ నాకు తెలుసు. కానీ మరీ ఇంత అసాధారణమైనదని ఇప్పుడే తెలిసింది.

"ఆమెకు వివాహమైంది. ఇప్పుడు విధవ—" అని చెప్పాను.

ఇది వినగానే వెంకటేశం స్త్రీ పునర్వివాహాల గురించి ఓ పెద్ద ఉపన్యాసమిచ్చాడు. శతాబ్దాలుగా ఆడదానికి జరిగిపోతున్న అన్యాయాల గురించి ప్రస్తావించాడు. తనలాంటి యువకులు నడుంకట్టి ముందుకురానిదే ఆడదానికి మోక్షంలేదన్నాడు.

"చంచలను చూడకముందు నీకీ విషయాలు

తెలియువా?" అనడిగాను. నా మాటల్లో వెటకార మున్నట్లు నాకే అనిపించింది.

"తెలుసో తెలియదో చెప్పలేను. కానీ వీటి గురించి యొన్నడూ ఆలోచించలేదు. గౌతమునికి బోధివృక్షంలా ఆమె దర్శనం నాలో యెన్నో రకాల ఆలోచనలు లేపుతోంది...." అన్నాడు వెంకటేశం.

వెంకటేశం సమాజాన్ని పునరుద్ధరిస్తానంటే నాకేమీ అభ్యంతరంలేదు. కానీ చూస్తూ చూస్తూ చంచలతో వివాహం యెలా జరిపించగలను? దీనంగా నన్నర్థిస్తున్న కృష్ణారావు ముఖం నన్ను కదిలిస్తోంది. అదేగతి నా ప్రాణమిత్రుడు వెంకటేశానికి పట్టకూడదు.

అయితే జరిగినదేమిటో పూర్తిగా వెంకటేశానికి చెప్పలేను. నేను పాత్ర వహించిన ఒక నేరం గురించి మరీ యెక్కువమందికి తెలియడం నాకు మంచిదికాదు.

"నీకో విషయం చెప్పక తప్పదు. చంచల బుద్ధి మంచిదికాదు. ఆమె భర్త వుండగానే మగాళ్ళను వలలో వేసుకునేది—"

"నీకెలా తెలుసు?"

ఒక పర్యాయం కుసుమకు జరిగిన అనుభవం చెప్పాను.

వెంకటేశం ముఖం గంభీరంగా అయింది—"ఒకవేళ భర్తే ఆమెనందుకు ప్రోత్సాహించాడేమో తెలుసుకున్నావా? ఈ రోజుల్లో చాలామంది మగాళ్ళు భార్య శీలంకంటే డబ్బుకే ప్రాధాన్యతనిస్తున్నారు—"

ఈ కోణంలోంచి నేను ఆలోచించని మాట నిజం. అయితే కృష్ణారావు బాధ నాకు తెలిసినదే కదా— అందుకని తన భార్య ప్రవర్తన గురించి కృష్ణారావు ఎలా వాపోయాడో చెప్పాను.

వెంకటేశం అంతా విని — "ఇది ముందరికాళ్ళకు బంధం వేయడం. తన గురించి యెవరూ మరోవిధంగా అనుకోకపోవడం కోసం కృష్ణారావే నీకీ విధంగా చెప్పాడేమో — ఈ ప్రపంచంలో ఆడదన్ననుమానించి నంత సుంభంగా మగాడినెవరూ అనుమానించరు—" అంటూ ఆవేశపడ్డాడు.

వెంకటేశం చంచల అంటే మోజుపడుతున్నాడు. అందువల్ల ఆమెను తప్పుపట్టం ఇష్టముండదతడికి. కానీ పూర్తి నిజం నాకు తెలుసు. కృష్ణారావు తన ప్రాణాలనే త్యాగం చేసినట్లు పెద్ద నాటకమాడి ఇక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అందువల్ల అతడికేం కలిసొచ్చింది. మొత్తం ఇదంతా కృష్ణారావు భార్య చేత ఆడించిన నాటకమంటే నాకు నమ్మకం కుదరలేదు. కానీ ఆ విషయం స్నేహితుడికి చెప్పాలేదు.

ఆఖరికి విసిగిపోయి — "అనుభవం మీదగానీ ఆమె యెలాంటిదో నీకు తెలియదు. ఒక్కసారి ప్రయత్నించి చూడు—" అన్నాను.

నేనిలాగంటానని వెంకటేశం ఊహించినట్లు లేదు. మనిషి ఏదోలాగైపోయాడు—"నీకు పెళ్ళయింది. చెల్లెళ్ళు కూడా ఉన్నారు. నీలో సంస్కారముందని అనుకున్నాను. కానీ మరీ ఇలా మాట్లాడతావని నేనూహించ లేదు—"

అప్పటికి నేను తేరుకున్నాను. నాలో సంస్కారముస్నది. కానీ చంచల గురించి అలాగనడం కుసంసంస్కారమనిపించుకుంటుందా? నేను మాటలు వెనక్కు తీసుకోలేదు.

"నా మాట నమ్ము. ఒకసారి ప్రయత్నించి చూడు.

యెలాగూ ఆమెను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నావు కాబట్టి ప్రయత్నించడంలో తప్పులేదు. ఎటొచ్చీ నా మాట విని ముందే పెళ్ళి గురించి మాట్లాడకు. నీవంటి వాడిమీదకు తెలివిగా గాలం విసరగల సమర్థురాలామె. కానీ అలా జరిగితే నీ తలిదండ్రులకేమని సమాధానం చెప్పగలను? మొదటిసారి ఆమెను కలుసుకొని కేవలం నీ కోరిక వెలిబుచ్చు. ఆమె తప్పక అంగీకరిస్తుంది. అంగీకరించక తిట్టినా పెళ్ళి మాటలు మాట్లాడకు. ఏం జరిగిందో వచ్చి నాకు చెప్పు. తర్వాతేం చేయాలో చెబుతాను—"

## 6

వెంకటేశం వీధిలో ఎవ్వరూలేని సమయం చూసి చంచల ఇంటి తలుపు తట్టాడు. అక్కడ మొత్తం జరిగినదంతా వచ్చి నాకు చెప్పాడు.

చంచలే వచ్చి తలుపు తీసింది. "ఎవరండీ మీరు?" అంది.

"మీతో ఒక్కసారి మాట్లాడాలి—" అన్నాడు వెంకటేశం.

ఆమె సాదరంగా అతణ్ని ఆహ్వానించింది.

లోపల కూర్చున్నాక వెంకటేశం—"నేను చెప్పే దానికి మీరు అన్యథా భావించకూడదు—" అన్నాడు.

"చెప్పండి!" అందామె.

"నేను మీ అందానికి ఆకర్షితుడనైనాను."

"ఊఁ."

"నాకు మీరు కావాలి—"

ఆమె ఉలిక్కిపడింది.

"మీరు కోరిన డబ్బిస్తాను—"

ఆమె తమాషాగా అతడివంక చూసి — "చర్చివీధి తెలుసుగదా మీకు—అక్కడకు వెళ్ళండి. మీరు కోరే ఆడవాళ్ళక్కడుంటారు—" అంది.

ఆమెకు కోపంరాలేదని వెంకటేశం గ్రహించి ధైర్యంగా—"నాకు చర్చివీధిలో ఆడవాళ్ళొద్దు. మీరే కావాలి!" అన్నాడు.

ఆమె చటుక్కున లోపలకు వెళ్ళి వచ్చి — "నేను లోపలకెందుకు వెళ్ళొచ్చానో తెలుసా మీకు?" అంది.

"తెలియదు —"

"నా జోళ్ళక్కడ ఉండిపోయాయి. అవి తొడుక్కుని వచ్చాను—"

"ఎందుకు? బయటకు వెడదామా?"

"కాదు. పరాయి మగాణ్ని చేత్తో తాకడం ఇష్టముండదు నాకు. అందుకని చెప్పుతో నే కొడతాను....వీధి తలుపు తట్టి—పెళ్ళికావలసిన ఆడపిల్లను—నువ్వు కావాలి- అంటున్నాడు మగాడు...." అంటూ ఆమె కాస్త వంగింది.

చెప్పు తీయడానికే వంగిందని గ్రహించిన వెంకటేశం పరుగులాంటి నడకతో మా యిల్లు చేరాడు.

నేను జరిగినదంతా విని "అర్థమయిందా?" అన్నాను.

"యేమిటి?"

"ఆమె ఎలాంటిదో?"

"బాగా అర్థమయింది. ఇంకెప్పుడూ నీలాంటివాడి మాట విని ఇలాంటి బుద్ధితక్కువ పనులు చెయ్యను—" అన్నాడు వెంకటేశం.

"ఆమె తెలివైనది. నువ్వు తెలివితక్కువ వాడివి—" అన్నాను.

"నిజమే—"

"అది కాదు వెంకటేశం — ఆమె తెలివిగా నీకో సందేశాన్నిచ్చింది. అది అర్థం చేసుకోవడం నీ బాధ్యత!"

"యేమిటా సందేశం?"

"నువ్వు వీధి తలుపు తట్టి ఇంట్లో ప్రవేశించావు. ఎవరో ఒకరు అది చూసేవుంటారని ఆమె అనుమానం. అలాంటప్పుడు నువ్వు ఎక్కువసేపుండిపోతే ఎవరికైనా అనుమానం కలుగుతుంది. నువ్వేమన్నా ఆమెకు కోపం రాలేదు. కొడతానంది కానీ కొట్టలేదు. ఆమె అభ్యంతరమల్లా నువ్వు వీధిలోంచీ వచ్చావనే! దొడ్డిదారిన వెళ్ళి చూడు. ఆమె నిన్ను కరుణిస్తుంది—"

"అదే నిజమైతే అంత డొంక తిరుగుడుగా చెప్పడమెందుకు?" అన్నాడు వెంకటేశం — "సూటిగా విషయం చెప్పొచ్చుగా—"

"ఆ మాత్రం ఆడదాని డొంక తిరుగుడు మాటలు అర్థం చేసుకోలేని వాడితో ఆమె వ్యవహారమేం నడిపిస్తుంది? మగాడికి అవసరం తీరిపోతే చాలు. ఆడదానికి అల్లరిపడకుండా వుండడం ముఖ్యం—" అన్నాను.

వెంకటేశం నా తర్కాన్ని అంగీకరించడానికి ఒకటి రెండు రోజులు పట్టింది.

## 7

చంచల యింటికి దొడ్డిదారి వుంది. అది ఓ సందులోకి వుంది. ఎవరికీ తెలియకుండా ఆమె యింట్లో ప్రవేశించవచ్చు. అలాంటి దొడ్డిదారి వున్నదనే ఆమె ఆ యింటి నెన్నుకుందో, ఆ దొడ్డిదారి చూసేకనే ఆమె కలాంటి దుర్బుద్ధి పుట్టిందో తెలియదు కానీ ఆమె యింటి దొడ్డి

తలుపు సాధారణంగా తీసే వుంటుందని కుసుమ నాకు చెప్పింది.

వెంకటేశం దొడ్డిదారిలో ఆమె యింటికి వెళ్ళాడు. తొందరగానే తిరిగొచ్చేశాడు.

"ఏం జరిగింది?" అన్నాను.

"ఈసారి చెప్పుతో కొట్టింది—"

ఉలిక్కిపడ్డాను.

"చంచల నిన్ను కొట్టిందా?"

"ఒక్కమాట కూడా ఆడలేదు. చంచలా—నీ కోసం దొడ్డిదారిని వచ్చాను—అన్నాను. నేను చెప్పింది పూర్తి కాగానే చెప్పుతీసుకొని కొట్టి—ఇంకా కావాలా అన్నట్లు ఆగింది. ఇలాంటి అవమానం యిదే మొదటిసారి!" వెంకటేశం కంఠం దీనంగా మారిపోయింది.

ఇలా జరుగుతుందని నే ననుకోలేదు-"నన్ను మన్నించు వెంకటేశం. బహుశా ఆమెకు నువ్వు నచ్చివుండవు. అందుకే అలా చేసింది. ఆమె గురించి నాకు బాగా తెలుసు. అందుకే నీ కలా చెప్పాను—"

"ఏమయితే నేం? నా కిక్కడ అవమానం రాసిపెట్టి ఉంది!" వెంకటేశం వాపోయాడు. అతడి ముఖం చూస్తే నాకు చాలా జాలి కలిగింది.

"అలా బాధపడకు వెంకటేశం! అవమానమన్నది నలుగురికీ తెలిసినప్పుడు కదా—చంచల ఈ విషయం ఎవరికీ చెప్పదు. ఇది నీకూ నాకూ తప్ప ఆఖరికి నా భార్య కుసుమకు కూడా తెలియదు—" అన్నాను.

"అది కాదు నా బాధ. ఆమెను నేను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. ఆమె లేనిదే నేను బ్రతకలేనని పిస్తోంది. ఆమెకూ నాకూ పెళ్ళి జరిగే మార్గం లేదా?"

ఇప్పుడు వెంకటేశానికి ఆమె శీలంపై నమ్మకం కూడా కుదిరింది. ఆమెను పెళ్ళిచేసుకుని తీరాలనుకుంటు న్నాడు.

అప్పుడు నాకు స్ఫురించింది. వెంకటేశం మా ఇంటికి వచ్చినపుడు కుసుమ చంచల యింటికి వెళ్ళింది. వెంకటేశం గురించి చాలా వివరాలు చెప్పింది. అందువల్ల చంచలకు అతడి ఆస్తిపాస్తుల గురించి అన్నీ తెలుసు.

"అమ్మో—నువ్వెంత జాణవు?" అనుకున్నాను.

మొదటిసారి వెంకటేశాన్ని బెదిరించినప్పుడామె యేమంది?

"వీధి తలుపు తట్టి...., పెళ్ళి కావలసిన ఆడపిల్లను—కావాలి అంటున్నాడు మగాడు...." అందామె.

అంటే దాని అర్థం—తను పెళ్ళి చేసుకోవాలని అను కుంటున్నదని—పెళ్ళికే గానీ మరెందుకూ అంగీక రించనని!

ఈ విషయమై నేను తీవ్రంగా ఆలోచించాను.

చంచల కసి అంతా భర్త కృష్ణారావుపైన మాత్రమే! అతణ్ని యేడ్పించడంకోసం తను చెడు తిరుగుళ్ళు తిరి గింది. భర్తను వదిలించుకున్నాక ఆమె అందరిలాగా బ్రతకాలని అనుకుంటున్నదేమో! కొత్త భర్తతో మామూలుగా జీవించాలని ఆశపడుతున్నదేమో! అలాం టప్పుడు....

## 8

కుసుమతో చెప్పా వెంకటేశం చంచలను ప్రేమి స్తున్నాడనీ పెళ్ళి చేసుకోవాలని అనుకొంటున్నా డనీ........

"చంచలను గురించి అతడికి పూర్తిగా తెలుసా?"

"తెలుసు. అయినా ఈ నిర్ణయానికి వచ్చాడు—"

కుసుమ చాలా బాధపడింది.

"బాధపడితే లాభంలేదు. నువ్వే రాయబారం చేయాలి!" అన్నాను.

"నేనా?" అంది కుసుమ ఆశ్చర్యంగా.

"తనే అడగడానికి మొహమాటపడుతున్నాడు—" అన్నాను.

ఆఖరికి కుసుమ అంగీకరించింది.

"ఎలాగో సాధించుకు రావాలి!" అన్నాను.

"ఇందులో సాధించడానికి ఏముందండీ—వెళ్ళి చెప్పి రావడమే కదా—ఆమె ఎగిరి గంతేసి మరీ ఒప్పుకుంటుంది. మీ స్నేహితుడిలాంటి భర్త—ఎన్ని పూజలు చేస్తే మాత్రం—అందులోనూ ఆమెకు లభిస్తాడా?" అంది కుసుమ.

ఆమె ఎంత నమ్మకంగా వెళ్ళిందో అంత ఆశ్చర్యంగా తిరిగొచ్చింది.

"ఏం జరిగింది?" అన్నాను.

"చంచల యీ పెళ్ళికి ఒప్పుకోలేదు—" అంది కుసుమ.

"వెంకటేశం గురించి అన్నీ చెప్పావా?"

"అన్నీ చెప్పాను. ఆమెకు అతడిపట్ల యే మాత్రమూ ఆకర్షణలేదు—"

"అసలేమన్నది ఆమె?"

"తను మర్యాదస్థుల్నే కానీ చేసుకోదట. వెంకటేశాన్ని ఆమె చూసిందట. మర్యాద తెలిసినవాడిలా కనిపించలేదుట—"

నాకు వళ్ళు మండిపోయింది—"యేమిటి తన ధైర్యం?

అసలు తినకు పెళ్ళంటూ అవుతుందని ఆశ వున్నదా?"

"మరీ అంత సూటిగా అనకపోయినా అలా అర్థం వచ్చేలాగునే మాట్లాడాను. ఆమె చాలా తేలికగా— నేను లక్షాధికారిణిని. నాకు పెళ్ళి సమస్యా - అంది."

"సరే—అదీ చూద్దాం—" అన్నాను కోపంగా.

విషయం విని వెంకటేశం నాతో నిష్టూరంగా మాట్లాడేడు—"నీ సలహా పాటించి ముందుగా అలా వెళ్ళడం వల్లనే ఆమెకు నాపై దురభిప్రాయం కలిగింది. లేకపోతే యీ పెళ్ళికి తప్పక అంగీకరించి ఉండేది —" అన్నాడు.

"వెంకటేశం! ఆమెమీది మోజులో నువ్వు చాలా విషయాలు ఆలోచించడం లేదు. నువ్వామెకోసం రెండు సార్లు ప్రయత్నించి ఫెయిలయ్యావు. ఆ తర్వాత పెళ్ళి మాటలకు దిగావు. అంటే నీకు ఆమెపై అంతులేని ప్రేమతోపాటు గౌరవం కూడా వున్నదనే కదా అర్థం. దీనికి తోడు నీకు ఆస్తిపాసులుకూడా బాగా వున్నాయి. ఇవేమీ ఆమెను ఆకర్షించలేదంటే ఇంతకంటే బలమైన ఆకర్షణ మరేదో వుండి వుండాలి. అదేమిటో నాకు తెలుసును కూడా!" అన్నాను నేను వెంకటేశాన్ని అనునయిస్తూ.

"నీకు తెలిసిందేమిటో చెప్పు?"

"ఆమె విచ్చలవిడిగా తిరగడానికి అలవాటు పడింది. తనకు భార్య స్థానం ఇచ్చేవాడే ఆమెకు కావాలి తప్పితే మరీ నీకులా ప్రేమించేవాడితో ఆమెకు ఇబ్బంది!"

వెంకటేశం కోపంగా నా వంక చూసేడు—"ఎంతసేపూ ఆమె శీలాన్ని శంకించడం తప్ప మరో ఆలోచన లేదా నీకు?" అన్నాడు.

నేను మౌనం వహించాను.

వెంకటేశం భగ్నహృదయంతో మా యిల్లు వదలి పెట్టాడు.

## 9

ఒకరోజు నాకో ఉత్తరం వచ్చింది. చాలా ఆసక్తికరమైన ఉత్తరం. రాసిందెవరో తెలియదు కానీ యాభై రూపాయలకు డ్రాఫ్ట్ వుంది.

ఫలానా తేదీన ఫలానా బస్సులో ఫలానా ఊరికి రమ్మనమనీ తను వచ్చి బస్‌స్టాండ్‌లో కలుసుకుంటాననీ రాశాడో వ్యక్తి. నా దారి ఖర్చుల గురించి యాభై రూపాయలకు డ్రాఫ్ట్ పంపించాడు.

"ఇదేం ఉత్తరమండీ?" అంది కుసుమ.

"ఇందులో ప్రమాదమేమీ లేదు. నేను వెడతాను—" అన్నాను.

"నేను రావద్దా?" అంది కుసుమ.

"వద్దు కుసుమా! అసలు సంగతేమిటో తెలియనప్పుడు—యిద్దరూ కలిసి వెళ్ళడం అంత మంచిది కాదు—"

కుసుమ నా ప్రయాణానికి అంగీకరించింది. కుతూహలం నన్ను కాల్చేస్తోంది. ప్రయాణం తేదీ రెండురోజు లుంది. ఆ రోజు ఆఫీసుకు సెలవు. ఆ మర్నాడు ఆదివారం. అన్నీ చూసుకునే ఉత్తరం రాసినట్లున్నాడతను.

మొత్తంమీద ప్రయాణం తేదీ రానే వచ్చింది. ఉదయం ఎనిమిదింటికి బస్సు. మధ్యాహ్నం రెండింటికి అక్కడ చేర్చింది. బస్సుస్టాండులో నా కళ్ళు యెవరి కోసమో వెతుకుతున్నాయి.

నేను బస్సు దిగాను. భుజానికి ఓ చిన్న సంచీ

వుంది. ఆ భుజంమీదే ఎవరిదో చేయి పడింది. ఎవరా అని వెనక్కి తిరిగాను.

ఎవరో అపరిచితుడు. గడ్డం, మీసాలున్నాయి కానీ ఆధునికంగా వున్నాడు. యువకుడే. ఆ కళ్ళు ఎక్కడో చూశాననిపించింది.

"సునీతా!" పిలిచాడతను.

ఆ మాట కూడా యెక్కడో విన్నాననిపించింది.

ఎక్కణ్నించో అతడి పక్కకు వో అమ్మాయి వచ్చింది.

వాళ్ళ ఈడూ జోడూ ఎంతో బాగుంది.

"నా భార్య—సునీత!" అన్నాడతను.

"మీరు....మీరు...." అని ఆగిపోయాను.

"గుర్తించలేదా—....కృష్ణారావు...."

ఉలిక్కిపడ్డాను....అవును....కృష్ణారావే!

"ఇప్పుడు నన్నా పేరుతో పిలవద్దు. నా పేరిప్పుడు రామకృష్ణ—" అన్నాడతను. భార్యకు నా పేరు చెప్పాడు. ఆమె వినయంగా నమస్కరించింది.

మేమంతా కలిసి అతడింటికి వెళ్ళాం. సునీత చాలా కలుపుగోలు మనిషి. రామకృష్ణ ఉరఫ్ కృష్ణారావు ఆమెతో మసులుతున్న తీరు నయనానందకరంగా వున్నది. ఆ దంపతుల ఆదరణ మరిచిపోలేను.

కృష్ణారావు నన్ను వేరే గదిలోకి తీసుకువెళ్ళి—"ఇదీ నేను కోరుకున్న జీవితం సార్!" అన్నాడు.

నేను ఆశ్చర్యపోయాను. కృష్ణారావు భార్య చంచలతో కలిసి ఏదో నాటకమాడాడని అనుకున్నాను. కానీ అతనిక్కడ వేరే పెళ్ళిచేసుకుని సుఖంగా జీవిస్తున్నాడు. అంటే కృష్ణారావు భార్యతో విసిగిపోయిన మాట నిజమే!

ఆమెను యేదో విధంగా వదుల్చుకోవా లనుకుంటున్న మాటా నిజమే!

సునీతను పెళ్ళి చేసుకోవడంవల్ల కృష్ణారావుకు అయిదు వేలు కట్నం వచ్చింది. ఆ డబ్బుతో అతను వ్యాపారం ప్రారంభించాడు. అది బాగానే నడుస్తున్నది. అక్కడ చావాలని నిశ్చయించుకున్నప్పుడే కృష్ణారావు సునీతను చూసి ఉంచుకున్నాడు. సునీతకు తన గురించి యెన్ని నిజాలు చెప్పాడో తెలియదు. వారిద్దరూ యే కలతలూ లేకుండా వున్నారు.

"మీ సాయంవల్లనే యిదంతా సాధ్యపడింది సార్! మీ మేలు మరిచిపోలేను. మిమ్మల్నిక్కడికి రప్పించడానికి కారణం మీకు నా నిజాయితీని నిరూపించుకోవడమే! మీరు నన్ను అనుమానించారు. నేను చంచల కలిసి డబ్బుకోసం నాటకమాడుతున్నా మనుకున్నారు. మీ రెప్పుడొచ్చినా మమ్మల్నిక్కడ చూడవచ్చు. సునీత వంటి భార్యతో ఓ యేడాదిలోనే పెద్ద లాభాలు తీయగలనని నా నమ్మకం—" అన్నాడతను. అతడి మాటల్లోని నమ్మకం కళ్ళలో కూడా నాకు కనిపించింది.

నే నెంత బలవంత పెట్టినా వినకుండా నా తిరుగు ప్రయాణం టికెట్ అతనే తీశాడు.

# 10

ఇదో పెద్ద షాకింగ్ న్యూస్‌గా నేను కుసుమకు చెప్పాలని అనుకున్నాను. నేను యింట్లో అడుగు పెట్టగానే కుసుమ—"మీ కో వార్త వుంది. మీరు యేం కబురు తెచ్చారా అని నేను ఆత్రుతపడుతున్నాను కాబట్టి ముందది చెప్పేయండి. తర్వాత ఇది చెబుతాను-" అందామె.

నెమ్మదిగా కృష్ణారావు కథ చెప్పాను కుసుమకు.

కుసుమ నిజంగానే ఆశ్చర్యపోయింది.

"మరి నీ కబురు చెప్పు!"

"చంచలకు పెళ్ళి కుదిరింది—"

"వరుడెవరు?"

"మనకు తెలిసినవాళ్ళెవరూ కాదు ..."

"ఎవరు?"

"ఎవరో నాకూ తెలియదు...."

"కుదిరిందని ఎవరు చెప్పారు?"

"చంచలే చెప్పింది. మర్యాదస్థుడట. అన్ని విధాలా తనకు నచ్చినవాడుట. ఈ సంబంధం కుదిరినందుకు చంచల చాలా గర్వపడుతోంది—" అంది కుసుమ.

"పెళ్ళెక్కడ జరుగుతుంది?"

"విజయవాడ కనకదుర్గ గుడిలోనట — చాలా సింపుల్‌గా జరుగుతుందట. శుభలేఖలు వుండవట—" అంది కుసుమ.

కుసుమ చెప్పిన వివరాలన్నీ వింటే నాలో చాలా అనుమానాలు రేగాయి. వివాహం వచ్చే ఆదివారంనాడట. నాలుగు రోజుల్లో చంచల ఇక్కడ ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోతుందిట. మళ్ళీ ఈ ఊరు రాదుట.

నాలో మళ్ళీ అనుమానం రేగింది.

ఇదంతా కృష్ణారావు, చంచల ఆడుతున్న నాటకం కాదుగదా! అతను నన్ను మభ్యపెట్టడంకోసం ఓ అద్దె భార్యను నాకు తాత్కాలికంగా చూపించాడేమో! ఇప్పుడీమె యీ ఊరొదిలి వెళ్ళగానే యిద్దరూ కలిసి కాపురం పెడతారేమో!

"అంత ఖర్చులిచ్చి మరీ మిమ్మల్ని మభ్యపెట్టాల్సిన

అవసరం అదినీకేముందండీ?" అంది కుసుమ.

"లేకపోతే నేనూ ఆ లక్ష రూపాయల్లో వాటా అడుగుతానేమోనని భయం కావచ్చు—"

"ఇద్వనం కే మీ రేం చేయగలరు?"

"బ్లాక్ మెయిల్!" అన్నాను.

కుసుమ ఉలిక్కిపడి—"అవునండీ—ఈ విషయమే నాకు తట్టలేదు—" అంది.

"బ్లాక్ మెయిల్ చేసే ఉద్దేశ్యం నాకు లేదు కానీ—నిజం—తెలుసుకునే ఉపాయం నాకు తెలుసు—" అన్నాను.

"ఏమిటది?" ఆత్రుతగా అడిగింది కుసుమ.

"మనం పెళ్ళికి వెడదాం?"

కుసుమ ఉలిక్కిపడి—"పిలవని పేరంటానికా?" అంది.

"బెజవాడ కనకదుర్గ గుడికి వెళ్ళడం పిలవని పేరంటమెందుకవుతుంది?"

కుసుమ వెంటనే ఒప్పుకుంది.

విజయవాడలో మా చుట్టాలున్నారు. శనివారం రాత్రికే అక్కడకు వెళ్ళాం. మర్నాడుదయం చంచల కుసుమకు చెప్పిన టైముకు కనకదుర్గ గుడికి వెళ్ళాం.

అక్కడ నిజంగానే చంచల వివాహం జరుగుతోంది—

వరుణ్ని చూసి ఉలిక్కిపడ్డాను.

అతను రమణమూర్తి!

కుసుమకు ప్రేమలేఖలు వ్రాయబడ్డాయన్న కారణంగా ఆమెను నిరాకరించిన రమణమూర్తి చంచల పక్కన వరుడిగా కూర్చుని వున్నాడు. అతడామె మెడలో తాళి

కట్టడమైనాక నే నతన్ని పలకరించాను.

నన్ను చూసి రమణమూర్తి ఉలిక్కిపడ్డాడు.

"అరే—మీరా—ఇలా ఎలా వచ్చారు?"

"మీ పెళ్ళి గురించి తెలిసి...."

"నా పెళ్ళి గురించి మీకెలా తెలుసు? ..."

"చంచలగారు చెప్పారు...."

"ఓహ్—ఆమెది మీ ఎదురిల్లేకదూ ..." అని నిట్టూర్చాడు తను. "వీలైనంత రహస్యంగా పెళ్ళి చేసుకోవాలనుకున్నాను...."

"ఒకప్పటి మీ ఆశయాలు యిప్పుడు మారాయా?" అన్నాను. అది వెటకారమో కాదో రమణమూర్తి ఊహించుకోవాలి.

"అలా ఎందుకనుకుంటున్నారు?"

"చంచలగారిది మా ఎదురిల్లే కదా!"

"ఓహ్—కృష్ణారావు మీ సాయం తీసుకున్నాడు కదూ!" అని మళ్ళీ నిట్టూర్చాడు రమణమూర్తి.

నేను ఆశ్చర్యపోయి—"అంతా మీకు తెలుసా?" అన్నాను.

"నాకు తెలియడ మేమిటి? పథకం వేసిందే నేను-" అన్నాడు రమణమూర్తి. "తప్పలేదు మరి! చంచల నాకు అన్నివిధాల నచ్చింది. సుఖజీవితం ప్రారంభించాలంటే ఓ లక్షరూపాయలైనా వుండాలన్న దామె. లక్ష రూపాయలు సంపాదించాలంటే దొడ్డిదారి తప్పనిసరి గదా!"

"మర....మరి....చంచలగారు...."

"ఓహ్—నా కోసం ఆమె చేస్టిటీ బెల్టు ధరించేదని చెప్పడం మరిచాను కదూ—" అతను మళ్ళీ నిట్టూ

ర్చాడు....

"ఎంత దారుణం?" అనుకున్నాను. పైకి మాత్రం—
"ప్రేమలేఖ అందుకొంటేనే ఆడదాని మనసు కలుషితం కావచ్చునన్నారు మీరు. ఈ నాటకంతో మీ భార్య మనసు కలుషితం అవుతుందనుకోలేదా?" అని సూటిగా అడిగేశాను.

"నా బుర్రలో లక్షరూపాయలు తప్ప ఇంకేమీ లేదు. ఇతర విషయాలేమీ గుర్తుచెయ్యకండి నాకు. అనుభవం చాలీచాలని వయసులో యేమైనా అని వుంటే—వాటి ప్రభావం మీ మీద కూడా వుంటే—దాన్ని యిప్పుడే తొలగించుకోండి—" అన్నాడు రమణమూర్తి.

అసలు రమణమూర్తినే నా బుర్రలోంచి తొలగించేయాలనుకుంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాను కుసుమతో కలిసి.

—:ఐ పో యిం ది:—

# గంగులుగాడి పగ

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

సాయంకాలం అయిదు గంటలు కొట్టింది కోర్టు గడియారం. ఛీఫ్ జస్టిస్ గడియారంవైపు చూశారు.

నలుగురు ముద్దాయిలు అరుస్తోన్నారు.

ఛీఫ్ జస్టిస్ నిట్టూర్చాడు.

నలుగురు ముద్దాయిలూ చింతపల్లి హత్య కేసులో యావజ్జీవ కారాగారవాసం పొందారు. తాను తీర్పు చెప్పి పది నిముషాలయింది. శిక్ష పడినవాళ్ళు అలాగే అరుస్తారు.

నేరం చేయమని ఎవరు చెప్పారు! శిక్ష అనుభవించమని ఎవరు బాధ పెట్టారు? చింతపల్లి జమీందారు కుటుంబం మొత్తం సభ్యులను చిత్రహింసలు చేసి చంపారు ఈ నలుగురూ.

నలుగురికీ ఉరిశిక్ష వేయవలసింది కొంతలో తప్పింది.

ఛీఫ్ జస్టిస్ తన ఆసనంలోంచి లేచి నిలబడ్డారు.

"ఒరేయ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్!" నలుగురిలోనూ

గంగులు అరిచాడు.

"ఒరేయ్, శాంతారాం! నీ కుటుంబం పనిపడతాంరా. నీకు ముందే హెచ్చరిక చేసాం. ఈ గంగులుగాడి పగ ఎలా వుంటుందో రుచి చూద్దువుగాని!" గంగులు కివుక్కు మన్నాడు.

పోలీసు లాఠీ అతడి డొక్కలో గుచ్చుకుంది. లాఠీ మెలితిరిగింది.

మిగిలిన ముగ్గురు కూడా బూతులు లంకించుకున్నారు.

చీఫ్ జస్టిస్ మెల్లగా వేదిక దిగారు. శాంతారాంను సమీపించారు.

పోలీసులు నేరస్తులను బయటకు యీడ్చుకు వెళ్ళారు.

జ్యూరీ సభ్యులు తెల్లబోయి చూస్తున్నారు.

"మిస్టర్ శాంతారాం! టేకిట్ ఈజీ! ఇలాంటివి మన జీవితాలలో మామూలే! వాళ్ళకు పటిష్టమైన కాపలా యేర్పాటు చేస్తాం. మీ కుటుంబానికి పోలీస్ రక్షణ యేర్పాటు చేస్తాం!" అన్నారు జస్టిస్.

"థాంక్యూ సర్!"

శాంతారాం నేరస్తులు వెళ్ళినవైపు చూచి పళ్ళు పట పట లాడించాడు.

ఇద్దరూ, జ్యూరీ సభ్యులూ, చూడవచ్చిన పౌరులూ హాలులోంచి కదిలారు.

## 2

అతను రిక్షాను వేగంగా తొక్కుతున్నాడు.

రోడ్డుమీద చీకటి. చుక్కల వెలుగు అస్పష్టంగా రోడ్డుమీద పడుతోంది.

"స్పైన్స్ సిద్ధం చేయి!" అన్నాడు రిక్షా తొక్కు

తోన్న వ్యక్తి.

"కనెక్షన్స్ బిగించాను!" అన్నాడు రిక్షాలో వున్నతను.

ఇద్దరూ ముఖాలకు అడ్డంగా గుడ్డలు కట్టుకొన్నారు.

"జైలు గేటు దగ్గరకు వచ్చాం!" అన్నాడు రిక్షా వాడు.

రిక్షాలో చప్పుడు మొదలయింది.

సెంట్రల్ జైలు గేటులో సెంట్రీలు కాపలావున్నారు. చీకట్లో సిగరెట్స్ కాల్చుకుంటున్నారు.

మరుక్షణంలో రిక్షాలో నుండి బుస్‌మంటూ గాలి గేటువైపు ప్రయాణిస్తోంది.

సెంట్రీలు మౌనంగా రోడ్డుమీదకు జారిపోయారు.

రిక్షా జైలు గేటులోంచి లోపల ప్రవేశించింది. సెంట్రల్ జెయిల్ ప్రాంతమంతా తీయటి వాసన! సెంట్రీలూ, జైలు వుద్యోగులూ, కానిస్టేబుల్స్, ఒక రేమిటి? చివరకు ఖైదీలు కూడా స్పృహతప్పి పోతు న్నారు. ఇద్దరూ రిక్షా దిగారు. క్రొవ్వొత్తుల కాంతిలో సెల్స్ భయంకరంగా వున్నాయి. ఇద్దరూ సెల్ నెంబర్లు చూసుకొంటూ నడుస్తోన్నారు.

ఇద్దరూ ఓ సెల్ ముందు ఆగారు. సెల్‌లో నలుగురు ఖైదీలు నేలమీద పడి నిద్రపోతున్నారు.

## 3

పబ్లిక్ ప్రాసిక్యూటర్ శాంతారాం బద్ధకంగా ఒత్తి గిల్లాడు. చెవులు గింగుర్లెత్తుతోన్నాయి. టెలిఫోన్ భయం కరంగా మ్రోగుతోంది. శాంతారాం చటుక్కున ముందుకు జరిగి రిసీవర్ అందుకొన్నాడు.

"శాంతారాం స్పీకింగ్ హియర్!" అన్నాడు పబ్లిక్

ప్రాసిక్యూటర్.

"ఛీఫ్ జస్టిస్‌ను మాట్లాడుతున్నాను" అవతలనుండి వినిపించింది.

శాంతారాం బధకం దిగిపోయింది.

"చెప్పండి సర్!" అన్నాడు.

"అరగంటలో వస్తున్నాను. మీతో మాట్లాడే పని వుంది!"

"ఫోన్ నన్ను రమన్నారా సార్?"

"అక్కరలేదు. నిద్రాభంగం కలిగించాను. సారీ!" అవతల క్లిక్‌మన్నది.

శాంతారాం మంచం దిగాడు.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది. తన యిద్దరు పిల్లలూ, భార్య పేరంటానికి వెళ్ళారు. తన బావమరిది పార్వతీశం, అతడి కొడుకు రాంగోపాల్ సినిమాకు వెళ్ళారు. అందరూ కలసి రాత్రి యే ఒంటిగంట దాటాకో వస్తారు. తనకు రెండో ఆటకు వెళ్ళడంకానీ రాత్రి తొమ్మిది తర్వాత మేలుకుని వుండటం కానీ ఇష్టం వుండదు.

మెట్లు దిగి హాల్లోకి వచ్చాడు శాంతారాం. హాలులో జీరోవాట్ బల్బు వెలుగుతోంది.

సోఫాలో కూలబడ్డాడు శాంతారాం.

ఛీఫ్ జస్టిస్ తనతో మాట్లాడ రావడం విడ్డూరంగా వుంది.

ఆయనకూ తనకూ స్నేహం వుంది. ఆయన యే నాడూ తన యింటికి రాత్రివేళ మాట్లాడటానికి రాలేదు.

ఆయన ఎందుకోసం వస్తోన్నట్టు?

శాంతారాం ఆవులించి చిటికె వేశాడు. నిమిషాలు గడుస్తోన్నాయి.

పోర్టికోలో కారు ఆగింది.

శాంతారాం చటుక్కున సోఫాలోంచి లేచాడు. తలుపువైపు నడిచాడు. గడియ తీసి గుమ్మంలోకి నడిచాడు.

కారువైపు చూచి వులిక్కిపడ్డాడు.

కారులోంచి నలుగురు దిగారు. బుగ్గమీసాలూ, ఖైదీల దుస్తులూ, ఎర్రటి కళ్ళూ....

శాంతారాం గజగజ లాడాడు.

చటుక్కున తలుపు మూయబోయాడు.

అప్పటికే ఆలస్యమైపోయింది.

## 4

"సార్!"

తెరమీదనుండి రాంగోపాల్ తల త్రిప్పి చూశాడు.

గేట్ కీపర్ తన సీటువద్ద నిలబడి వున్నాడు.

"ఎవరు? యేం కావాలి?" అడిగాడు పార్వతీశం.

"ఎవరో పిలుస్తున్నారు సార్! గుమ్మం దగ్గర వున్నారు" అన్నాడు గేట్ కీపర్.

"ఎవరు పంపించారట?" అడిగాడు రాంగోపాల్.

"పబ్లిక్ ప్రాసిక్యూటర్ శాంతారాంగారు."

పార్వతీశం లేచాడు.

"ఇద్దరినీ రమ్మన్నార్సార్!"

రాంగోపాల్ కూడా లేచాడు. తండ్రీ కొడుకులు హాలులోంచి బయటకు నడిచారు.

గేటువద్ద ముసలతను నిలబడి వున్నాడు.

"తమరిని అర్జంటుగా శాంతారాం బాబుగారు రమ్మన్నారు" అన్నాడు ముసలతను కదులుతూ.

పార్వతీశం రాంగోపాల్ అతడి వెంట బయటకు నడిచారు. అతడు పోర్టికోలో ఆగివున్న కారు వద్దకు తీసుకు వెళ్ళాడు.

డోర్ తెరచి పట్టుకున్నాడు.

పార్వతీశం, అతడి వెనక రాంగోపాల్ కారులో కూర్చున్నారు. ముసలతను వాళ్ళ ప్రక్క కూర్చున్నాడు.

"పోనీయ్!" అరిచాడు ముసలతను.

అతడి గొంతులో దర్పం, కాఠిన్యం చోటు చేసుకున్నాయి. రాంగోపాల్ విడ్డూరంగా తన ప్రక్కకు చూశాడు.

"డ్రయివర్ పేరు రాజేంద్ర. నా పేరు గంగులు!" అన్నాడు ముసలతను.

పార్వతీశం కళ్ళు పెద్దవయాయి.

"జీవిత ఖైదు వేసిన గంగులా?"

"వేసిన.... కాదు.... వేయించుకున్న...." నవ్వాడు గంగులు. అతడి నవ్వు హృద్యంగా లేదు.

# 5

కాంతారాం కళ్ళు తెరిచాడు.

తలంతా దిమ్ముగా వుంది. జరిగిన విషయం గుర్తుకు తెచ్చుకోసాగాడు. పోర్టికోలో కారు ఆగింది. కారులోంచి నలుగురు దిగారు. తాను తలుపు మూయబోయాడు.

గంగులు చటుక్కున తనను సమీపించాడు. చెయ్యి పుచ్చుకుని ముందుకు లాగాడు. తను మెట్లమీదుగా జారి పడ్డాడు. తనను వాళ్ళు చుట్టుముట్టారు. లేపి కారులో కూర్చోబెట్టారు.

వాళ్ళలో యిద్దరు యింట్లోకి పరుగెత్తారు. ఇరవై

నిమిషాలపాటు యిల్లంతా గాలించారు. మొహాలు వ్రేలా దేసుకుని వచ్చారు.

తను తృప్తిగా చూశాడు. తనకు ఏమైనప్పటికీ ఫరవా లేదు. తనవాళ్ళకి యేమీ కాదు. వాళ్ళు యింట్లో వుండకుండా వెళ్ళిపోవడం మంచిదే అయింది.

గంగులు తనవైపు చూశాడు. అతడి కళ్ళలో ఎర్రటి జీరలు కదులుతున్నాయి.

"నీ పెళ్ళాం పిల్లలు ఎక్కడికి వెళ్ళారు?" అడిగాడు గంగులు.

తను మాట్లాడలేదు.

యువకు డొకడు ముందుకు వచ్చాడు.

వాడి పేరు రాజేంద్ర అట! తరువాత తెలిసింది. వాడు తనని దవడమీద కొట్టాడు.

"నీ కూతురు లతకు కాబోయే మొగుడు రాంగోపాల్! ఎస్! అతడు యెక్కడ? అన్నట్టు మీ బావ పార్వతీశం యెక్కడ?" అడిగాడు రాజేంద్ర.

తనకి దవడ పళ్ళతో పాటు తలలో నరాలు అదిరాయి.

వీళ్ళు తన కుటుంబాన్ని కొంతకాలంగా పరిశీలిస్తున్నా రన్నమాట.

"మాట్లాడవేం?" అరిచాడు గంగులు.

శాంతారాం తెలియదని చెప్పాడు.

రాజేంద్ర తన ప్రక్కగా కూర్చున్నాడు. డొక్కలో కుమ్మాడు. తన జుత్తు పట్టుకొని ముందుకు వంచాడు. తన చెంపలు పళపళ మన్నాయి. వాడి చేతుల్లో ఇనుప రేకు లున్నట్టు తోచింది తనకు. దంతాలు కదిలాయి. నోటికి వుప్పగా తగిలింది.

రాజేంద్ర తనను క్రిందకు పడగొట్టాడు. సీటుకూ సీటుకూ మధ్య వున్న యిరుకు స్థలంలో పడ్డాడు తాను.

తనమీద కాళ్ళు పెట్టి అదిమిపెట్టసాగాడు రాజేంద్ర.

తన మొహానికీ భుజాలకీ దెబ్బలు తగిలాయి. దుఃఖం, ఆవేశం, నిస్సహాయతా తనలో కొట్టుకుచ్చినట్టు కనిపిస్తోన్నాయి.

రాజేంద్ర కాళ్ళు మెడను క్రిందకు అదిమి పెడుతున్నాయి. తనకి వూపిరి అందడంలేదు.

"చెప్పు! మీ వాళ్ళు ఎక్కడికి వెళ్ళారు?" రాజేంద్ర తన రెండో కాలు ఎత్తాడు. వెన్నుమీద తన్నాడు. ముక్కులోంచి వెచ్చటి నెత్తురు కారుతోంది.

తను ఆ స్థితిలో యేం చెప్పాడో తనకే తెలియదు.

ఇప్పుడే తిరిగి కళ్ళు తెరవడం!

శాంతారాం చుట్టూ చూశాడు. విశాలమైన రాతి గోడలు. నేలమీద నాపరాళ్ళు పరిచివున్నాయి. వాటి మధ్య యేనాటిదో చెక్కసున్నం అతుకువేసి వుంది. ఒక వైపు ద్వారం వుంది. యే నాటిదో చెక్క తలుపు.

శాంతారాం నేలమీద నుండి లేచాడు. కళ్ళు సలుపుతోన్నాయి. మోచేతులూ మోకాళ్ళూ మొహమూ గాయాలయాయి.

మూలుగుతూ ద్వారంలోంచి నడిచాడు.

విశాలమయిన హాలూ, హాలులో పొడవుపాటి బల్లా, బల్లకి అటూ యిటూ కుర్చీలూ... అంతా యే నాటిదో ఫర్నిచర్. ఏదో పెద్ద కోటలోని భాగంలాగా వుంది. బల్లకి అటుప్రక్క ఇనుప మెట్లు.

కోట మొత్తం ప్రశాంతంగా వుంది. పాతకాలంనాటి రాతి కోట.

'చిత్రం! కోట అంతటికీ ఎవరూ వున్నట్టు లేదు!' గొణుక్కున్నాడు శాంతారాం. తనను ఇక్కడకు ఎందుకు తీసుకొచ్చారో అర్థం కాలేదు.

ఇనుప మెట్లు యెక్కసాగాడు. స తగుల్ల ఆకారంలో సుడితిరిగి మెట్లు పై కప్పులోకి చొచ్చుకు వెళ్తున్నాయి.

కోట మొత్తం నాలుగు అంతస్తులు!

శాంతారాం ఓపికగా పైవరకూ మెట్లు ఎక్కాడు. మెట్లు నడవాలోకి అంతమయాయి. నడవాలో నడిచాడు. నడవా చివర పైకి మెట్లున్నాయి. మెట్ల చివర బురుజు కనిపిస్తోంది.

శాంతారాం బురుజు చేరుకొన్నాడు. క్రిందకు చూశాడు. క్రింద విశాలమయిన కోట భాగాలూ, ఆ భాగాలమీద పెరిగిన అల్లిబిల్లి తీగలూ, దూరంగా చిట్టడవీ, అడవి ప్రక్కగా చిన్న కాలువా కనిపిస్తున్నాయి.

శాంతారాం కళ్ళు త్రిప్పుకొన్నాడు. అలే చూస్తే కళ్ళు తిరిగి కింద రాతికట్టు భాగాలమీద పడే ప్రమాదం వుంది. శాంతారాం బురుజు అంచునే నడసాగాడు. మూడడుగుల వెడల్పు బాటలో నడచి నాలుగు బురుజులూ చుట్టివచ్చాడు.

తిరిగి మెట్లు దిగాడు. హాలు దాటాడు. ప్రక్కగదిలో చీకటిగా వుంది. శాంతారాం భయపడ్డాడు. చీకట్లోకి చూశాడు. పైకప్పును తాకే తలుపు లున్నాయి. తలుపుల పైన గోడ అర్థ వృత్తాకారంగా వంగింది. తలుపులు పై కప్పును తాకుతోన్నాయి.

శాంతారాం తలుపులను సమీపించాడు.

తలుపులకు అడ్డంగా ఇనుప గడియ వుంది. తలుపులకు

వున్న బోట్లులో గడియ తాపడం చేసి వుంది.

శాంతారాంకు దుఃఖం పొర్లుకు వస్తోంది. వయసును మరిచాడు. వెక్కి వెక్కి యేడవసాగాడు.

యేడ్చి యేడ్చి పిచ్చి ఎత్తుతోంది.

బయటకు పోయే దారిలేదు.

ఎటుప్రక్క వెళ్ళినా రాతిగోడలు ఎదురవుతోన్నాయి. ఇక్కడ మూసిన తలుపు.

అతడికి కళ్ళు తిరుగుతున్నాయి. స్పృహతప్పి నేల మీద పడ్డాడు.

## 6

హెలికాప్టర్ బురుజుమీద ఆగింది.

ఒక సాయుధుడు హెలికాప్టర్లోంచి దిగాడు. రాంగోపాల్నీ, పార్వతీశంనూ హెలికాప్టర్లోంచి దింపాడు. వాళ్ళిద్దరు స్పృహలో లేరు. బురుజుమీద పడుకోబెట్టాడు. పెలట్ వాళ్ళ మొహంమీద పరే లాగా నీటి పిచికారీ కొట్టాడు.

సాయుధుడు చెయ్యి వూపాడు.

హెలికాప్టర్ గాలిలోకి లేచింది.

సాయుధుడు బురుజులోంచి మెట్లు దిగాడు.

రాంగోపాల్ అటూ యిటూ కదిలాడు. మెల్లగా కళ్ళు తెరిచాడు. ఆకాశం ప్రకాశవంతంగా కనిపిస్తోంది. ప్రక్కకు తిరిగాడు. తంత్రి తగిలాడు. పార్వతీశం కూడా అప్పటికి లేచాడు. కళ్ళు నలుపుకొంటున్నాడు.

రాంగోపాల్ లేచి నిలబడ్డాడు. పిట్టగోడవైపు కదిలాడు. కోట చాలా ఎత్తు కావడంతో కళ్ళు తిరుగుతోన్నాయి.

"మనం ఇక్కడికెలా వచ్చాము?" ఆశ్చర్యపోయాడు

రాంగోపాల్.

"ఇది యేదో పాత కోట అయివుంటుంది!" అన్నాడు పార్వతీశం.

"గోల్కొండ కాదు! గోల్కొండ చుట్టూ యిటు వంటి చిట్టడివి కానీ, చిన్నసైజు కాలువగానీ లేవు...." పరిశీలనగా చూసి అన్నాడు రాంగోపాల్.

"నిజమే! గొల్కొండ కోట కట్టిన రాతికట్టు వేరు. ఈ రాతికట్టు వేరు!" అన్నాడు పార్వతీశం.

"మనలను దుండగులు రాత్రివేళలో పట్టుకొన్నారు. ఇది పగటి సమయం! అంటే మనని పట్టుకొన్నప్పటినుండి యిప్పటివరకూ మనను ఎక్కడయినా బంధించి వుండాలి. లేదా ఇంతసేపూ మనం ప్రయాణంలో వుండివుంటాం! చాలా దూరం వచ్చివుంటాం."

"అక్కడ మెట్లు కనిపిస్తోన్నాయి. అటు వెళ్దాం."

తండ్రీ కొడుకులు కదిలారు. ఇనుప మెట్లు దిగారు. చివరి మెట్టుమీద వుండగానే హాలూ, హాలులో పొడవు పాటి బల్లా, బల్లకి అటూ యిటూ కుర్చీలూ కనిపించాయి.

పొడవుపాటి బల్లమీద మణీ, లత, రాజూ పడుకుని వున్నారు.

పార్వతీశం అవతలి ప్రక్క చూశాడు. అక్కడ కాంతారాం స్పృహతప్పి పడివున్నాడు. అయితే దుండగులు వీళ్ళను కూడా తమలాగే ఎత్తుకొచ్చారన్నమాట. వాళ్ళ ఆశ్చర్యానికి అంతులేదు.

ఇద్దరూ మొహాలు చూసుకున్నారు. నిర్లిప్తంగా బల్ల వద్దకు నడిచారు.

బల్లమీద మణీ, లతా, రాజూ కదులుతోన్నారు.

శాంతారాం కూడా లేచి కూర్చున్నాడు. అందరూ ఒకరి నొకరు చూసుకొని విస్తుపోయారు. దుఃఖించారు. ఓదార్చు కున్నారు.

అయిదుగురి మొహాల్లోనూ ప్రేతకళ!

ఎక్కడో గంట వినిపిస్తోంది. ఆరుగురూ మెల్లగా గంట మ్రోగుతోన్న గదిలోకి నడిచారు. ఆ గదిలో రెండు టేబుల్సూ, టేబుల్సుకి అటూ యిటూ, ఆరు కుర్చీలూ వున్నాయి. టేబుల్సుమీద వంటగిన్నెలూ, కంచాలూ, ఫోర్కులూ మంచినీళ్ళ కూజాలూ.

గదిలో వంటకాలు గుబాళిస్తోన్నాయి.

"అమ్మా! ఆకలి!" ఐదేళ్ళ రాజా ముందుకు పరుగెత్తాడు. కంచాల ముందు పేర్లు రాసిన కాగితం ముక్కలున్నాయి. ఆరుగురి పేర్లు!

## 7

"అన్నదాతలు ఎవరో కాని మనకు మంచాలు కూడా యేర్పాటు చేశారు!" అన్నాడు శాంతారాం.

మిగతావాళ్ళు నవ్వడానికి వ్యర్థ ప్రయత్నం చేశారు. శాంతారాం మంచంమీద వాలాడు.

విశాలమయిన గది! శాంతారాం పడుకొన్న మంచం కాక, గదిలో నాలుగు మంచాలు! మంచానికీ మంచానికీ మధ్య ఢోమతెరలు! గదిలో హరికేన్ లాంతరు వెలుగుతోంది.

రాజా, తల్లీ ఒక మంచంమీదా, లత ఒక మంచం మీదా, రాంగోపాల్, పార్వతీశం చెరో మంచంమీదా సర్దుకొన్నారు. గదికి ఒకవైపు విశాలమయిన ద్వారం వుంది. గోడలమీద వింత నీడలు సృష్టిస్తోంది లాంతరు.

ఆరుగురూ మాట్లాడటానికి ప్రయత్నించారు.

దుఃఖంతో ఆరుగురి కంఠాలూ పూడుకుపోయాయి. ఆరుగురికీ కడుపు నిండింది. నీడ దొరికింది. అయితే ఆ నీడ సర్పం పడగ నీడ!

గది గుమ్మం బయట చప్పుడయింది.

ఆరుగురూ వులిక్కిపడ్డారు. తమకి కనబడని వ్యక్తులు భోజనం పెట్టారు. మంచాలు యేర్పాటుచేశారు. అయినా ఆ వ్యక్తులు కంటపడతారంటే యేదో గుబులు! అంత వరకు తమకు ఆ కోటలో యెవరూ తారసపడలేదు.

తలుపు తెరుచుకొంది. గుమ్మంలో గంగులు ప్రత్యక్షమయాడు. అతడి చేతిలో పిస్తోలు మెరుస్తోంది.

"నిలబడండి!" పిస్తోలు గాలిలో ఆడించాడు.

ఆరుగురూ లబలబలాడుతూ లేచి నిలబడ్డారు.

"శాంతారాం! నువ్వూ నాకూ నా ముఠాకూ చేసిన అన్యాయం మరపురానిది! మిమ్మల్ని యింత సుఖంగా వుంచడం అన్యాయం! అయినా నేను దయతో ప్రవర్తిస్తున్నాను. ఒప్పుకొంటావా?..." అడిగాడు గంగులు.

"మమ్మల్ని యెందుకు యెత్తుకువచ్చావు?" అడిగాడు శాంతారాం.

"నా నోటితో చెప్పించాలనా? నువ్వూ నాకూ నా ముఠాకూ జీవిత ఖైదు వేయించావు. నా మాట ప్రకారం మమ్మల్ని విడిచిపెట్టవలసింది. సరిగా వాదించకుండా వుండవలసింది!"

"నువ్వు చేసింది తప్పుకాదా?"

"ఏమిటా తప్పు? చింతపల్లి జమీందారును చంపడమేనా? వాడు రాస్కెల్! నాకు యెలాంటి అపకారం చేశాడో నీకు నా ప్లీడర్ చెప్పాడు."

"అంత మాత్రాన.... అతడి కుటుంబాన్ని మట్టు పెడ తావా?"

"నీకు చెముడా?" అరిచాడు గంగులు. రాంగోపాల్ మంచం ప్రక్కగా నడవబోయాడు.

"ఒరేయ్ అల్లుడూ! కదిలావంటే కుందేలు పిల్లను కాల్చినట్టు కాల్చి పారేస్తానొరేయ్!" మరల అరిచాడు గంగులు.

రాంగోపాల్ ఆగిపోయాడు.

"వాడు నా చెల్లెల్ని రేప్ చేస్తే చూస్తూ వూరుకో మంటావా?"

"కాని ఆ విషయం రుజావు కాలేదు."

"నీ గ్రుడ్డి కోర్టుకు చెవులు లేవు."

"హింసకు ప్రతిహింసే పరిష్కారం కాదు."

"నోరు మూయి. గాంధీ కబుర్లు చెప్పకొరేయ్! ఆ కబుర్లు చెప్పేవాళ్ళే గూండాలను పోషిస్తున్నారు."

"నువ్వు నీ ముఠా జైలు నుండి తప్పించుకొన్నారు. కోర్టు శిక్షించినా మీ నలుగురూ ఆ శిక్ష నుండి బయట పడ్డారు. మమ్మల్ని వదిలిపెట్టెయ్యి!"

"నువ్వు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా దుష్టపాత్రను నిర్వ హించావు."

శాంతారాం భయంగా చూశాడు.

"అందుకే మిమ్మల్ని రోజు కొకరిగా చంపుతాను."

ఆరుగురి మొహాల్లో విపరీతమయిన భయాందోళనలు రేగాయి.

"గంగులూ! నా డ్యూటీ చేయడం తప్పా?"

"అబ్బే! కాదు! నా డూటీ నాదీ! ఈ రోజు నీ ముద్దులకొడుకు రాజు చస్తాడు."

మణి చటుక్కున రాజును గుండెలకు హత్తుకొంది. గంగులు భయంకరంగా నవ్వాడు.

"నీ రాజును యెవడూ రక్షించలేడు!" గంగులు పిస్తోలు ఎగరేశాడు.

లత, పార్వతీశం, రాంగోపాల్, కాంతారాం చుట్టూ గుమిగూడారు. మధ్యలో మణీ, రాజూ.

తుఫానుకి పణికే పిల్లను రెక్కల క్రిందకు దాచుకునే కోడిలాగా.

"పిచ్చి వెధవల్లారా! రాజును పిస్తోలుతో కాల్చను" గంగులు వెనక్కి తిరిగాడు. బయటకు నడిచాడు. అతడి వెనుక తలుపు మూసుకుంది.

"మనం ఈ రాత్రంతా కాపలా వుందాం! రాజుకి యే ఆపదా రాకుండా చూసుకొందాం!" అన్నాడు పార్వతీశం.

మణి యేడుస్తోంది.

## 8

ఎక్కడో పక్షులు కిలకిల లాడుతోన్నాయి.

మణి చటుక్కున కళ్ళు తెరచింది. గదిలో హరికేన్ లాంతరు వెలుగుతోంది. తలుపుకద్ద అడ్డంగా తన భర్తా, పార్వతీశం అన్నయ్యా పడుకొని వున్నారు. లత మంచానికి చేరగిలబడి జోగుతోంది.

తన ప్రక్కనే పడుకున్న రాజు నుదురు నిమిరింది. విద్యుత్ఘాతం తగిలిన దానల్లే వులిక్కిపడింది.

రాజు నుదురు చల్లగా తగిలింది.

రాజు పెదిమలు తడి ఆరివున్నాయి. శరీరం లేత నీలం రంగుకు తిరిగి వుంది.

మణి కెవ్వున అరచింది.

గదిలో మిగతా నలుగురూ నిద్రలోంచి వులిక్కిపడి లేచారు. మణి యేడుస్తోంది. గుండెలు బాదుకుంటోంది. రాజామీద పడి పొర్లి పొర్లి యేడుస్తోంది. ఆ దృశ్యం చూసి నలుగురికీ గుండెలు ద్రవిస్తోన్నాయి.

రాజా ఎలా చనిపోయాడు?

శరీరం నీలంరంగుకు ఎలా మారింది?

ఆడా మగా లేకుండా అందరూ ఏడుస్తున్నారు. గంటకు పైగా సమయం బరువుగా గడిచింది.

రాంగోపాల్ ముందుగా తేరుకొన్నాడు.

చటుక్కున తలుపు లాగాడు. సులువుగా తెరుచుకుంది. బయటకు దూకబోయి ఆగాడు. గది బయట యిద్దరు దుండగులు నిలబడి వున్నారు. ఆ యిద్దరి చేతుల్లోనూ మిషన్ గన్స్ వున్నాయి. అవి తలుపువైపు గురి పెట్టి వున్నాయి.

"గంగులు ఎక్కడ?" అడిగాడు రాంగోపాల్.

సాయుధులలో ఒకడు ముందుకు వచ్చాడు.

"రాజేంద్ర!" అన్నాడు రాంగోపాల్.

"అవున్నా తోడల్లుడూ! పారిపోతున్నావా?"

"మీకు దయాదాక్షిణ్యాలు లేవా?"

"లేవు."

"ఛీ...."

రాజేంద్ర వికటంగా నవ్వి, "ఒక పావుగంటలో వాడి శవాన్ని పాతిపెట్టి రండిరా. ఈ రాత్రికి చావబోయే వంతు ఎవరిదో తెలుస్తుంది!" అన్నాడు.

రాంగోపాల్ భయంగా లోపలకు నడిచాడు.

అప్పటికి యేడ్చి యేడ్చి మణీ, లతా స్పృహతప్పి పోయారు.

శాంతారాం దుఃఖం దిగమింగుతున్నాడు.

పార్వతీశం లేచాడు. శవాన్ని భుజాన వేసుకున్నాడు. మౌనంగా బయటకు నడిచాడు.

రాంగోపాల్, శాంతారాం అతడిని అనుసరించారు.

వాళ్ళ వెనుక రాజేంద్ర బయలుదేరాడు. సాయుధుడు గది తలుపులు మూశాడు. అక్కడే కాపలా వుండిపోయాడు.

విశాలమయిన నడవా దాటి తోటలో ప్రవేశించాడు పార్వతీశం. తోట చుట్టూ ఎత్తయిన ప్రహరీ. ప్రహరీకో సింహద్వారం. సింహద్వారం దగ్గర నాలుగు వేట కుక్కలు.

గంగులు వేటకుక్కలకు మేత వేస్తున్నాడు.

అవి మాంసపు ముక్కల కోసం ఎగిరెగిరి పడుతున్నాయి.

రాజేంద్ర తోట చివర చూపించాడు.

పార్వతీశం శవాన్ని అక్కడ దించుకున్నాడు.

గంగులు అక్కడకు వచ్చాడు.

"శాంతారాం! నీ అవివేకానికి చిన్నవాడు బలయాడు. తెల్లవారితే నీ భార్య నీకు దక్కదు" పక పక నవ్వాడు గంగులు.

## 9

సాయంకాలం నాలుగు గంటలయింది. రాంగోపాల్ మెల్లగా గదిలోంచి బయటకు వచ్చాడు.

గుమ్మం దగ్గర సాయుధంగా వుండే రాజేంద్ర కానీ, రెండో వ్యక్తి కానీ లేరు. రాంగోపాల్ పిల్లిలాగా నడుచుకుంటూ హాలులోకి వెళ్ళాడు. అక్కడ నిర్మానుష్యంగా వుంది. కత్తిగుల్ల ఆకారంలోని ఇనుప మెట్లు

ఎక్కాడు. పై నడవాలో ప్రవేశించాడు.

బురుజు దగ్గర అలికిడయింది.

సాయుధుడు బురుజు దాటి అవతలి నడవాలో ప్రవేశించాడు. అతడు మరల ఇటు రావడానికి మూడు బురుజులు చుట్టి రావాలి. అతడి డ్యూటీ బురుజులు నాలుగూ చుట్టి తిరిగిరావడం!

రాంగోపాల్ నిశ్వసించాడు. చప్పుడు కాకుండా పిట్టగోడ దగ్గరకు వెళ్ళాడు. దూరంగా చిట్టడవిలో కొద్దిపాటి కోలాహాలం వినిపిస్తోంది. ఏదో వేట బృందం కాబోలు! తుపాకీలు పేలాయి.

'కోటమీద నుండి దూకితే!' రాంగోపాల్ ముందుకు ఒంగాడు.

పిట్టగోడ క్రింద రకరకాల ఎత్తులలో క్రింద అంతస్తులున్నాయి. వాటి పిట్టగోడలు మాత్రం కొద్దిగా గాలిలోకి లేచివున్నాయి.

తాను దూకితే పిట్టగోడమీదకు దూకగలగాలి. ఇవతల గోడా, అవతల గాలీ. అడుగు వెడల్పు గోడమీద తాను యింత ఎత్తునుండి దూకి ఆనుకోగలడా?

నిలువుగా వున్న కోటగోడమీద పడితే సున్నంలోకి ఎముకలు మిగలవ్.

చిట్టడివిలో వున్న వేటబృందాన్ని ఆకర్షిస్తే? ఫలితం వుంటుందా? వుండదా?

రాంగోపాల్ నిశ్శబ్దంగా బురుజులోకి నడిచాడు. గోడ ప్రక్కగా నిక్కి నిలబడ్డాడు. చెవులు ఓరగా పెట్టి వినసాగాడు.

సాయుధుడు పిట్టగోడ వద్ద నడుస్తున్నాడు. బూట్ల శబ్దం లయగా వినిపిస్తోంది. రాను రాను శబ్దం దగ్గరవు

తోంది.

రాంగోపాల్ వూపిరి బిగబట్టాడు.

సాయుధుడు బురుజులో ప్రవేశించాడు.

రాంగోపాల్ ఎగిరి అతడి మెడను వాటేసుకున్నాడు. సాయుధుడు క్రింద పడ్డాడు. అతడితోబాటు రాంగోపాల్ క్రింద పడ్డాడు. మెషీన్‌గన్ తుళ్ళి అంత దూరంలో పడింది.

రాంగోపాల్ మెషిన్‌గన్ వైపు ప్రాకాడు. సాయుధుడు అతడిని బూటు కాలితో తన్నాడు. రాంగోపాల్ దొర్లి మెషీన్‌గన్ వైపు పడ్డాడు. చటుక్కున అందుకొన్నాడు గన్.

సాయుధుడు చేతులమీదుగా పిల్లిమొగ్గ వేశాడు. రాంగోపాల్ చేతిలోని మిషన్ గన్ యెగిరి బురుజు అవతల పడింది. సాయుధుడు పరుగెత్తి మిషన్ గన్ అందుకొన్నాడు.

రాంగోపాల్ చేసేదిలేక చేతులు ఎత్తాడు.

మెట్లు దిగి తన గదికి చేరుకొన్నాడు. రాజేంద్ర గుమ్మం దగ్గర నిలబడి వున్నాడు. అతడి చేతిలో మెషిన్ గన్ వుంది.

"ఫలవాలేదురా, తోడల్లుడూ! నీకు సాహసం వుంది" నవ్వాడు రాజేంద్ర.

రాంగోపాల్ తలుపు తోసుకొని లోపలకు నడిచాడు....

తండ్రీ, కాంతారాం, లతా, మణీ అతడివైపు చూస్తోన్నారు. అందరూ పది పదిహేను రోజులు లంఖణాలు చేసినట్టు కనిపిస్తున్నారు.

రాంగోపాల్ నిట్టూర్చాడు. ఈరాత్రి మణి అత్తయ్య

చచ్చిపోతుంది. రాజు విష ప్రయోగంతో చచ్చి పోయాడు. విషప్రయోగం ఎప్పుడు జరిగింది? ఎలా జరిగింది? కంచాలవద్ద పేర్లురాసిన కాగితంముక్కలు అందుకే వుంచారా!

"మణీ! నువ్వు కూడా విషంవల్లనే చనిపోతావు" అన్నాడు రాజేంద్ర లోపలకు వచ్చి.

అందరూ వులిక్కిపడ్డారు.

"వద్దు....వద్దు. మమ్మల్ని చంప వద్దు" లత గొల్లుమంది.

రాజేంద్ర చటుక్కున లత దగ్గరకు దూకాడు. ఆమెను భుజం పట్టుకొని తనమీదకు లాక్కున్నాడు.

రాంగోపాల్ అడితమీదకు దూకబోయాడు.

రాజేంద్ర అతడికి ఆ అవకాశం ఇవ్వలేదు. లతను గుమ్మంలోంచే బయటకు తోశాడు. తనూ బయటకు దూకాడు. తలుపులు దగ్గరగా లాగాడు.

మణి సన్నగా యేడుస్తోంది.

రాజేంద్ర విసురుగా లతను నడిపించుకొంటూ ప్రక్కగదిలో వెళ్ళాడు. తలుపును బలంగా తన్ని మూశాడు. లతను మంచం మీదకు తోశాడు. లత మంచం మీద బోర్లాపడింది. కోపంతోనూ, నిస్సహాయతతోనూ లత వగురుస్తోంది.

రాజేంద్ర ఆమె పమిట పట్టుకు లాగాడు. లత మంచం మీద దొర్లుతోంది. రాజేంద్ర చేతిలోకి చీర వూడి వచ్చింది. లత కేవలం పావడతోనూ, బ్లవుజ్ లోనూ వుంది. లత గింజుకొంటోంది.

రాజేంద్ర మెషిన్ గన్ ప్రక్కన పెట్టి ఆమెమీదకు దూకాడు.

తలుపు తెరుచుకొంది. గంగులు ప్రత్యక్షమయ్యాడు! అతడి కళ్ళల్లో ఎర్రటి జీరలు!

"రాజేంద్రా!" అరిచాడు గంగులు.

రాజేంద్ర ప్రక్కకు తిరిగిచూశాడు. లత శరీరంతో పెనుగులాడే చేతులు ఆగాయి. లత పెనుగులాడుతోంది.

"నిన్ను యిష్టపడని స్త్రీతో అనుభవం నరకం! చింతపల్లి జమీందారును నా చెల్లెలు యిష్టపడే వుంటే...." గంగులు గొంతు వణికింది. "చరిత్రే మరో రకంగా వుండేది. నిన్ను యిష్టపడని స్త్రీని బలవంతంగా అనుభవించావా, చింతపల్లి జమీందారులాగా...."

రాజేంద్ర అసమ్మతిపూర్వకంగా చూశాడు.

"ఈ చిలక నీ గుప్పెట్లోంచి పారిపోదు. ఈమె నిన్ను ఇష్టపడుతుంది. ఓపికపట్టు. మరో మూడు రోజులు."

# 10

మణి గిలగిల కొట్టుకొంటోంది. ఆమె శరీరంమీద వున్న దుప్పటి ముడతలు పడుతోంది.

శాంతారాం భార్యను సమీపించాడు.

అప్పటికే పార్వతీశం, లత, రాంగోపాల్ మంచం చుట్టూ చేరారు. మణి నురుగులు క్రక్కుతోంది. శాంతారాం దుప్పటి తొలగించబోయాడు.

మణిలో చలనం ఆగిపోయింది.

శాంతారాం విసురుగా దుప్పటి లాగాడు. మణి కట్టుకొన్న చీరమీద నల్లత్రాచు ప్రాకుతోంది.

"అమ్మా!" అరచింది లత. అరుస్తూనే ఆమె స్పృహ తప్పిపోయింది. రాంగోపాల్ విసురుగా పామును తోక పట్టుకున్నాడు. కోపంతో గిరగిరా గాల్లో పామును

త్రిప్పి గోడకుకొట్టసాగాడు. ఎంత సేపు కొడుతున్నాడో కాని పార్వతీశం అతడి భుజం తట్టాడు.

పాము శరీరం చిట్లి చీలికలయింది. గోడ నెత్తురుతో కండలతో ఎర్రబడింది.

భార్య శవంమీద శాంతారాం తలవాల్చాడు. చీకట్లో తడుముకొనేవాడిలాగా శవాన్ని తడుముతున్నాడు. కళ్ళు వర్షిస్తున్నాయి. శవం కన్నీటితో తడుస్తోంది.

తలుపు తెరుచుకొంది. గంగులూ, రాజేంద్రా లోపలకు వచ్చారు.

"చూశావా శాంతారాం! కోర్టులో నా సాక్ష్యాలు ఎలా కొట్టిపార వేశావో, గుర్తొస్తోందా? ఇప్పుడు కూడా సాక్ష్యం దొరకని చావు!" నవ్వాడు గంగులు.

శాంతారాం విసురుగా లేచాడు. అతడి కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. గంగులుమీదకు దూకాడు. గంగులు అతడిని చీమను విసిరికొట్టినట్టు విసిరికొట్టాడు.

శాంతారాం గోడమీద పడ్డాడు. తిరిగి విసురుగా లేచాడు. గంగులు మెడ దొరకబుచ్చుకొన్నాడు. గంగులు విదిలించుకొన్నాడు. రెండు చేతులునూ బ్లేడు ల్లాగా చేసుకొన్నాడు.

శాంతారాం మెడమీద రెండు కత్తులు పడినట్లు చేతులుపడ్డాయి. శాంతారాం కుప్పకూలిపోయాడు.

"పార్వతీశం! ఈ రాత్రికి నువ్వు కుక్కలకు ఆహార మవుతావు. హాలులో వున్న మెట్లు ఎక్కి పారిపో. అయిదునిమిషాల్తర్వాత కుక్కలు వెంట తరుముతాయి. వేటకుక్కలు!"

పార్వతీశం మొహంలో మృత్యుచ్ఛాయ!

"కంగారుపడక! నీ చేతికి పొడవుపాటి కత్తి ఇస్తాం!"

కంగులు వెనక్కి తిరిగాడు.

రాంగోపాల్ ఆలోచనలోపడ్డాడు. నరరూప రాక్షసుడు. కంగులు తమలో రాత్రికి ఒక్కొక్కరినీ చంపేస్తున్నాడు.

ఎటూ తమ అందరికీ చావు తప్పదు! తెగించాలి! ఎలా?

## 11

మెట్లవద్ద నిలబడ్డాడు కంగులు. అతడి చేతిలో వేట కుక్కల త్రాళ్ళున్నాయి. త్రాళ్ళ చివర వేటకుక్కలు వగురుస్తోయి.

ఇనుప మెట్ల పైభాగంలో పార్వతీశం నిలబడివున్నాడు. అతడి చేతిలో పొడవుపాటి కత్తి వుంది. కంగులు అక్కడి నుండి కనిపిస్తోన్నాడు. ఇవతలి ప్రక్కకు చూశాడు. కుక్కలకు అవతల రాజేంద్ర, రెండో సాయుధుడు నిలబడివున్నాడు. కంగులుకు వెనక భాగంలో లతా, రాంగోపాల్, శాంతారాం, భయంతో బిగుసుకుపోయి వున్నారు.

లత ఈ ఘోరం చూడలేనట్టు కళ్ళు మూసుకుంది.

శాంతారాం వణుకుతోన్నాడు. రాంగోపాల్ కళ్ళు ఎర్రబడి వున్నాయి. శాంతారాంను మెల్లగా తాకాడు. అతను మోచేత్తో గుచ్చాడు.

ముగ్గురూ గుప్పెళ్ళతో సాయుధలవైపు విసిరారు. గుప్పెళ్ళతో సిద్ధంగా వుంచుకొన్న మట్టి రాజేంద్రకూ, అతడి తోటి సాయుధుడికీ కళ్ళలో పడింది.

కంగులు కుక్కల త్రాళ్ళు వదలిపెట్టాడు. వాళ్ళవైపు చూశాడు.

పార్వతీశం చటుక్కున మెట్లమీదకు ఎగిరాడు. మరు

క్షణంలో అతడు గాలిలో వున్నాడు. నాలుగు కుక్కలూ గాలితో పోటీపడి పైకి పరుగెత్తుతున్నాయి. పార్వతీశం కిందకు ప్రవాహంలాగా చొచ్చుకు వస్తోన్నాడు.

వేటకుక్కలూ అతడూ గాల్లోనే తప్పుకున్నారు.

పార్వతీశం నేరుగా గంగులుమీద పడ్డాడు. ఇద్దరూ నేలకు అతుక్కుపోయారు. ఇద్దరికీ తలలు పగిలాయి.

రాంగోపాల్ సాయుధులవైపు దూకాడు. వాళ్ళ చేతుల్లో వున్న మెషిన్ గన్స్ ఎగిరిపడ్డాయి.

రాజేంద్ర కళ్ళు మెరమెరలాడాయి. చీకట్లో తన్నే వాడికిలాగా ఎడాపెడా బూట్లకాళ్ళతో తన్నసాగాడు. రాంగోపాల్ కి తగలరానిచోట్ల దెబ్బలు తగిలాయి.

రెండో సాయుధుడు శాంతారాంను ఈడ్చిపెట్టి తన్నాడు.

నేలమీద గంగులు, పార్వతీశం తలలు పగిలిన నెత్తురూ, తెల్లటి మెదడూ ప్రాకుతోన్నాయి.

వేటకుక్కలు వెనక్కి తిరిగాయి.

మరుక్షణంలో అవి ఆ ఇద్దరి శవాలను పీక్కుతింటున్నాయి.

శాంతారాం, లత రాంగోపాల్ ప్రాకుతూ తమ గదిలోకి పారిపోయారు. తలుపు వేసుకున్నారు. రాం రాంగోపాల్ మూలుగుతోన్నాడు. బయట మెషిన్ గన్స్ కర్కశంగా గర్జించాయి. వేటకుక్కలు మూలిగాయి.

లత మంచంమీద వాలిపోయింది.

## 12

శాంతారాం తోటలో పచార్లుచేస్తోన్నాడు. రాజేంద్ర తనకి ఈ రాత్రికి గడువుపెట్టాడు. తాను తోటలోంచి పారిపోవాలి. అరగంట తర్వాత రాజేంద్ర

తన వెనక పడతాడు. అతడి చేతిలో మెషిన్‌గన్ వుంటుందట!

తను కోటదాటి చిట్టడవిలో ప్రవేశించాలి. కాలవ దాటాలి. దాటగలితే అతడు మెషిన్ గన్ ప్రేల్చడు. లేకపోతే తన ప్రాణాలు మెషీన్‌గన్‌కి బలవుతాయి.

శాంతారాం గుండె పట్టుకున్నాడు.

గుండెల్లో నొప్పి వస్తోంది. తన కళ్ళముందే తన కొడుకూ, తన భార్యా పక్క చావు చచ్చారు. తన బావమరది పార్వతీశం తన ప్రాణాలు త్యాగంచేసి గంగులును చంపాడు.

ఇపుడు చావబోయేది తను.

తన ప్రాణాలు పోతాయనేసరికి తన గుండెల్లో నొప్పి వస్తోంది. ప్రాణాలమీద తీపి అటువంటిదేమో! మొక్కలు కదిలాయి.

రాజేంద్ర మెషిన్‌గన్‌తో వచ్చాడు.

"శాంతారాం! సిద్ధమేనా?" అడిగాడు రాజేంద్ర.

శాంతారాం తడబడ్డాడు. మెలికలు తిరిగాడు. దబ్బున పడిపోయాడు. తలవాల్చాడు.

రాజేంద్ర చప్పున అతడిని సమీపించాడు.

'పిరికి వెధవ! గుండె ఆగి చచ్చాడు. నువు గ్రుడ్డి కొట్టుకు వినబడని చెవివి!' తిట్టుకున్నాడు రాజేంద్ర.

చకచక కోటలోకి నడిచాడు.

పారా పలుగూ తీసుకున్నాడు. శవాన్ని సమీపించాడు.

నిశ్శబ్దంలో నేలను త్రవ్వుతోన్న శబ్దం పరచుకుంటోంది.

గంగులు చచ్చిపోయాడు. తనుతోబాటు ఖైదులోంచి

పారిపోయిన నాలుగో వ్యక్తి రేపు ఉదయానికి హెలి కాప్టర్‌తో ఇక్కడకు వస్తాడు. గంగులు స్థానంలో వాళ్ళకు నాయకుడు రాజేంద్ర!

రాజేంద్ర హుషారుగా తవ్వుతోన్నాడు.

తాను రేపటినుండీ దొంగలనాయకుడు. తమ ముఠాకు బాస్! ఈ రాత్రికి రాంగోపాల్‌ను కూడా చంపేసి, లతను తీసుకొని తను వాళ్ళతో వెళ్ళిపోతాడు.

# 13

"డాడీ వెళ్ళి రెండు గంటలయింది!" ఏడుస్తోంది లత.

ఆమె తలను తన గుండెలకు హత్తుకున్నాడు రాంగోపాల్.

"డాడి చిట్టడవి కాలవ దాటి వుంటారా?"

"దాటి వుంటారనే అనిద్దాం!" లతను మంచంమీద పడుకోబెట్టాడు రాంగోపాల్.

"బావా!" అతడిని వాటేసుకుంది లత.

ఆమె చెక్కిళ్ళు తుడిచాడు రాంగోపాల్.

"మనను కూడా చంపేస్తారంటావా?"

రాంగోపాల్ మాట్లాడలేదు. ఆలోచనలతో పిచ్చెత్తి పోతోంది. తన ప్రాణాలూ లత ప్రాణాలూ దుండగులకు గడ్డిపరకలు! అతడు ఆమె మెడను నిమరసాగాడు. మెడమీద పల్చటి నరం తగులుతోంది. సున్నితంగా రాస్తోన్నాడు రాంగోపాల్. నరం మెల్లగా వుబ్బుతోంది.

లతకు కళ్ళు మూసుకుపోతోన్నాయి.

రాంగోపాల్ నిట్టూర్చాడు. లత నిద్రపోవాలి! ప్రస్తుత పరిస్థితిలో ఆమె మాట్లాడకూడదు. భవిష్యత్తు

మీద ఏకాస్తో ఆశ మిగిలితే అది కాస్తా సంధి ప్రేలా పనలో పోతోంది.

రాంగోపాల్ కి ఎప్పుడో నిద్రపట్టింది.

లత మెల్లగా కళ్ళు తెరచింది. తన మెడమీది నరాన్ని తాకి బావ తనని నిద్రపుచ్చాలని చూశాడు. తను వాగుతోంది! అందుకే బావ నరాన్ని రాస్తూ వచ్చాడు. తను గమనించి నిద్ర నటించింది.

రాంగోపాల్ నిశ్చలంగా ఊపిరి పీల్చుతున్నాడు.

లత మంచం దిగింది. చప్పుడు చేయకుండా తలుపు వద్దకు నడిచింది. తలుపు తెరచింది. గది బయట ఎవరూ లేరు. మంచంవద్దకు నడిచింది. తలగడక్రింద చెయ్యి పెట్టింది. తీసి పమిటచాటున దాచుకుంది. తృప్తిగా చూసింది. బయటకు నడిచింది. తలుపు దగ్గరగా లాగింది. రాజేంద్ర గదిముందు ఆగింది.

చటుక్కున తలుపు తెరచుకుంది.

రాజేంద్ర నవ్వుతూ చూశాడు.

"నీ అంతట నువ్వే వస్తావని తెలుసు!" ఆమెను చేయి పుచ్చుకు లాగాడు.

లత నవ్వుతోంది. ఆమె కళ్ళు మెరుస్తోన్నాయి. అతడి మెడచుట్టూ చేతులు వేసింది.

రాజేంద్ర ఆమెను లోపలకు నడిపించాడు.

"కాని....నిన్ను వెతకాలి! పగపట్టిన పడుచువి!"

లత నవ్వుతోంది. పమిట తీసింది. పమిటను చేతోనే పట్టుకొని చీర పొరలు విప్పుతోంది.

రాజేంద్ర ఆమెను వాటేసుకున్నాడు. కళ్ళు చెదర గొట్టే యవ్వనం ఆమెది!

ఆమెను ముద్దులతో ముంచెత్తుతోన్నాడు.

లత పమిట చాటునుండి చెయ్యి ఒ త్తిగించుకుంది. మణి కట్టుతో అతడి నడుము తడిమింది. చివ్వన చెయ్యి తిప్పింది. బలంగా డొక్కలో గుచ్చింది. చెయ్యి ఎత్తుతోంది. గుచ్చుతోంది. ఆమె చేతులకు పిచ్చి బలం వస్తోంది. రాజేంద్ర బాధతో అరుస్తూ గిరికీలు కొడుతోన్నాడు.

లత అతడిని అందిన చోటనల్లా పొడుస్తోంది.

ఆమె చేతిలోని అద్దం ముక్క లక్క పూసినట్టుగా వుంది.

ఆమె బట్టలనిండా ర క్తం.

లత అతడిని కాళ్ళతో తన్నింది. క్రిందపడ్డాడు. అరుస్తోనే గోడవద్దకు ప్రాకాడు. మెషిన్‌గన్ అందుకోబోయాడు. లత కళ్ళు మూసుకుంది.

తనని రాజేంద్ర చంపేస్తాడు. వాడూ చస్తాడు.

అయితే ఏం? తన బావ అయినా బతుకుతాడు.

రాజేంద్ర మెషీన్‌గన్ అందుకున్నాడు.

తలుపు తెరచుకుంది. రాంగోపాల్ పరుగెత్తుకు వచ్చాడు. వస్తూనే రాజేంద్రను చూశాడు. మెషీన్‌గన్ ఎగిరేలా తన్నాడు. రాజేంద్ర తేరుకోవడానికి అవకాశం ఇవ్వలేదు. జుత్తుపట్టుకున్నాడు. గోడకు అతడి తలను అదిమిపెట్టాడు. గుండెలమీద బలంగా తన్నాడు.

రాజేంద్ర నెత్తురు కక్కాడు. ఉండలు చుట్టుకుని పడిపోయాడు. అతడి మెడమీద కాలుంచి నిలబడ్డాడు రాంగోపాల్.

"లతా!....నీకు .... ప్రమాదం ...." రాంగోపాల్ వగర్చాడు.

"నాకు ఏమీ కాలేదు బావా!"

"నిద్రలో ఇటు తిరిగాను. నువ్వు నాకు తగల

లేదు. మెలకువ వచ్చింది. గదిలోంచి బయటకు వచ్చాను. ఈ గదిలో మూలుగు వినిపిస్తోంది. అంతే! రాజేంద్ర కోసం నా కళ్ళు వెతికాయి."

"మన అంచనా సరైనదయితే కోటలో మరొక సాయుధుడున్నాడు. వాడు కోట పై భాగంలో పిట్ట గోడ దగ్గర వుంటాడు."

ఇద్దరూ కళ్ళు కలిపారు. మెషీన్‌గన్ అందుకున్నాడు రాంగోపాల్.

రాజేంద్ర నాడిపట్టుకు చూసి బయటకు నడిచాడు రాంగోపాల్. ఇద్దరూ ఇనుప మెట్లు ఎక్కారు. పిట్టగోడ వైపు కదిలింది లత.

"ఆగు!" అన్నాడు సాయుధుడు. బురుజు చాటు నుండి పిట్టగోడవద్దకు వచ్చాడు. లత నిలబడిపోయింది.

రాంగోపాల్ చేతిలోని మెషీన్ గన్ నిప్పులు కక్కింది.

సాయుధుడు కూలిపోయాడు.

ఆకాశంలో హెలికాప్టర్ వస్తోన్న చప్పుడయింది. లతా, రాంగోపాల్ కలసి సాయుధుడి శవాన్ని సాయంపట్టారు. బురుజు చాటున దాచారు.

హెలికాప్టర్ బురుజుమీద ఆగింది.

పైలెట్ సీట్లోంచి దిగబోయాడు.

"ఆగు!" అరిచాడు రాంగోపాల్, మెషిన్‌గన్ గురి పెడుతూ.

పైలెట్ చేతులెత్తి నిలబడ్డాడు. రాంగోపాల్, లత హెలికాప్టర్‌లో కూర్చున్నారు.

"హెలికాప్టర్ నడుపు. హైదరాబాద్ నగరం వైపు!" ఆదేశించాడు రాంగోపాల్.

పైలట్ తన సీటులో కూర్చున్నాడు.

హెలికాప్టర్ గాల్లోకి లేచింది.

కాలంతో తనకి సంబంధం లేనట్టు పాతకోట నిర్లిప్తంగా చూస్తోంది.

——:ఐ పో యిం ది:——

# చిదంబర రహస్యం

## టెంపోరావ్

హెూటల్ తోటలో అశ్వద్ధామా, సురేఖా కుర్చీల్లో కూర్చున్నారు. బెంగుళూరులో వేసవికాలం హాయిగా వుంది. సూర్యుడు అస్తమించాడు. చల్లటిగాలి వీస్తోంది.

సిగరెట్ పొగవదుల్తూ అశ్వద్ధామ ఆలోచిస్తూ ఆకాశంవైపు చూస్తున్నాడు. హూటల్ నౌఖరు తెచ్చిన "ఈవెనింగ్ న్యూస్" దినపత్రికను సురేఖ చూస్తోంది.

ఏదో దినపత్రికలో చూసి ఆమె ఉలిక్కిపడింది.

"ఈ వార్త విన్నారా?" అందామె.

ఆమె కంఠం వినగానే మరో ప్రపంచంలోంచి హఠాత్తుగా భూమిమీద పడ్డట్టు ఉలిక్కిపడ్డాడు. సురేఖ వైపు చూశాడతను.

"కోలారునుంచి వచ్చేటప్పుడు మనతో కూడా రైల్లో ఒక ఓల్డు లేడీ ప్రయాణం చేసింది. ఆమె జ్ఞాపకం వుందిగా?"

"ఆమెకేమయింది?" అడిగాడతను.

"బెంగుళూరు స్టేషన్‌లో దిగి యెక్కడికో వెళు తూండగా కారుకింద పడి ఆమె చచ్చిపోయింది."

మిస్ సురేఖ దినపత్రికలో ముద్రించిన ఫోటోను అతడికి చూపించింది. ఆశ్చర్యంగా అతను ఫోటోవైపు చూశాడు.

"రేఖా, స్టేషన్‌లో దిగిన మరుక్షణంలోనే కారు ప్రమాదంలో ఆమె మరణించడం విచిత్రంగా వుంది!"

"అదే నేనూ అనుకొంటున్నాను" అందామె.

అశ్వధ్దామ మెదడులో ఆ ముసలామె రూపం మెదిలింది. ఆమె వయస్సు అరవై యేళ్ళుంటుంది. సగం పళ్లు వూడిపోయాయి. కోలార్‌లో ఆమె ట్రెయినెక్కింది. అతడికెదురుగా ఆమె కూర్చుంది.

"రోజులు మారాయి! రోజులు మారాయి!" అని తనలో తను గొణుక్కుంది.

అశ్వధ్దామ ఆమెను పలకరించాడు. కోలార్‌లో జరిగిన హత్యల్ని గురించి ఆమె చెప్పసాగింది.

"కోలార్‌లో హత్యలు విశేషంగా, విచిత్రంగా జరుగుతున్నాయి. గత నాలుగు నెలల్లోనూ నలుగురు చంపబడ్డారు. నాల్గవ వ్యక్తి నిన్ననే మరణించాడు. అతను మా వూళ్ళో పేరుపొందిన డాక్టర్ రామచంద్రన్. అతనంటే వూళ్ళోవాళ్ళందరికీ చాలా ఇష్టం. నిన్నరాత్రి అతను పొరపాటున నిద్రమాత్రలు ఎక్కువగా మింగి చనిపోయాడు. ఇంతకుముందు సుబ్బయ్య, వేదవతి, నర్సయ్య హత్యచేయబడ్డారు" అందామె.

అప్పట్లో ఆమె చెప్పినదంతా ఏదో కట్టుకథలా అతడికి అగుపించింది. వయస్సుమీరిన ముసలాళ్ళకు అంతర్గతంగా ఏవో భయాలు వుంటూంటాయి. దానివలన

వాళ్ళు ప్రతి చిన్న విషయాన్నీ అనుమానంతో చూస్తారని అతడు అనుకున్నాడు.

ఓ నిమిషం తర్వాత ఆ ముసలామె యిలా అంది. ప్రపంచంలో పాపాలు ఎక్కువవుతున్నాయి. ఎప్పుడో అప్పుడు ఈ పాపాత్ములందరూ ఆ పరమాత్ముని ముందు శిక్ష పొందక తప్పదు. మా వూళ్లో జరిగిన ఈ హత్యలకు కారకులెవరో నాకు బాగా తెలుసు. నేను ఎంత చెప్పినా అక్కడి పోలీసువాళ్ళు పట్టించుకోరు. కట్టుకథలని తోసి పారేస్తారు. అందుకే బెంగుళూరు వెళ్తున్నాను. నాకు తెలిసినదంతా అక్కడి పోలీసువాళ్ళకు చెప్తే వాళ్లైనా కదులుతారని నా నమ్మకం" అందామె.

"ఏమిటంతగా ఆలోచిస్తున్నారు?" సురేఖ అడిగింది.

అశ్వద్ధామ చూపు ఆమెవైపు మళ్ళించి.

"రేఖా కోలార్‌లో జరిగిన హత్యలకు కారకులెవరో బెంగుళూరు పోలీసువాళ్ళకు చెప్పడం కోసం ఆమె ఇక్కడకు వస్తున్నట్లు మనతో అంది. ఆమె చెప్పింది నిజమైతే ఎవరో కావాలని ప్రమాదాన్ని సృష్టించి ఆమెను మరో లోకానికి పంపి వుండొచ్చు" అన్నాడతను.

"అలా జరిగే అవకాశం వుంది. అప్పట్లో ఆమె చెప్పింది నమ్మకపోయినా ఈ వార్త చదివాక నాకు అనుమానంగా వుంది. మనం దర్యాప్తు చేసి నిజం కను క్కోవాలి" అందామె.

అశ్వద్ధామ మరో సిగరెట్ వెలిగించాడు. పొగ వదులూ ఆమెకేసి చూశాడు.

"బెంగుళూరులో వారంరోజులు విశ్రాంతి తీసు కుందామని ఇలా వచ్చాను. ఈ ముసలామె చావు మన కెదురైంది!"

"డోంట్ బాదర్! ఈ కేసు పూర్తయ్యాక వారం రోజులు విశ్రాంతి తీసుకోవచ్చు" అందామె.

అతను ఉర్చీలోంచి లేచాడు.

"అయితే పద!" అన్నాడతను.

ఇద్దరూ సమీపంలో వున్న టాక్సీ స్టాండ్ వైపు నడిచారు.

ఇన్స్పెక్టర్ భట్ ముందుకొచ్చి అశ్వద్ధామ సురేఖలకు నమస్కరించి లోపలకు తీసుకు వెళ్ళి కూర్చోమన్నాడు.

"మీరిలా రావడం నాకు ఆనందంగా వుంది. మీలాంటి పెద్దలు ఏదో కారణం లేకుండా రారు" అన్నాడు భట్.

అశ్వద్ధామ నవ్వాడు.

"ఇవాళ ప్రొద్దుట కారు ప్రమాదంలో ఒక ముసలామె మరణించిందని పేపర్లో చూశాను. దాన్ని గురించి మీరు ఏదేనా చెప్తారని యిలా వచ్చాను" అన్నాడు అశ్వద్ధామ.

ఇన్స్పెక్టర్ భట్ చప్పుడు చేస్తూ పైన తిరుగుతూన్న ఫాన్ వైపు చూసి విసుక్కున్నాడు.

"ఆమె ముసిల్ది, సార్. కళ్ళు బాగా కనబడవు అనుకుంటాను. బెంగుళూరు సిటీ స్టేషన్కి ఫర్లాంగు దూరంలో కారుకిందపడి ఆమె వెంటనే మరణించింది. కారు ఆగకుండా పోయింది. అక్కడకు వెళ్ళి దర్యాప్తు చేసి ఒకామె ద్వారా కారు నెంబర్ తెలుసుకున్నాం. ఆ కారు నంబరు KBX 0842. ఆ కారు కోలార్ లో నివసించే ప్రఖ్యాత జమిందార్ చిదంబరంగారిదని కనుక్కున్నాం. ఆయన ప్రస్తుతం ఈ వూళ్ళోనే వున్నారు.

ఈ ప్రమాదం జరిగే సమయానికి చిదంబరంగారు రైలు స్టేషన్ సమీపంలో వున్న కింగ్స్ క్లబ్‌లో బసచేస్తున్నారు. ఆయన బయటకు వెళ్ళలేదనీ ఆయన కారు ఇగ్నిషన్ కీ జేబులోనే వుందనీ చివరకు తేలింది."

"చనిపోయిన ఆ ముసలామెదీ, జమిందారు చిదంబరం గారిదీ ఒకే వూరన్నమాట!" అన్నాడశ్వద్ధామ ఆశ్చర్యంతో.

"ఆమె కోలార్ కి చెందిన వ్యక్తని మీకెలా తెలుసు?" అడిగాడు భట్.

"మీరెలా కనుక్కున్నారో చెప్పండి."

"ఆమె చేతిలోంచి ఒక బాగ్ పక్కనే పడుంది. అందులో కొన్నిదుస్తులు, భగవద్గీత పుస్తకం వున్నాయి. పుస్తకంమీద మీనాక్షి, కోలార్ అని రాసి వుంది" అన్నాడు ఇన్స్పెక్టర్ భట్.

"ఆమె శత్రువులెవరైనా ఆమెను చంపడంకోసం ఈ కారు ప్రమాదాన్ని సృష్టించి వుండొచ్చుగా?"

ఇన్స్పెక్టర్ భట్ పరిహాసంగా నవ్వాడు.

"అలా జరిగివుంటుందని నేను అనుకోను సార్. పొరుగూరునుంచి వచ్చిన ముసలామె మీదకు కారు తోలి చంపవలసిన అవుసరం ఈ లోకంలో ఎవరికుంటుంది?"

అశ్వద్ధామ లేచి నిలబడ్డాడు.

"కొన్ని సమయాల్లో మనం అనుకోని పనులెన్నో చేయవలసిన అవుసరం మనుషులకు వస్తూ వుంటుంది. ఇంతకీ ఆమె యీ వూరు ఎందుకు వచ్చిందో కనుక్కున్నారా?"

"ఇంకా దర్యాప్తు సాగుతోంది. ఇది సింపిల్ హిట్ అండ్ రన్ కేసు సార్!" అన్నాడు ఇన్స్పెక్టర్.

అశ్వద్ధామ ఓసారి సురేఖవంక చూసి నవ్వాడు.

"మీరు కారు నంబరిచ్చిన ఆ స్త్రీ ఎవరు? ఆమె ఎక్కడ వుంటోంది?"

ఇన్స్పెక్టర్ భట్ తన డ్రాయర్ సొరుగులోంచి ఒక ఫైలును బయటకుతీసి, అది చూసి, కాయితంమీద అడ్రెసు రాసి అశ్వద్ధామకిచ్చాడు.

"థాంక్స్, ఇన్స్పెక్టర్!" అశ్వద్ధామ బయటకు నడిచాడు.

అతడిని సురేఖ వెంబడించింది. ఇద్దరూ కూర్చున్నాక టాక్సీ కదిలింది.

హాల్లోని ఎలక్ట్రిక్ దీపం కాంతిలో ఆమె మొహం మెరుస్తోంది. అశ్వద్ధామనీ, సురేఖనీ ఆమె పరకాయించి చూస్తూ, "దయచేసి కూర్చోండి" అంది. వాళ్ళిద్దరూ కూర్చున్నారు.

"మీ గురించి విన్నాను. నాలాంటి సామాన్య స్త్రీ ఇంటికి మీరు రావడం ఆనందంగానూ, మరోమూల ఆశ్చర్యంగాను వుంది" అందామె. అశ్వద్ధామ సిగరెట్ పొగను వూదుతూ ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"రైల్వేస్టేషన్ సమీపంలో ఒక ముసలామె ప్రమాద వశాత్తూ ఏదో కారుకిందపడి మరణించింది. ఆ కారు నెంబరు మీరు చూశారుగా?"

"నిజం చెప్పాలంటే, ఆ కారు నెంబరు నేను చూడలేదు. నా వెనుకనుంచి ఎవరో ఆవిడ ముందుకొచ్చి ఆ నెంబరును గురించి నాతో చెప్పింది."

"ఏం చెప్పింది?"

"ఆగకుండా పోతోన్న ఆ కారు నెంబరు ఆమె చూసిందట. అది రోల్సురాయిస్ కారు. నెంబరు

KBX 0842. ఇది ఆమె నాకు చెప్పింది. తర్వాత పోలీసువాళ్ళు ప్రశ్నించగా, ఇది నేను వాళ్ళకి చెప్పాను."

"ఆమె మీతో యెందుకు చెప్పింది? మీరు అడిగారా?"

"లేదండి. రోడ్డుమీద పడున్న ఆ ముసలామె చుట్టూ చాలామంది పోగయ్యారు. అదేచోట కొంచెం దూరంగా నేను నిలబడ్డాను. తప్ప తాగి, రాకాసుల్లా కార్లను నడుపుతున్నారని వాపోతో, ఆమె ఆ కారుని గురించి చెప్పింది."

"ఆమెను మళ్ళీ చూస్తే పోల్చగలరా?"

"ఆమె ఎవరో నాకు తెలియదండి. ఇలా చెప్పి అలా మాయమయింది. పోల్చడం కష్టమే."

"ఆమె ఎలా వుంటుంది? వయస్సెంత?"

ఆమె నిస్సహాయంగా నవ్వింది.

"శీతలంగా వుండడంవల్ల మొహానికి మఫ్లర్ చుట్టుకుంది. అదే కాకుండా వీధి దీపాల మసక వెలుతుర్లో ఆమె వయస్సునీ, రూపురేఖలనీ నేను గుర్తించలేక పోయాను."

"మీరు మాకు చాలా సహాయపడ్డారు. కృతజ్ఞుడ్ని!" అంటూ అశ్వద్ధామ, సురేఖకి సౌజ్ఞ చేస్తూ, బయటకు నడిచాడు.

## 3

అశ్వద్ధామ, సురేఖ కోలార్‌లోని హోటల్ గదిలోకి అడుగుపెట్టగానే ముందర హాల్లో వున్న గోడగడియారం పన్నెండు కొట్టింది.

సోఫాలో అశ్వద్ధామ వెల్లకిలా పడుకున్నాడు. అతని పెదిమల మధ్యనున్న సిగరెట్‌ను సురేఖ వెలిగించింది. ఆలోచిస్తూ అతడామె చెయ్యిని పట్టుకొని మెల్లిగా నిమిరాడు.

"రేఖా!"

"చెప్పండి."

"మల్లేశ్వరంలో మనం కలుసుకొన్న స్త్రీ చెప్పిన విషయం విచిత్రంగా వుంది. ఎక్కడినుంచో హఠాత్తుగా వచ్చి, ఆ మఫ్లర్ ధరించినామె ఈమెతో కారు నంబరు గురించి ఎందుకు చెప్పిందో తోచడంలేదు."

"దానిమీద మీరంతగా ఆలోచించనక్కర్లేదు. అనవసరమైన విషయాన్ని గురించి పక్క స్త్రీలతో మాట్లాడుతూ వుండడం మన దేశంలోని వాళ్ళకు అలవాటే!" అంది సురేఖ నవ్వుతూ.

"అంతేనంటావా?"

"దానిలో ఏదేనా వుందని మీరు భావిస్తున్నారా?"

అశ్వద్ధామ కళ్ళు మూసుకొన్నాడు.

"రేఖా, మొహానికి మఫ్లర్ చుట్టుకున్నామె నిజంగా కారు నెంబర్ను చూసిందనుకో! అయితే ఆమె పోలీసు వాళ్ళకి తనే స్వయంగా ఆ నెంబర్ను గురించి ఎందుకు చెప్పలేదు? ఇష్టంలేకా? ఇష్టం లేకపోతే ఆ విషయం మల్లేశ్వరంలో వుంటున్న స్త్రీకి ఆమె ఎందుకు చెప్పింది? దీనిలో వున్న విచిత్రాన్ని నువ్వు గుర్తించాలి. కారు నెంబరు చూడని స్త్రీ పోలీసు వాళ్ళకి ఆ నెంబర్ను అందించింది. కారు నెంబరు చూసిన స్త్రీ మాయమయింది. ఆమె ఎవరు? మరొకరికి నెంబరు చెప్పి పోలీసుల ముందుకు రాకుండా వుండవలసిన అవసరం ఆమెకెందు

కొచ్చింది? కారు కిందపడి మరణించిన ముసలామెతో ఆమెకు పరిచయముందా? ఈ ప్రశ్నలన్నింటికీ జవాబులు దొరికితే మనం నిజానికి దగ్గరవుతాం."

సురేఖ అతనివైపు కొంటెగా చూసి కనురెప్పలు చిట్లించింది. "మనం ఈ ప్రశ్నలు అడుగుతూ కూర్చుంటే హత్య చేసిన వ్యక్తి దొరక్కుండా పోవచ్చు" అందామె నవ్వుతూ.

అశ్వద్ధామ కళ్ళు తెరిచి గది నలువైపులా చూశాడు. ఓరగా తెరచి వున్న తలుపుల మధ్యనుంచి చల్లటిగాలి వీస్తోంది. లేచి గదిలో వున్న పరుపు దగ్గరకు నడిచాడతను. అలసటగా పరుపుమీద వాలాడు.

"రేఖా, ఏం చెయ్యవలసిందీ రేపు ఆలోచిద్దాం. కళ్ళు మూసుకుపోతున్నాయి!"

మిస్ సురేఖ తలుపులు మూసి గడియలు పెట్టింది. గదిలో వెలుగుతూన్న దీపాన్ని తీసేసి ఆమె తన పరుపు మీదకు దొర్లింది.

## 4

డాక్టర్ రామచంద్రన్ భార్య విచార వదనంతో కుర్చీలో కూర్చుంది. ఆమెను చూస్తూంటే అశ్వద్ధామ హృదయం జాలితో నిండింది.

"మీ భర్త ఆకస్మికంగా మరణించారని విన్నాను. దురదృష్టం" అన్నాడు అశ్వద్ధామ మెల్లిగా.

ఆమె జవాబివ్వలేకపోయింది. ఆమె కళ్ళు నీళ్ళతో నిండాయి. అతడామెవైపు జాలిగా చూశాడు.

"అదంతా ఎలా జరిగిందో చెప్పండి."

"రాత్రి ఏడు గంటలకి ఆయన ఒక రోగి యింటికి వెళ్ళి ఎనిమిదింటికి తిరిగి వచ్చారు. భోజనానికి

రమ్మన్నాను. ఆకలి లేదన్నారు. అవులిస్తూ, మత్తులో వున్నట్లు ఆయన గదిలో కెళ్ళి పడుకున్నారు. ఆయనకి విస్కీ తాగడం అలవాటు. ఎక్కడో విస్కీ అధికంగా తాగేవుంటారనుకొని, నేను నా పనులు పూర్తిచేసుకొని పిల్లలున్న గదిలోకెళ్ళి పడుకున్నాను. లేచారేమో చూద్దామని పొద్దుటే ఆయన గదిలోకెళ్ళాను. ఆయనింకా పడుకొనే వున్నారు. చలనంలేదు. భయంవేసింది. వెంటనే ఆయనతో కలిసి పనిచేస్తూన్న డాక్టర్ తంబుస్వామికి ఫోన్ చేశాను. అతను వచ్చాడు. ఆయన రాత్రే మరణించాడని అతను చెప్పాడు."

"ఆయన విస్కీ తీసుకొంటే మామూలుగా భోజనం మానేసేవారా?"

"నిజం చెప్పాలంటే విస్కీ తీసుకున్నాక ఆయనెక్కువగా తినేవారు."

"అయితే ఆ రాత్రి ఆయనెందుకు భోజనం చెయ్యలేదు?"

"ఎక్కడో తిన్నారేమో!"

అశ్వద్ధామ సిగరెట్ పొగను పీల్చి వదులుతూ తీవ్రంగా ఆలోచించసాగాడు.

"ఆ రోజు ఆయన ఎవరింటికి వెళ్ళారు?"

"దుర్గాదేవిగారింటికి."

"ఆమె ఎటువంటిది?"

"చాలా కాలంనుంచీ మావారు ఆమెకు డాక్టర్‌గా వుండేవారు. ఆమె మంచిదే. ఒకప్పుడు ఆమె తండ్రికి బాగా డబ్బు వుండేది. వున్నదంతా గుర్రప్పందాలలో పోగొట్టుకున్నాడు. అందువలన దుర్గాదేవి స్థితి మారింది."

"ఆమెకి పెళ్ళయిందా?"

"లేదండి. ఒకప్పుడు ఆమె జమిందారు చిదంబరాన్ని పెళ్ళాడుతుందని అందరూ అనుకొనేవారు. కాని ఎందు వలనో అది జరగలేదు. ఇంకా చిదంబరంమీదే ఆశలు పెట్టుకొని పెళ్ళి చేసుకోకుండా ఆమె వుండిపోయిందని వూళ్ళోవాళ్ళు అంటూంటారు."

"మీ భర్త పొరబాటున నిద్రమాత్రలు అధికంగా తీసుకోవడం మూలంగా మరణించారని పోలీసులు ఒప్పుకున్నారా?"

"అప్పుడప్పుడు నిద్రమాత్రలు వేసుకొనే అలవాటు ఆయనకుంది. ఎక్కువగా అవి మింగి ఆయన మరణించారని డాక్టర్ తంబుస్వామి పరీక్షమూలంగా తేలింది. ఆయన విస్కీ కూడా బాగా తాగారని డాక్టర్ అన్నాడు. విస్కీ సేవించాక తెలియని స్థితిలో నిద్రమాత్రలు ఎక్కువగా మింగివుంటారని పోలీసులన్నారు."

"ఇంటికొచ్చాక ఆయన నిద్రమాత్రలు మింగడం మీరు చూశారా?"

"లేదండి. నేను నా పనుల్లో వున్నాను."

"డాక్టర్ తంబుస్వామి గురించి మీరు ఏం చెప్పగలరు?"

"ఆయన బతికుండగా అతడికంతగా ప్రాక్టీసు లేదు. ఆయన పోయినప్పటినుంచీ అతడి ప్రాక్టీసు పెరిగింది. అతడు కోపిష్టి మనిషి. ధైర్యం, దీక్షా వున్నవాడు. అతడిని గురించి అంతకంటె నేను చెప్పలేను."

అశ్వద్ధామ ఆమెవైపు ఓ సారి చూసి మెల్లిగా బయటకు నడిచాడు.

# 5

ముందర హాల్లో సోఫాలో కూర్చుని జమిందార్ చిదంబరం ఆమెవంక ఆత్రంగా చూశాడు.

వయ్యారంగా నడుస్తూ ఆమె అతడి ముందుకొచ్చి నిలబడింది. రోజా రంగు జార్జట్ చీర, దానికి సరిపోయే జాకెట్. కోల మొహం. చెక్కిళ్ళమీద సొట్టలుపడి అదృశ్యమవుతున్నాయి. ఆమె కళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. ఆమె శరీరం బంగారం రంగులో వుంది.

చిదంబరం ఆమె అందాన్ని చూసి ఆనందంతో పెదిమలు చప్పరించుకున్నాడు.

"మీకు సెక్రటరీ కావాలని విని యిలా వచ్చాను" అందామె.

"మంచి పనిచేశావు. నీ పేరూ, వూరూ చెప్పు!" అన్నాడతను.

"నేను పంజాబ్‌నుంచి వస్తున్నాను. ఎవ్వరూలేని ఏకాకిని. పేరు ప్రేమ. ఏదో మంచి ఉద్యోగం దొరుకుతుందని యిక్కడికొచ్చాను."

"అమ్మాయి కూర్చో!" అని సోఫాను చూపించాడు వినయంగా. ఆమె కూర్చుంది.

"సెక్రటరీగా వుంటావా?"

"సంతోషంగా, సార్. నా సర్టిఫికేట్లు మీరు చూడొచ్చు!"

అతడు హుషారుగా నవ్వాడు.

"నిన్ను చూశాక నీ సర్టిఫికేట్లు చూడ్డం అనవసరం. ఇవాళనుంచే నా సెక్రటరీగా వుండు. నీ బస కూడా ఇక్కడే."

"థాంక్స్, సార్. నేను చెయ్యవలసిన పనులేమిటో

వివరించండి” అందామె.

“వెర్రిపిల్లా! నీ పనులన్నీ ఒకేసారి చెప్పాలంటే భారతం చదివి వినిపించినట్లు వుంటుంది. నువ్వు హాయిగా ఈ యింట్లో వుండు. చెయ్యవలసిన పనులు గురించి సమయానుకూలంగా నేను చెప్తాను.”

“అలాగే, సార్” అని ఆమె లేవబోయింది.

“కూర్చో!” అన్నాడతను.

ఆమె కళ్ళలోకి చూస్తూ వుండిపోయాడతను. ఆమె తీయగా నవ్వి వూరుకుంది.

## 6

డాక్టర్ తంబుస్వామి వయసు ముప్ఫయిఏళ్ళుంటుంది. పొట్టిగా బలంగా, అందవిహీనంగా వుంటాడు. హృదయంలో ఏదో కోపాగ్ని రగులుతున్నట్లు అతడి కళ్ళు ఎర్రగా వుంటాయి.

అశ్వద్ధామను చూడగానే అతడు లోలోపల విసుక్కున్నాడు.

“ఎవరు మీరు? ఏం కావాలి?” అడిగాడతను.

అశ్వద్ధామ నవ్వుతూ అతడిని పరీక్షగా చూశాడు.

“మీకేం కావాలో త్వరగా చెప్పండి. కాలాన్ని వ్యర్ధపర్చడం నాకిష్టంలేదు. నాకోసం వందలాది రోగులు బయట కాచుకు కూర్చున్నారు.”

“డాక్టర్ రామచంద్రన్ పోయాక మీకు ప్రాక్టీసు ఎక్కువైందని విన్నాను” అన్నాడు అశ్వద్ధామ.

తంబుస్వామి ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు.

“రామచంద్రన్ మరణానికీ, నా ప్రాక్టీసుకీ సంబంధం ఏముందో నాకర్ధంకావడంలేదు!”

అతడు చటుక్కున కుర్చీలోంచి లేచాడు. కోపంగా

అశ్వద్ధామవంక చూశాడు.

"మీ మాటలు అసహ్యంగా వున్నాయి. ఎక్కడి నుంచో వచ్చి యింత అమర్యాదగా, నీతి విహీనంగా నాతో మాట్లాడడం నేను సహించను!"

"జీవితంలో జరిగే కొన్ని సంఘటనల్ని మనం సహించలేం!" అన్నాడు అశ్వద్ధామ, సిగరెట్ వెలిగిస్తూ.

తంబుస్వామి అమాంతంగా టేబుల్ మీదున్న బెల్ కొట్టబోయి, ఎందుకో మానుకున్నాడు.

"ఈ ముసుగులో గుద్దులాట ఎందుకు? మీకేం కావాలో చెప్పండి!"

"రామచంద్రన్ శవాన్ని మీరు పరీక్షించారా?"

"పరీక్షించాను. నిద్రమాత్రలు అధికంగా మింగి ఆయన నిద్రలోనే మరణించారు."

"ఆయన ఆత్మహత్య చేసుకున్నారా? ఆత్మ హత్య చేసుకోడానికి కారణం ఏమిటి?"

"ఆ విషయాలన్నీ నాకంటె బాగా ఆయన భార్యకు తెలిసివుండాలి!"

"మీకు తెలిసిన విషయాలు చెప్పండి."

"రామచంద్రన్ గారి జీవితం సుఖంగా సాగేదికాదు. భార్యాభర్తల మధ్య ఏవో మనస్పర్థలు ఏర్పడ్డాయని నేను విన్నాను. బయటకు వాళ్ళు అన్యోన్యంగా కనబడినా, పులీమేకల్లా బ్రతికేవారు. దాని మూలంగా ఆత్మహత్య చేసుకోడానికి కారణముందో, లేదో మీరే వూహించుకోండి. ఆయన ప్రమాదవశాత్తూ మరణించారని పోలీసులు కూడా ఒప్పుకొన్నారు."

"స్లీపింగ్ పిల్స్ ఎక్కువగా తీసుకొంటే చస్తారని డాక్టర్ రామచంద్రన్ కి తెలియదంటారా?"

"డాక్టర్లందరికీ ఏది విషమో, ఏది అమృతమో తెలిసేవుంటుంది. కాని విస్కీ బాగా తాగడంవలన ఆయన తెలుసుకోలేని స్థితిలో లేరు. ఆయనకు తాగుడు అలవాటు. డాక్టర్లు కూడా మనుషులేగా!"

"డాక్టర్లు కూడా మనుషులే. మనుషుల్లో వుండే నీచమైన ప్రవృత్తులన్నీ డాక్టర్లలో కూడా వుంటాయంటారు! అంతేనా?" అని అశ్వద్ధామ లేచి వడివడిగా బయటకు నడిచాడు.

టేబుల్ మీద తలవాల్చి డాక్టర్ తంబుస్వామి ఆలోచిస్తూ వుండిపోయాడు.

7

సుబ్బయ్య తండ్రి అశ్వద్ధామకి నమస్కరించి, కూర్చొన్నాడు. విచారంతో నిండిన కంఠంతో ఇలా అన్నాడు.

"వయస్సులో వున్న కుర్రాడండి. బాగా తాగుడు అలవాటైంది. ఆ రోజు చీకట్లో తప్పతాగి యింటికి వస్తూండగా కాలుజారి, చిన్న కాలువలోపడి చచ్చిపోయాడు."

"కాలవలో ఎలా పడ్డాడు?"

"మా చిన్న కాలవకి వంతెన లేదండి. తాటిమొండెం మీదనుంచి అందరూ కాలవ దాటుతూ వుంటారు. కాలవకి అవతలివైపున కల్లుపాకలున్నాయి. కల్లు తాగి చీకట్లో కాలవ దాటుతూంటే, వాడి కాలు జారి వుంటుంది. అమాంతంగా కాలవలోపడి, నీళ్ళు తాగి వూపిరాడక ప్రాణం కోల్పోయాడు."

రెండునిమిషాలపాటు అశ్వద్ధామ ఆలోచిస్తూ వుండిపోయాడు.

"ఆ తోటి మొండెంమీదుగా అతనికి కాలవ దాటడం అలవాటేగా?"

"అలవాటేనండి. కాని ఎంత అలవాటు న్నా, ఒక్కొక్కసారి ఆపదలు సంభవిస్తూనే వుంటాయి."

"మీ అబ్బాయికి పెళ్ళయిందా?"

"జమిందార్ చిదంబరంగారింట్లో పని చేస్తూన్న వేదవతిని పెళ్ళాడతాననేవాడు. ఆ పిల్లకు కూడా మా అబ్బాయంటే చాలా యిష్టం. వాడికోసం, పాపం, తన ఉద్యోగాన్ని కూడా అది పోగొట్టుకొంది. కాని ఆమె కోర్కె ఫలించలేదు. అబ్బాయి మరణించాడు. వాడు పోయిన కొంతకాలానికి అది నిరాశతో అటకమీదనుంచి కిందపడి జీవితాన్ని ధ్వంసం చేసుకొంది."

"వేదవతి ఉద్యోగం ఎందుకు పోయింది?"

"చిదంబరంగారికి సుబ్బయ్య అంటే గిట్టదు. వాడిని పెళ్ళాడొద్దని ఆమెతో చెప్పారు. ఆమె వినలేదు. ఆయనకు కోపం వచ్చింది. ఇద్దరూ ముడెట్టుకొని చావండి, శవాలవ్వండి అని శపించి ఆయన వేదవతిని పొమ్మన్నారు."

"చిదంబరంగారు అన్నట్లే వాళ్ళు శవాలయ్యారు" అని అశ్వద్ధామ లేచాడు.

# 8

సేవాసదనం నడుపుతున్న దుర్గాదేవి గదిలోకొచ్చిన అశ్వద్ధామను చూసి నవ్వింది.

"దయచేయండి, కూర్చోండి!" అందామె.

కూర్చుని అతడామెవైపు క్షణకాలం చూశాడు.

"ఏం కావాలో చెప్పండి!"

"నర్సయ్య అనే అతను ఎలా మరణించాడో మీకు

తెలుసుగా?" అశ్వద్ధామ అడిగాడు.

"ఈ వూరు టౌన్ హాలు మీరు చూసేవుంటారు. రెండో అంతస్తులో వున్న కిటికీ వూచలు పట్టుకొని పక్కనున్న గోడకి అతడు రంగువేస్తున్నాడు. అక్కడి నుంచి తటాలునపడి మరణించాడు" అందామె.

"అతడికెవరైన శత్రువులున్నారా?"

"కూలిపనిచేసుకొని బతికేవారికి శత్రువులెవరుంటారు? కాని ఆ రోజు పొద్దుట ఒక సంఘటన జరిగింది. చిదంబరంగారికి వాడిమీద కోపం వచ్చింది. నేను ఆ సమయంలో అక్కడే వున్నాను. గొడ్డులా ప్రవర్తిస్తే చస్తావు అని చిదంబరంగారు వాడిని తిట్టారు. ఆ సాయంత్రం వాడు కిందపడి చచ్చాడు" అందామె.

డిటెక్టివ్ అశ్వద్ధామ ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాడు. ఏమిటీ చిదంబరం రహస్యం? చిదంబరానికి కోపం రాగానే ఆ వ్యక్తిని ఎవరు హతమారుస్తున్నారు? ఆ వ్యక్తిని అతడే చంపుతున్నాడా? లేక డబ్బిచ్చి ఎవరిచేతనైనా చంపిస్తున్నాడా?

"బెంగుళూరు స్టేషన్ సమీపంలో కారుకిందపడి మరణించిన మీనాక్షి మీకు తెలుసా?"

"తెలుసు. పనీపాటాలేని ముసల్ది. అందరి విషయాల్లోనూ జోక్యం చేసుకుని లోకం పాడయిపోతోందని బాధపడేది. అంతులేని చాదస్తం!"

"ఆమె బెంగుళూరు ఎందుకు వెళ్ళింది?"

"నాకు తెలియదు."

"ఆమె బెంగుళూరు వెళ్ళినప్పుడు యిక్కడినుంచి ఎవరైనా బెంగుళూరు వెళ్ళారా?"

"అనేకమంది వెళ్తూవుంటారు. అదే రోజున చిదంబరంగారు కారులో బెంగుళూరు వెళ్ళారు."

"మీరు బెంగుళూరు వెళ్ళలేదా?"

"నాకు యిక్కడి పనులతోనే సరిపోతోంది."

క్షణకాలం అతడు ఆలోచించాడు.

"చిదంబరంగార్ని మీరు ఎందుకు పెళ్లాడలేదు?"

"ఆ విషయం అడక్కండి."

"చిదంబరంగారు అంతా చెప్పారు. అయినా మీరు చెప్పేదికూడా వినడం నా ధర్మం" అన్నాడు అశ్వద్ధామ ఆలోచిస్తూ.

"ఆయన మీకు ఏం చెప్పుంటారో నాకు తెలుసు. పంజరంలోని చిలకలను మెడ పిసికి నేను చంపానని ఆయన మీతో చెప్పుంటారు. అదంతా అబద్ధం. మీరు నమ్మకండి."

"నిజం చెప్పండి!"

"ఒక రోజున నేను యింట్లో లేనప్పుడు ఆయన వచ్చారు. నేను లేనని ఆయనకు కోపం వచ్చింది. నేను తిరిగి వచ్చాను. ఎక్కడికెళ్ళావు అని అడిగారాయన. నా చూపు పంజరంవైపు వెళ్ళింది. నేను ప్రేమతో పెంచుతున్న జంట చిలుకలు మెడలు విరిగి చచ్చి పడున్నాయి. ఆ చిలకలను చంపిన పిశాచానికి యిక నా హృదయంలో స్థానంలేదు. నేనాయనతో మాట్లాడకుండా లోపలకు వెళ్ళిపోయాను. ఇది ఆయన మార్చి చెప్తూ వుంటారు!"

తీవ్రంగా ఆలోచిస్తూ అశ్వద్ధామ బయటకు అడుగు వేశాడు.

సాయంత్రం హాయిగా వుంది. తెల్లటి మేఘాలు సోమరితనంగా ఆకాశంలో కదులుతున్నాయి. జమిందార్ చిదంబరం తోటలోని పూల మొక్కల పక్కన కుర్చీలో కూర్చుని ప్రకృతి సౌందర్యాన్ని చూసి నివ్వెరపోతున్నాడు. ఒకసారి తన ముందున్న పూల చెట్లకేసి తన చూపుని పోనిచ్చాడు. గులాబీ, బంతి, చామంతి, మల్లి, డాలియస్ — అనేక విధములయిన పూల సువాసనలు గాలిలో వ్యాపిస్తున్నాయి. హఠాత్తుగా అతని గుండె వేగంగా కొట్టుకోసాగింది. పూల మొక్కల పక్కనుంచి కాఫీ ట్రే చేత్తో పట్టుకొని, మిస్ ప్రేమ ఊర్వశిలా ఉద్రూతలూగిస్తూ దగ్గరకొస్తోంది. ప్రకృతి సౌందర్యమంతా ఆమెలో లీనమైనట్లు అతనికగుపించింది. ఆనంద డోలికల్లో ఊగుతూ తన చేతిలోని గులాబీ పువ్వును ఎత్తి వాసన చూశాడు. ప్రేమ కాఫీ ట్రేను బల్లమీద వుంచి, చిన్నగా నవ్వింది. చిదంబరం లేచాడు, ఊహాతీతమైన ఉద్రేకమేదో, అతని ప్రతీనరంలోనూ ప్రవహించి అతన్ని ఉప్పొంగిస్తోంది. తన చేతిలోని గులాబీ పువ్వును ఆమె జడలో పెట్టి, చిదంబరం బానిసలా ముగ్ధుడై ఆమెముందు నిలబడిపోయాడు. చివరికి వణికే కంఠంతో ఈ మాటలు తొణుకుతూ బయటపడ్డాయి.

"ప్రేమా నువ్వంటే నాకెంత ఇష్టమో ఆకాశంలోని నక్షత్రాలనడిగితే నీకే తెలుస్తుంది! ఇంతకాలం ఒంటరిగా నీ కోసమే బ్రహ్మచారిగా కాచుకు కూర్చున్నానేమో అనిపిస్తోంది!"

"కాఫీ త్రాగండి" అని ప్రేమ మళ్లా చిన్నగా నవ్వింది. రెండు కప్పులలో కాఫీ కలిపింది.

"ప్రేమా, మనం వెంటనే వివాహం చేసుకుందాం. ఈ ప్రపంచంలో మీవాళ్లు ఎక్కడేనా వుంటే చెప్పు. వాళ్ళకి ఈ శుభవార్త టెలిగ్రాం ద్వారా తెలియ జేయిస్తాను."

"నాకెవ్వరూ లేరని ఇంతకుముందే చెప్పానుగా!" అంది ప్రేమ.

"నాకెవ్వరూ లేరు, ఒక్క దుర్గాదేవి తప్పితే. ఆమెకూ, నాకూ ఏదో చుట్టరికం వున్నా, మా యిద్దరి మధ్యా భూమికీ సూర్యుడికీ మధ్య వున్నంత దూరంవుంది. ఏదీ, ఇలా చూడు, ప్రేమా, నన్ను పెళ్లాడుతావా?"

ఆ పేక్షిస్తూన్న అతని కళ్ళల్లోకి ప్రేమ కొంటెగా చూసింది. లావుగా, మోటుగా, ధనంతో మదమెక్కిన ఈ చిదంబరాన్ని తను పెళ్ళాడ్డమా! తనలో తను నవ్వు కుంది. ఆత్రంగా ఆమెని చిదంబరం చూస్తూ వుండి పోయాడు.

"నన్ను క్షమించండి. నేను మీ దగ్గర ఉద్యోగంలో నిన్ననే చేరాను. మీ హృదయాన్ని అర్థంచేసుకుంటే గాని నా హృదయాన్ని ఇవ్వలేను."

"ప్రేమా! నా హృదయాన్ని తనివితీరా అర్థంచేసుకో. అటుపైనే మన పెళ్ళి!"

మిస్ ప్రేమ కాఫీ కప్పును అతడికిచ్చింది.

"మన పెళ్ళి విషయం మాని కాఫీ తాగండి!" అందామె నవ్వుతూ.

అతడు గుటకలేస్తూ కాఫీ తాగాడు.

## 10

తోటలోని మాటలు విని ప్రేమ కిటికీగుండా కిందకు చూసింది. చిదరంబరం' సమీపంలో వున్న కారు

డ్రయివర్ను తిడుతున్నాడు.

"బొత్తిగా బుద్ధిలేకుండా ప్రవర్తిస్తున్నావు. నా అనుమతిలేనిదే ఎవర్నీ నా కారులో ఎక్కనీయవద్దని నీకు వెయ్యిసార్లు చెప్పాను."

డ్రయివరు జవాబివ్వలేదు. చేతులు జోడించి నిలబడ్డాడు.

కోపంతో చిదంబరం డ్రయివర్ని కొట్టబోయాడు. అంతవరకూ వూరుకున్న డ్రయివర్ ముందుకు దూకి చిదంబరాన్ని బలంగా తోశాడు. గిర్రున తిరుగుతూ నేలమీదపడ్డాడు.

ఆగ్రహంతో అతడు డ్రయివర్ వంక చూశాడు.

"దొంగ వెధవా! ఎంత మొండి ధైర్యం! నామీద చెయ్యి వేస్తావా? నాకు కోపం తెప్పించినవాళ్ళు శవాలై నేలకూలారు. రాస్కెల్, షో! నువ్వు చేసిన పాపానికి ఘోరంగా చావు!" అర్చాడతను.

డ్రయివర్ వ్యంగ్యంగా చూస్తూ వెళ్ళిపోయాడు.

మిస్ ప్రేమ మెట్లుదిగి హాల్లోకి చేరుకుంది. చిదంబరం సోఫాలో కూర్చుని వున్నాడు.

"ఏం జరిగింది?" ఆమె అడిగింది.

"నువ్వు యింతవరకూ ఎక్కడ వున్నావు?"

"మేడమీద నా గదిలో వున్నాను. ఏదో గోల విని యిలా కిందకు పరుగెత్తుకొచ్చాను."

తనకు జరిగిన అవమానాన్ని ఆమె చూడలేదని అతడు సంతోషించాడు.

"ఏమీలేదు ప్రేమా! డ్రయివర్ నిర్లక్ష్యంగా పని చేస్తున్నాడు. వాడికి బుద్ధి చెప్పాను."

"ఏవో కేకలు వినపడ్డాయి!"

"వాడు సణగడం ప్రారంభించాడు. నాకు కోపం హెచ్చింది. గట్టిగా అర్చి వాడి నోరు నొక్కేశాను. నాకు కోపంవస్తే తనకే ప్రమాదమని ఆ మూర్ఖుడికి తెలియదు!"

చిదంబరం ప్రేమ చెయ్యి పట్టుకొని దగ్గరగా లాక్కున్నాడు.

"ప్రేమా, పూర్వకాలంలో మన ఋషులు శపించేవారు. వాళ్లు శపించినట్లే అంతా జరుగుతూ వుండేది. నా జీవితాన్ని పరిశీలిస్తే ఋషుల శాపాలు ఒక అపారమైన దైవిక శక్తి వలన ఫలించేవనీ, ఆ శక్తి నాలో వుందనీ నీకే రుజువు అవుతుంది."

"చాలా విచిత్రంగా వుంది — నన్ను శపించకండి!"

చిదంబరం నవ్వాడు.

"నీకొక రహస్యం చెప్తున్నాను, విను. నాలో ఏదో వూహకందని దైవికశక్తి వుందనిపిస్తోంది. దానిమూలంగా నా శత్రువులు చీమల్లా నలిగిపోతున్నారు.

రామచంద్రన్ నన్ను ఎదిరించాడు. తర్వాత చచ్చిపోయాడు. సుబ్బయ్య, నర్సయ్య, వేదవతి స్మశానానికి తోవ తొక్కారు. నన్ను ఎదిరించిన ఈ డ్రయివర్ గాడు బతుకుతాడా? రేపో మాపో చస్తాడు!" అన్నాడు చిదంబరం.

"కారుకిందపడి చచ్చిన ముసలామేనా వేదవతి?"

"ఆ ముసలిదాని పేరు మీనాక్షి. వేదవతి వేరు!"

"ఆ మీనాక్షి మీ శాపం మూలంగానే కారుకింద పడి చచ్చిందా?"

"మీనాక్షిని నేను శపించలేదు. ఆమె ఎందుకు మర

ణించిందో నాకు తెలియదు."

మిస్ ప్రేమ ఆలోచిస్తూ వుండిపోయింది.

* * *

మర్నాడు పొద్దుటే చిదంబరం, ప్రేమ హాల్లో కూర్చుని కాఫీ తాగుతున్నారు. నౌఖరు రంగయ్య హడావిడిగా లోపలకు వచ్చాడు.

"డ్రయివర్ రాత్రి చచ్చిపోయాడయ్యా!" అన్నాడు రంగయ్య.

నిర్ఘాంతపోతూ ప్రేమ చిదంబరం వంక చూసింది. చిదంబరం కళ్ళు నూతన కాంతితో మెరుస్తున్నాయి.

"మూర్ఖుడు నన్నె ఎదిరించాడు!" అన్నాడు చిదంబరం.

"అతడు ఎలా మరణించాడు?" ప్రేమ రంగయ్యని అడిగింది.

"అతడు రాత్రి సైకిల్ మీద ఇంటికిపోతున్నాడమ్మా. ఒకచోట రోడ్డు బాగుచేస్తున్నారు. అది చూడకుండా అతడు వెళ్ళుంటాడు. అతడు సైకిల్ తోసహా పక్కకు పడ్డాడు. లీడర్ గారి కాంపౌండు చుట్టూ వున్న ముళ్ళ తీగలు అతనికి గుచ్చుకుపోయాయి. పొద్దుట చూసేసరికి చచ్చిపోయి పడున్నాడు" అన్నాడు రంగయ్య.

మిస్ ప్రేమ తటాలున లేచి గుమ్మంవైపు వెళ్ళబోయింది.

"ప్రేమా, ఎక్కడికి?" గద్దించాడు చిదంబరం.

"ఓసారి ఆ డ్రయివర్ని చూసి వస్తాను." అతడామె వైపు సూటిగా చూశాడు.

"శివుడు నాశనం చేసిన ప్రదేశంలో పార్వతి అడుగు

పెట్టడం మంచిది కాదు!" అన్నాడతను.

నవ్వుతూ ప్రేమ బయటకు వెళ్ళిపోయింది.

చిదంబరం కళ్ళుమూసుకొని జరిగినదాన్ని గురించి ఆలోచించసాగాడు.

# 11

హోటల్ గదిలో మిస్ సురేఖ కూర్చుంది. అశ్వద్ధామ ఆమె ముందు యిటూ, అటూ పచార్లుచేస్తున్నాడు.

"రేఖా, ఇంతవరకూ యీ చావులన్నిటికీ జమిందార్ చిదంబరమే కారకుడు అనిపించింది. కాని మనకు తెలిసిన దాన్నిబట్టి డ్రయివర్ చావుకు చిదంబరం కారకుడు కాదు. డ్రయివర్ ప్రమాదవశాత్తూ మరణించాడని అందరూ అనుకొంటున్నారు. ఇంతకుముందు కూడా యిలాగే అందరూ మరణించారు. ఈ చావుల వెనుక ఎవరి హస్తమో వుందని నా నమ్మకం!" అన్నాడతను.

"ఎవరో చేయకుండా ఏదీ జరగదు!" అందామె.

"నిజమే!" అని అతడు మళ్ళా పచార్లు చేయసాగాడు.

అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. కాని ఎంత ఆలోచించినా, తనలో తను ఎంత తర్కించుకున్నా ఏదీ పైకి తేలడంలేదు.

మిస్ సురేఖ మౌనంగా కూర్చుంది.

అశ్వద్ధామ సిగరెట్ పొగ పీల్చి వదులుతూ ఆలోచిస్తున్నాడు. చటుక్కున అతడి మెదడులో ఏదో మెరిసింది. అతడు సురేఖ దగ్గరగా వెళ్ళాడు.

"రేఖా, అంతా బోధపడింది!" అన్నాడు.

అతను చెప్పినదంతా ఆమె విన్నది.

"మీరు చెప్పినదంతా విచిత్రంగా వుంది. అది రుజువు చేయడం కష్టం" అందామె.

"అంత కష్టంకాదు. మళ్ళా ఎప్పుడో చిదంబరానికి ఎవరిమీదో కోపం వస్తుంది. అతడి కోపానికి గురైన వ్యక్తిని మనం వెయ్యి కళ్ళతో చూడాలి. నాకు ప్రస్తుతం అర్థంకాని ఆ శక్తి స్వరూపం మన కళ్ళపడక తప్పదు."

అశ్వర్థామ ఆమె చెయ్యిని మెల్లిగా నిమురుతూ, పక్కనే కూర్చున్నాడు.

## 12

మిస్ ప్రేమ తన పెట్టె బాగ్ పట్టుకొని హాల్లోకి వెళ్ళింది. జమిందార్ చిదంబరం బుద్ధ విగ్రహం ముందు నిలబడ్డాడు. చేతిలో వున్న కత్తిని వేలితో రాసి చూస్తున్నాడు.

అతడి చూపు ఆమెమీదకు వెళ్ళింది.

"ప్రేమా, అయితే నన్ను విడిచి వెళ్ళిపోడానికి నిశ్చయించావన్నమాట!" అన్నాడతను.

"నన్ను క్షమించండి. ఈ యింట్లో వుండాలంటే నాకు భయంగా వుంది. బయటకుపోవడం మంచిదని పిస్తోంది!"

"నీకు భయమెందుకు? నా రెక్కలకింద వూపిరి పీల్చేవారికి అపాయాలు సంభవించవు. నాకు దూరమైతే అధోగతి పాలవుతావు!"

ప్రేమ దీనంగా అతడివైపు చూసింది.

"నన్ను మెల్లిగా వచ్చినట్లే పోనీయండి. నా గొడవ నేను చూసుకుంటాను."

చేతిలోని కత్తిని వేలితో రాస్తూ అతడు ఆమె

దగ్గరగా వచ్చాడు.

"ప్రేమా, నా హృదయాన్ని కవ్వించి, మైమరపించి పారిపోతావా? నాలో నువ్వు రగిలించిన జ్వాలలు ఎవర్నో కాల్చేస్తాయి!"

ప్రేమ పెదిమలు భయంతో వణికాయి. సామాన్లతో ఆమె తొందరగా బయటకు పోయింది.

"ప్రేమా, ఆగు! అమృతంలాంటి నా హృదయాన్ని హాలాహలంగా మార్చిపోతున్నావు. నీకోసం చెప్తున్నాను. నాకు కోపం వస్తే నువ్వు మృత్యువు చేతుల్లో యిరుక్కుంటావు!"

చిదంబరం గుమ్మం బయటకు నడిచాడు. వరండా మీదున్న వ్యక్తివైపు ఆశ్చర్యంతో చూస్తూ వుండి పోయాడు.

"నువ్వెందుకిలా వచ్చావు?"

"సేవాసదనంకి విరాళం అడుగుదామని యిలా వచ్చాను" అంది దుర్గాదేవి.

ఓసారి ఆమె చూపు కాలుతున్న యినపకడ్డీలా అతడి మీదకు వెళ్ళింది. తన చేతిలోని కత్తిని తోటలోకి విసిరి అతడు మౌనంగా హాల్లోకి వెళ్ళిపోయాడు. దుర్గాదేవి ఆలోచిస్తూ బయటకు కదిలింది.

రోడ్డుమీద నిలబడివున్న ప్రేమ దగ్గరకు దుర్గాదేవి వెళ్ళింది. చేతిలో వున్న పెట్టెవైపు చూసింది.

"అమ్మాయి ఏమైంది? ఆయన పొమ్మన్నారా?"

"ఆయన పొమ్మనలేదు. నేనే పోతున్నాను" అంది ప్రేమ.

దుర్గాదేవి గంభీరంగా నవ్వింది.

"ఎందుకు పోతున్నావు?"

"ఈ ఊరంటే నాకు భయంగా వుంది. పొట్టకోసం యిలా వచ్చాను. ఇప్పుడు మరే ఊరైనా పోయి ఉద్యోగం చూసుకోడానికి నిశ్చయించుకున్నాను."

"వెర్రిదానా, చిదంబరానికి భయపడి పారిపోతావా? నీలాటి యువతులు ధైర్యంగా అటువంటివాళ్ళకు బుద్ధి చెప్పాలి! నువ్వు ఎక్కడకు వెళ్ళినా లోకంతీరు ఒకటే. నువ్వు నాతో వచ్చి నేను నడుపుతున్న సేవాసదనంలో పనిచేయి. దిక్కులేనివారి కోసం ఆ సేవాసదనం నేను స్థాపించాను. అక్కడ నీకు సుఖంగా వుంటుంది."

ప్రేమ సంశయిస్తూ వుండిపోయింది.

"పదమ్మాయి! ఏదేనా మంచి ఉద్యోగం దొరికాక నువ్వు వెళ్ళిపోవచ్చు. అంతవరకు నాతో సేవాసదనంలో వుండడం మంచిది."

ఇద్దరూ రోడ్డమ్మట నడవసాగారు.

జమిందారు చిదంబరం భవనం ఊరికి దూరంగావుంది. ఇద్దరూ మెల్లిగా నడుస్తున్నారు. రోడ్డుకి యిటూ అటూ పెద్ద పెద్ద పొదలున్నాయి. ఆ సమయంలో అక్కడ జనసంచారంలేదు. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. ఏదో చప్పుడు విని దుర్గాదేవి వెనక్కుతిరిగి చూసింది. ఒక వాన్ వేగంగా రోడ్డమ్మట వస్తోంది. దుర్గాదేవి ఓరగా ప్రేమవైపు చూసింది. ప్రేమ ఆమె చూపును గుర్తించలేదు.

వాన్ వేగంగా వస్తోంది. దుర్గాదేవి కళ్ళు అమాంతంగా ఎర్రబడ్డాయి. ఆమె హృదయంలో సముద్రాలు పొంగాయి. వాన్ దగ్గరకొస్తోంది. తటాలున ఆమె చెయ్యి కదిలింది. అమాంతంగా ప్రేమ రోడ్డు మధ్యనపడింది.

సడన్ బ్రేకుతో వాన్ ఆగింది. వాన్ ముందు బంపర్

ప్రేమ శరీరానికి కాస్త దూరంలో వుండగా డ్రయివర్ ఆపగల్గాడు.

అశ్వద్ధామ, ఇన్స్పెక్టర్ రామన్, ఆరుగురు కాని స్టేబుల్సు వాన్ లోంచి కిందకు దూకారు.

రోడ్డుమధ్యన పడిన ప్రేమ లేచి నిలబడింది. అందరూ దుర్గాదేవిని చుట్టేశారు.

దుర్గాదేవి మొహంనిండా స్వేదబిందువులు నృత్యం చేస్తున్నాయి. లోకంలోని చీకటి, అవినీతి ఆమె కళ్ళ లోంచి తొంగిచూస్తున్నాయి. జీవంలేని శిలావిగ్రహంలా ఆమె నిలబడిపోయింది.

"చిదంబరం శక్తి స్వరూపం!" అని గర్జిస్తూ అశ్వద్ధామ ప్రేమగా నటించిన సురేఖ దగ్గరకు నడిచాడు.

"రేఖా, యూం ఆర్ లక్కీ! సరైన సమయానికి రాగలనో లేనో అని నేను భయపడ్డాను" అన్నాడతను.

"ఆమె చేసేదంతా నేను మౌనంగా గమనిస్తూనే వున్నాను. హంతకురాలు!" అంది సురేఖ.

# 13

జమిందార్ చిదంబరం తోటలో వాళ్ళందరూ కూర్చుని టీ తాగుతున్నారు. అప్పటికి సూర్యుడు అస్తమించాడు. నలువైపుల నుంచీ చల్లటి గాలివీస్తోంది. పువ్వుల పరిమళం గాలిలో వ్యాపిస్తోంది.

ఇన్స్పెక్టర్ రామన్ ఓసారి చిదంబరంవైపు చూసి అశ్వద్ధామవైపు తిరిగాడు.

"మా పరిశోధన మొదటినుంచీ తప్పు తోవమ్మట వెళ్ళింది. ఇంతకుముందే నిజాన్ని మేం తెలుసుకొనివుంటే యిన్ని హత్యలు ఈ ఊళ్ళో జరిగేవిగావు. తలాతోకా తెలియని ఈ హత్యలకు దుర్గాదేవి కారకురాలని, బుజు

వులతో సహా అశ్వద్ధామగారు నిరూపించడం నేర పరిశోధనా లోకంలో శాశ్వతంగా కొనియాడబడు తుంది" అన్నాడు రామన్.

జమిందార్ చిదంబరం మిస్ సురేఖని సిగ్గుతో చూశాడు.

"అశ్వద్ధామగారూ, దుర్గాదేవి హంతకురాలని మీరు కనుక్కొని, నా పేరు ప్రతిష్టలు పోకుండా కాపాడారు. మీ సేవ నేనెన్నడు మరువలేను. ఈ సమయంలో ఈ కేసుకు సంబంధించిన పరిశోధనను గురించి విపులంగా చెప్తే సంతోషిస్తాం" అన్నాడు చిదంబరం.

స్టేట్ ఎక్స్‌ప్రెస్ సిగరెట్‌ను తీసి, అశ్వద్ధామ వెలిగించాడు. పొగపీలుస్తూ కుర్చీలో వెనక్కి వాలి, పక్కనే వున్న గులాబీ పువ్వును కోసి, దాన్ని కొంటెగా సురేఖ చేతికి అందించాడు. చిదంబరంవైపు చిలిపిగా చూసి నవ్వుతూ, సురేఖ గులాబీ పువ్వును తన జడలో పెట్టు కుంది. అశ్వద్ధామ తన తీవియైన కంఠంతో యిలా చెప్ప సాగాడు.

"మొదట్లో ఈ హత్యలని గురించి నాకంతగా తెలీదు. హాయిగా బెంగుళూరులో ఒక మాసంపాటు వుందామని నేనూ, రేఖా ఆ ఊరు వెళ్ళాం. ఒక రోజు కోలార్ వెళ్ళి అక్కడి బంగారు గనులను చూసి, మళ్ళా బెంగుళూరు వెళుతున్నాం. మాతో కూడా మీనాక్షి అనే ముసలామె ప్రయాణం చేసింది. ఆమెది మీ ఊరే; ఆమె మీ కందరికీ తెలిసిందే. ఈ ఊళ్లో హత్యలు విపరీతంగా జరుగుతున్నాయనీ, పోలీసువాళ్ళు వాటిని ఆపలేకపో తున్నారనీ ఆమె నాతో చెప్పుకుంది. కోలార్ పోలీసు వాళ్ళతో విసుగెత్తి, బెంగుళూరు పోలీసువాళ్ళకి

రిపోర్టిస్తే, వాళ్ళేనా ఏదైనా చేస్తారనే నమ్మకంతో ఆమె రైలులో వెళ్తోంది. బెంగుళూరు స్టేషన్‌లో దిగిన మరుక్షణంలో ఆమె కారు ప్రమాదంలో మరణించింది. ఆమె మూలంగానే ఈ హత్యల్ని గురించి నేను దర్యాప్తు చేయడం మొదలెట్టాను. నేను చేసినది డబ్బుకోసం కాదు, ప్రజల క్షేమం కోసం.

"ఇప్పుడు ఈ ఊర్లో జరిగిన హత్యల్ని గురించి ఆలోచిద్దాం. సుబ్బయ్య తాటి ముండెం మీదనుంచి కాలవ దాటుతూ జారిపడి చచ్చాడు. అతడు పోయిన కొన్ని రోజుల్లో అతడిని ప్రేమించిన వేదవతి ఊరగాయి జాడీల కోసం అటకెక్కి, జాడీలతో సహా కిందపడి మరణించింది. నర్సయ్య రెండో అంతస్తులో ఉన్న కిటికీ ఊచలను పట్టుకొని గోడకు రంగు పూస్తూ అమాంతంగా కిందపడి కళ్ళు మూశాడు. ఏ జబ్బూలేని డాక్టర్ రామచంద్రన్ నిద్రమాత్రలు ఎక్కువగా మింగి నిద్రలోనే మృత్యువును కౌగలించుకున్నాడు. వారి చావులకి కొన్ని రోజుల క్రిందట వాళ్ళందరికీ జమిందార్ చిదంబరంతో పోట్లాటలు జరిగాయి. చిదంబరం వాళ్ళను శపించాడు. కాని తార్కికంగా ఆలోచిస్తే కోపిష్టుల పాపాల మూలంగా సంఘం నాశనమవదు. చింత చెట్టుకింద కూర్చుని మంత్రాలు ఎంత పఠించినా చింతకాయలు రాలవు. రాయో కర్రో పెట్టి చింతకాయల్ని కొట్టి రాలేటట్టు చెయ్యాలి. ఇదే విధంగా ఈ హత్యలన్నింటినీ ఒక అమోఘమయిన బుర్ర రహస్యంగా ఊహించి నిర్వహించి వుండాలి. ఆ అమోఘమయిన బుర్ర యెవరిది? జమిందార్ చిదంబరంగారిదా? ఆయన కాకపోతే అంత మందిని చంపవలసిన అవసరమున్న వాళ్ళు మరెవరున్నారు?

ఈ రెండో ప్రశ్నకు జవాబుకోసం ఎంత ఆలోచించినా శూన్యంలో రెక్కలు కొట్టుకున్నట్టే అయింది. డాక్టర్ రామచంద్రన్‌ని చంపడానికి ఇంతో అంతో కారణం డాక్టర్ తంబుస్వామికుంది. అయితే అదే కారణం మూలంగా డాక్టర్ తంబుస్వామి సామాన్యులయిన సుబ్బయ్యనీ, వేదవతినీ, నర్సయ్యనీ చంపడం అసంభవం.

"ఈ హత్యలన్నింటినీబట్టి చూస్తే అందరూ చిదంబరాన్ని అనుమానిస్తారు. ఆయనకు అందరితోటీ పరిచయముంది. అందరిమీద ద్వేషముంది. కాని ఏ వ్యక్తినీ మొండిధైర్యంతో హత్యచేయవలసిన అవుసరం చిదంబరానికి లేదు. అయినప్పటికీ ఎందుకేనా మంచిదని ఒక రాత్రుల్లా చిదంబరాన్ని రేఖ కాపలాకాస్తూ కూచుంది. ఆ రోజు ఆయన డ్రయివర్‌ని తిట్టారు. ఆ రాత్రే సైకిల్ మీదనుంచి కిందపడి అతను మరణించాడు. రేఖ చూసిందాన్నిబట్టి జమిందార్ చిదంబరానికి ఆ హత్యతో ఎటువంటి సంబంధంలేదని తేలింది. అయితే డ్రయివర్ని ఎవరు హత్యచేశారు? తార్కికంగా ఎంత ఆలోచించినా ఈ ప్రశ్నకి జవాబు నాకు దొరకలేదు. ఈ ప్రశ్న మానవులు సహజంగా మెచ్చుకునే హేతువాదాన్ని వెక్కిరించింది.

"ఆ సమయంలో మెదడుతో ఆలోచించడం మానేశాను. నా మెదడును నిశ్శబ్దమయిన కదలికలేని స్థితిలో వుంచాను. మెదడుకి అతీతమయిన పై అంతస్తులోంచి ఏదైనా రావచ్చుని భావించి కళ్ళు మూసుకుని సమాధి స్థితిలో చాలాసేపుండిపోయాను. అనుకున్నట్టే మెదడు పై అంతస్తులోంచి నూతన విజ్ఞానం మెరుపులా కిందకు దిగింది. ఆ మెరుపు కాంతిలో నిజాన్ని నేను

చూడగల్గాను.

"ఈ ఊళ్ళో జరిగిన హత్యల్ని గురించి ఒక్క విషయం మనం జ్ఞాపకం వుంచుకోవాలి. జమిందార్ చిదంబరం హంతకుడు కాకపోయినా ఆయన కోపానికి, ద్వేషానికి గురైన వ్యక్తులు హత్య చెయ్యబడ్డారు. హత్య చేస్తూన్న వ్యక్తిని పట్టుకోవాలంటే మరో హత్యకి అవకాశం కల్పించాలి. మళ్ళా యెవరో చిదంబరంలో ద్వేషాన్ని, కోపాన్ని రెచ్చగొట్టాలి. సురేఖ ప్రేమ పేరుతో చిదంబరం ద్వేషానికి గురయింది. దుర్గాదేవి వరండాలో నిల్చుని ప్రేమకీ, జమిందార్ కీ మధ్య జరిగిన సంభాషణ పూర్తిగా విన్నది. తరవాత సానుభూతి నటిస్తూ తన సేవాసదనంలో పని చెయ్యమని ఆమె ప్రేమకు చెప్పింది. మా ప్లాన్ ప్రకారం ప్రేమతో ఆమె వెళ్ళింది. జనసంచారంలేని కొండ ప్రదేశం. వాళ్ళిద్దరూ రోడ్డమ్మట వెళుతున్నారు. వారి వెనకనే నేను పోలీసులతో వానులో బయల్దేరాను. హఠాత్తుగా దుర్గాదేవి రోడ్డు మధ్యకు ప్రేమను తోసింది. అదే క్షణంలో సడన్ బ్రేక్ తో వేన్ ను ఆపి ఏ అపాయమూ లేకుండా నేను చూశాను. వాన్ లోంచి కిందకు దూకాను. రోడ్డుపక్క పొదలముందు దుర్గాదేవి స్తంభంలా నిలబడివుంది. ఆమె మొహంనిండా స్వేదబిందువులు నాట్యం చేస్తున్నాయి. ఆమె కళ్ళల్లోకి చూసేసరికి, ఆమె కనురెప్పల వెనుక ఏదో ప్రళయం నాకు కనిపించింది. మానవులను నాశనం చేసే పిశాచం ఆమెలో దాక్కున్నట్లు నాకు అనిపించింది.

డిటెక్టివ్ అశ్వద్ధామ క్షణకాలం కళ్ళు మూసుకున్నాడు. నీలాకాశం నిర్మాలంగా వుంది. జమిందార్ చిదంబరం అశ్వద్ధామవైపు చూశాడు.

"అశ్వద్ధామగారూ, నేను ఎంత మూర్ఖుడ్నో ఇప్పుడు బోధపడింది. ఇంతవరకూ ఏదో శక్తి స్వరూపం నన్ను కాపాడుతోందనీ, నేను కోప్పడ్డవాళ్ళను శిక్షిస్తోందనీ అనుకునే వాడిని. చివరికి అదంతా చేసింది దుర్గాదేవని ఇప్పుడే నాకు తెలిసింది. ఇన్ని హత్యలు ఆమె ఎందుకు చేసిందో ఊహించలేకుండా వున్నాను" అన్నాడు చిరంబరం.

అశ్వద్ధామ గంభీరంగా నవ్వాడు.

"దుర్గాదేవి మీకు దగ్గర బంధువు. ఆమె మిమ్మల్ని విపరీతంగా ప్రేమించింది. కాని మీరు ఎందువల్లనో ఆమెను పెళ్ళాడలేదు. ఆమె ప్రేమ ఫలించలేదు. చివరికి ఆమె ప్రేమ ద్వేషంగా మారింది. ఆమె ప్రేమతో పెంచిన జంట చిలకలు ఆమె హృదయంలో చెలరేగిన ద్వేషానికి బలయినాయి. అటుపైన చాలా తెలివిగా హత్యలు చేయడం ప్రారంభించింది. మీరు ద్వేషించిన వ్యక్తిని ఆమె చంపుతూ వుండేది. దీనిమూలంగా పోలీసుల అనుమానాలు మీమీదకు వెళ్తాయనీ, మీ రెప్పుడో ఒకప్పుడు అపకీర్తితో ఉరికంబానికి గురవుతారనీ ఆమె ఆశించింది. అందుకే ఈ హత్యలన్నీ జరిగాయి. ఈ హత్యలమూలంగా దుర్గాదేవికి ఏమీరాలేదు. ఏదో వస్తుందని ఆమె ఆశించలేదు. వీటిమూలంగా మిమ్మల్ని పీడించి, బాధించాలని ఆమె తాపత్రయపడింది."

"అశ్వద్ధామగారూ, మీరు చెప్పింది వింటూంటే భయంకరంగా వుంది. బెంగుళూరులో చనిపోయిన మీనాక్షిని నేను కోప్పడలేదు. ఆమెను ఎవరు చంపి వుంటారు?" చిదంబరం అడిగాడు.

"మీనాక్షి మీదకు కారును తోలి ఆమెను దుర్గాదేవే

చంపింది. ఆ సమయంలో మీరు బెంగుళూరులో నే వున్నారు. మీ కారు నంబరును ఒక స్త్రీ అక్కడి పోలీసువాళ్ళకి అందించింది. ముఖానికి మఫ్లర్ చుట్టుకొని కారు నంబరు చెప్పిన స్త్రీ దుర్గాదేవి అయుండాలి. అయితే దుర్గాదేవి మీ నాన్నని ఎందుకు చంపింది. మీ నాన్న ముసల్ది. ఆమె ఎలాగో దుర్గాదేవి రహస్యాన్ని గురించి తెలుసుకుంది. ఆ విషయాన్ని పోలీసులతో చెప్పడం కోసం బెంగుళూరు వెళ్ళింది. ఆమె పోలీసుస్టేషన్ కి వెళ్ళేలోపలే దుర్గాదేవా మెను హతమార్చింది. సమీపంలో వున్న ఒక స్త్రీకి మీ కారు నంబరిచ్చి దుర్గాదేవి మాయమయింది."

చీకటిపడింది. చిదంబరం కోరికమీద తోటలోని లైట్లన్నీ వెలిగాయి.

"అశ్వద్ధామగారూ, యిప్పుడంతా అర్థమయింది. మీరందరూ ఈ రాత్రి యిక్కడే భోజనాలు చెయ్యాలి. భోజనాలయ్యాక నా రోల్స్ రాయిస్ కారులో బెంగుళూరు వెళ్ళొచ్చు" అన్నాడు చిదంబరం.

డిటెక్టివ్ అశ్వద్ధామ నవ్వుతూ సురేఖవైపు తిరిగి ఆమె చేతిని మెల్లిగా నిమిరాడు.

—:ఐ పో యిం ది:—

# రక్తం త్రాగే పిశాచం

### వసుంధర




(గత సంచిక తరువాయి)

"అయ్యో—వకుళా—అవన్నీ చూడ్డానికి నేను బ్రతికుండను గదా—" అన్నాడు మధు దీనంగా.

"పాపం—ఏం చేస్తావు—దేనికైనా యోగముండాలి’

అంటూ వకుళ మళ్ళీ మధు భుజంమీదకు వంగింది.

మధు పరవశంగా కళ్ళు మూశాడు.

సరిగ్గా అప్పుడే "మధూ!" అన్న పిలుపు వినబడింది. వకుళ చటుక్కున చెట్టు చాటుకు వెళ్ళిపోయింది. మధు లేచినిలబడ్డాడు. అతడి ముఖం అసంతృప్తిగా ఉంది.

"ఒక్కడివీ ఇక్కడేం చేస్తున్నావురా మధూ!" అంటూ అక్కడికి మధు తల్లి వచ్చింది.

"ఇప్పుడు నువ్విక్కడికెందుకొచ్చావమ్మా?" అన్నాడు మధు విసుగ్గా.

"నిద్ర పట్టలేదు. లేచి నిన్ను పలకరిద్దామంటే నువ్వు మంచంమీద కనబడలేదు. నీ ఉద్యోగం గురించి మీ నాన్నగారు ఉత్తరం రాసినప్పట్నించీ నీ పెళ్ళి గురించే ఆలోచిస్తున్నాను. రేపు పెళ్ళివారికి కబురు పంపిద్దామనుకొంటున్నాను—" అంది మధు తల్లి.

"పెళ్ళివారెవరమ్మా?" అన్నాడు మధు.

"వెంకట్రా—కాకినాడ పెళ్ళివారు. పిల్లని చూసుకొందుకు రమ్మని రెండునెల్లనుంచి చెబుతున్నారు. నేనే వెనక్కి నెట్టేస్తున్నాను. నీ ఉద్యోగం ఖాయమైనట్లే కాబట్టి ఇంక వాళ్ళకేదో కబురు చెప్పాలి—" అంది తల్లి.

"నా పెళ్ళికిప్పుడు తొందరేమొచ్చిందమ్మా" అన్నాడు మధు.

"తొందరంటే తొందరకాదూ — ఒక్కగానొక్క కొడుకువి. నీమీదే ఆశలుంచుకొని బ్రతుకుతున్నాను—" అంటూండగా ఆమె కళ్ళు చెమర్చాయి—"నా అదృష్టం కొద్దీ నువ్వు ఆ మాయదారి వకుళ పాలబడినట్లేపడి బైట పడ్డావు. ఆ దిక్కుమాలిన పిశాచపు ముండ కళ్ళు—

ఇంతమందిలో నీమీదే పడాలా—"

"అమ్మా—" అరిచాడు మధు—"నువ్వు వకుళ నేమీ అనొద్దు. అంటే నాకోపం వస్తుంది. నాకోపం వస్తే నేనేం చేస్తానో నాకే తెలియదు."

ఆమె ఆశ్చర్యంగా మధువంక చూసి—"అదేంటిరా అలా మాట్లాడతావ్? ఆ మహానుభావుడెవరో దయ తలచి కుంకం యివ్వకపోతే, నీకు తాయెత్తు కట్టకపోతే ఈపాటికి ఆ ముండ నిన్ను పీకుచుకు తినేసేది—" అంది.

"అమ్మా-" అన్నాడు మధు కోపంగా-"వకుళ నేమీ అనొద్దు. ఆమెను నేను ప్రేమిస్తున్నాను—"

"పిశాచాన్ని ప్రేమిస్తున్నావా? నీకేం పిచ్చిపట్ట లేదుగదా—అసలు దాని బుద్ధులొక్కటీ మంచివి కాక పోవడంవల్లనే భగవంతుడు చచ్చేక్కూడా దానికి పిశాచి రూపునిచ్చాడు—" అంది మధు తల్లి.

మధు ఒక్కడుగు ముందుకువేసి—తల్లిని సాచి లెంప కాయ కొట్టాడు.

మధు తల్లికి కళ్ళు బైర్లు కమ్మాయి. కాసేపు ఆమెకు నోటమాట రాలేదు. నెమ్మదిగా తేరుకొని — "ఎంత దెబ్బ కొట్టావురా అప్రాచ్యుడా! కన్న తల్లికంటే నీకా పిశాచమంటే ఎక్కువట్రా—" అంటూ మధువైపుచూసి ఆగిపోయిందామె.

అప్పుడు మధు ఎప్పటి మధులాలేడు. కళ్ళు ఎఱ్ఱ బడ్డాయి. ముఖం క్రూరంగావుంది. అతడిప్పుడు మనిషిలా కాక పిశాచంలా ఉన్నాడు. తల్లి ఆ చూపుల్నీ ఆకారాన్నీ చూసి భయపడుతూ—"ఏమయిందిరా నీకు? ఆ పిశాచం ముండకానీ మళ్ళీ నిన్నావహించలేదుగదా"

అంటూ యింట్లోకి పరుగెత్తింది. అప్పుడే ఆమెకు కుంకం విషయం గుర్తుకొచ్చింది.

మధును పిశాచం ఆవహించిందనడంలో సందేహం లేదు. ఆ పిశాచాన్ని వదల్చడానికి బైరాగి ఇచ్చిన కుంకం తప్ప మరో దారిలేదు. మధు తనమీద పడేలోగా తనా కుంకం తీసుకురావాలి.

"మధూ—వెళ్ళు.... ఆమెని చంపేసేయ్. నన్నింతలా తిట్టినందుకు ఆమెకదే శిక్ష...." అంది వకుళ చెట్టు వెనుకనుంచి. చెవిలో గుసగుసలాడినట్టుగా మధుకా మాటలు వినిపించాయి.

అతడు ఒక్కసారిగా అక్కణ్ణించి తల్లివైపు ఉరికాడు.

కొద్దిక్షణాల్లోనే కెవ్వుమన్న ఆర్తనాదం వినబడింది.

వకుళ సంతృప్తిగా తలాడించి—"ఇంక రతన్‌లాల్ సంగతి చూడాలి!" అనుకొంది.

## 33

ఒకే రాత్రిలో జరిగిన మూడు హత్యలు—కోదండం, రతన్‌లాల్, మధు తల్లి—నగరాన్ని అట్టుడికించాయి.

రతన్‌లాల్ శరీరంలోంచి రక్తం పూర్తిగా పోయింది. ఒంటిమీద గాయం ఎక్కడా లేదు.

కోదండం తల చేత్తో పట్టుకొని మొండెంగా నిలబడ్డాడు.

మధు తల్లి గొంతు పిసికి చంపబడింది.

తన తల్లిని తనే చంపినట్టు మధు ఒప్పుకున్నాడు. కానీ వకుళ పేరు చెప్పలేదు. చనిపోయిన తన ప్రియురాలిని తిట్టిందన్న ఆవేశంతో తను హత్య చేసినట్టు అతను చెప్పాడు. పోలీసులతన్ని కస్టడీలోకి తీసుకున్నారు.

తల్లిని చంపానన్న బాధకానీ, దిగులుకానీ ముఖంలో కనబడకపోవడం చాలామందికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

కోదండం హత్య ఎలా జరిగిందో యెవరికీ తెలియదు. రతన్‌లాల్ విషయం చెప్పనే అవసరంలేదు.

"లింగం—వకుళ విజృంభించింది—" అన్నాడు మహాదేవుడు.

"కానీ ఆమె ఉనికి తెలియకుండా ఉంది—" అన్నాడు లింగం.

"నిస్సందేహంగా ఆమెకు వినోద్ రక్షణ లభించింది. మనం ఎలాగో అలా వకుళను పట్టాలి—" అన్నాడు మహాదేవుడు.

"ఎలా పట్టుకోంటాం? ఏ యింటనైతే ఆమె ఆటలు కట్టించిన కుంకమ ఉన్నదో ఆ యింటి మనిషినే ఆమె హత్య చేయించింది. అంటే ఆమె ఏవేవో కొత్త శక్తులు సంపాదించిందనుకోవాలి-అలాంటి మనిషిని మనం పట్టుకోగలమా అని?" అన్నాడు లింగం.

"నేను ఆంజనేయ చక్రాన్ని అభ్యసించాను. ఇంక వకుళను పట్టుకోవడం కష్టంకాదు—" అన్నాడు శివశంకరం.

"ఆంజనేయి దండకం వినోద్ మీద పనిచెయ్యలేదు. వకుళమీద మాత్రమేం పనిచేస్తుంది?" అన్నాడు మహాదేవుడు.

"అసలు వినోద్ ప్రవర్తన విచిత్రంగావుంది. దండకం ప్రారంభించగానే అతడు బాధను నటించాడు. అది నిజమేననుకొన్నాం. కానీ తర్వాత దండకం చదువు

తూంటే నత్యడం మొదలుపెట్టాడు. అసలు దండకం వింటే తనకు బాధకలిగినట్లు నటించాలని అతడికెలా స్ఫురించింది? వకుళ వినోద్ రక్తం తాగిందో లేదో తెలియదు. దాన్నిబట్టే కదా దండకం అతడిమీద పని చేసేదీ లేనిదీ తెలుస్తుంది. కానీ అతడికి వకుళ గురించి ఎంతో కొంత సమాచారం తెలుసునన్నమాట నిజం. అందువల్ల మనమతడి యింటిని శోధించాలి—" అన్నాడు లింగం.

ఆదెలాగా అన్న విషయం ముగ్గురూ చర్చించగా అందుకు లింగమే సమర్థుడని తేల్చారు. అతడు యువకుడు. అందంగా ఉంటాడు. ఎలాగో అలాగున ఏదోవిధంగా అతడు జలజతో స్నేహం సంపాదించాలి. వినోద్ చెల్లెలు జలజకు అన్నయ్యచేసే వ్యవహారాలు నచ్చుతున్నట్లులేదు. వకుళ అంటే ఆమెకు సానుభూతి ఉన్నట్లు కూడా లేదు. వకుళను సాధించాలంటే ఆమె పరిచయం అవసరం.

మహాదేవుడికి మరో దారి కనిపించలేదు. దుష్టశక్తి కథనాన్ని జనం నమ్మినా నమ్మకపోయినా ఆ విషయమై పోలీసుల సహకారం మాత్రం లభించదు. దుష్టశక్తిని సృష్టించింది తామే కాబట్టి—దాని అంతు తేల్చవల్సిన బాధ్యత కూడా తమపైన ఉన్నది.

ఆ ప్రకారం లింగం బయల్దేరాడు. అతడు ఒక రోజంతా వినోద్ ఇంటిని మాటువేశాడు. జలజ ఇంట్లో నుండి బయటకు రాలేదు. బయటనుంచి ఇంట్లోకి పోలేదు. మర్నాడుదయం పదిగంటలకు అతడి నిరీక్ష ఫలించింది.

జలజ ఇంట్లోనుంచి బైటకు వస్తోంది. తమ యింటికి వచ్చిన రోజున ఆమె ఎంతో అమాయకంగా కనబడింది.

ఈ రోజున ఆమె వన్నెల విసనకఱ్ఱలా ఉంది.

"హాలో—గుర్తున్నానా!" అంటూ ఆమెను పలకరించాడు లింగం.

"హాయ్—" అంది జలజ. ఆమె కళ్ళు చూస్తూంటే ఆమె అతన్ని గుర్తుపట్టినట్లులేదు.

"నా పేరు లింగం. ప్రొఫెసర్ మహాదేవుడు అసిస్టెంటుని. ఒకరోజు మీరు మా యింటికొచ్చి వకుళ గురించి ఏమో చెప్పబోయారు. మీ అన్నయ్య వినోద్ అడ్డుపడ్డాడు. దాంతో మనం విడిపోయాం. అప్పట్నించీ మిమ్మల్ని కలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాను. సాధ్య పడడంలేదు—" అన్నాడు లింగం.

"వెరీగుడ్—గ్లాడ్ టూ మీట్యూ—" అంటూ చేయి జాపింది జలజ. లింగం సందేహించకుండా తనూ చేయి జాపి షేక్‌హాండిచ్చాడు. ఆ స్పర్శకు అతడి తనువు పులకరించింది.

"మిమ్మల్ని చూడగానే మీతో పరిచయం చేసుకోవాలనిపించింది. ఎనీ అబ్జక్షన్!" అన్నాడు లింగం.

"నాకేం అబ్జక్షన్ లేదు — ఎటొచ్చీ మీరు మీరు అంటూ మన్నించుకుంటూ స్నేహితులమని చెప్పుకోవడం నాకు నచ్చదు. ఎనీ అబ్జక్షన్—" అంది జలజ.

"ఓ.కే. జలజా — మనమిప్పుడు కాసేపు కూర్చుని ఏకాంతంగా కబుర్లు చెప్పుకుందాం—ఎక్కడికి పోదాం?"

"దగ్గర్లో పార్కెక్కడుంటే అక్కడికి—" అంది జలజ.

దగ్గర్లో పార్కు ఎక్కడున్నాయో లింగానికి తెలియదు. అందుకని జలజే అతడికి దారి చూపించింది.

ఇద్దరూ పార్కు గేటు దగ్గరకు రాగానే లింగం

ఉలిక్కిపడ్డాడు.

కుక్క ఒకటి అక్కడ పడుకొని వుంది. వీళ్ళిద్దరూ అక్కడకు రాగానే అది భయంకరంగా మొరిగింది. కుక్క అలా మొరగడం అతనెన్నడూ వినలేదు. బహుశా ప్రాణాలు పోయేముందు జంతువులలా అరుస్తాయేమో!

ఆ కుక్క చటుక్కున దూరంగా పారిపోయి ఆగి వీళ్ళవంకే చూస్తూ మొరగసాగింది.

లింగం ఆశ్చర్యపడ్డాడు. కుక్క అలా ఎందుకు చేసింది? జలజ కూడా కళింగ వశమైపోయిందా?

పిశాచాలనీ, వారి అనుచరులనీ కుక్కలు గుర్తు పడతాయని అంటారు. జలజలో ఆ కుక్క ఏం చూసింది?

లింగం మనసు జలజపట్ల బాధ, జాలితో నిండి పోయింది. ఎంతో అందమైన ఈ యువతి ఇప్పుడు ఒక పిశాచానికి బానిస. ఆ పిశాచం కోసం ఆమె ఇప్పుడు ఎంతటి కిరాతకమైనా చేయగలదు!

అలాంటి ఆమెతో తానిప్పుడు పార్కులోకి వెడు తున్నాడు. ఏకాంతంలో ఆమె తనకేమైనా చేస్తే? అసలే—తానిప్పుడు కళింగకు వ్యతిరేకంగా సమాచారం సేకరించాలనుకొంటున్నాడు. అందువల్ల జలజ ద్వారా కళింగ తనను హింసిస్తే—?!

ముందడుగు వేయడానికి తటపటాయించాడు లింగం.

"కుక్క అరుపుకు జడుసుకున్నట్లున్నావ్—" అంది జలజ.

తియ్యటి ఆ కంఠస్వరం లింగం మనసులోకి ఏదో మత్తు నావహింపజేసింది.

"పద — పోదాం—" అంటూ ముందడుగు వేశాడు లింగం. ఇద్దరూ పార్కులో ఓ పొద చాటున కూర్చు

న్నారు.

జలజ లింగం చేతిని తన చేతిలోకి తీసుకొని—"నీ శరీరం స్త్రీలకన్నా కోమలమైనది—" అంది.

"అయినా నీ చేతిపక్కన అది మోటుగా వున్నది-"

జలజ లింగం అరచేతిని తన నోటివరకూ తీసుకొని మృదువుగా చుంబించి — "చక్కటి రక్తపు వాసన!" అంది.

లింగం కంగారుగా — "ఏమన్నావ్?" అన్నాడు. అయితే ఆమె పెదవులస్పర్శ అతడికెంతో హాయిగా వున్నది.

జలజ అతడి చేతిని వదిలి — "ఏమీ లేదు. ఇంతకీ నానుంచి ఏమాశిస్తున్నావ్ చెప్పు—" అంది.

"నువ్వు వకుళను ఎప్పుడు ఎలా చూశావో చెప్పు—" అన్నాడు లింగం.

"అదా నీకొక్కవలసింది—" అని నవ్వింది జలజ. ఆ నవ్వు నెమ్మదిగా, భయంకరంగా వుంది. అలాంటి నవ్వు లింగం ఎన్నడూ వినలేదు.

"అదేం నవ్వు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అలా నువ్వు నవ్వగలవా?" అనడిగింది జలజ.

"నవ్వలేను. నవ్వగలిగినా అలా నవ్వడం నాకిష్టముండదు—" అన్నాడు లింగం.

"వకుళ అలాగే నవ్వుతుంది. ఇంకోలా నవ్వడం ఆమెకు రాదు—" అంటూ మళ్ళీ నవ్వింది జలజ. ఆ నవ్వు కూడా మళ్ళీ ఇందాకటిలాగే భయంకరంగా, నెమ్మదిగా వున్నది.

"వకుళ నవ్వితే నవ్వింది. కానీ నువ్వలా నవ్వొద్దు—" ఆ నవ్వు వింటూంటే అతడి శరీరంలో భయోత్పాత

మవుతోంది.

"వకుళ నవ్వు గురించి చెబితేనే భయపడుతున్నావు మరి వకుళ గురించి ఇంకేం చెప్పను?" అంది జలజ.

"చెప్పు—ఫరవాలేదు—" అన్నాడు లింగం.

"వకుళి ప్రతిరోజూ మా ఇంటి గదిలో స్నానం చేస్తుంది. ఎలాగో తెలుసా? గదిలో నిలువెత్తు గాజు తొట్టె వుంటుంది. దాంట్లో శవాలను నిలవుంచే ద్రావకముంటుంది. వకుళ ఆ గదిలోకి వెళ్ళి గాలిలోకి ఎగురుతుంది. అక్కణ్ణించే బట్టలు విడిచేస్తుంది. సరాసరి ఆ తొట్టెలోనికి దుమకుతుంది. ఇష్టంవచ్చినంత సేపు అందులో జలకాలాడుతుంది. వకుళ అనుచరులు తప్ప మరెవ్వరు చూసినా ఆ దృశ్యానికి జడుసుకుంటారు—" అంది జలజ.

"నువ్వు వకుళ అనుచరురాలివా?" అన్నాడు లింగం.

"నేను కాదు. మా అన్నయ్య. ఒకసారి నేను వకుళను స్నానమాడుతూండగా చూసి జడుసుకొని పరుగున మీ ఇంటికి వచ్చి విషయం చెప్పబోతే అన్నయ్య అడ్డుకున్నాడు గదా-వకుళ అనుచరుడు కాబట్టే వాడా పనిచేశాడు—" అంది జలజ.

"వకుళకీ ఊళ్ళో ఇంకా చాలామంది అనుచరులున్నారా?"

"అనుచరులూ వున్నారు. యజమానురాలూ వుంది-"

"యజమానురాలా?" అన్నాడు లింగం ఆశ్చర్యంగా.

"అవును. రాగిణి ఆమె పేరు—" అంది జలజ.

"రాగిణి వకుళకు యజమానురాలా? అదెలా సాధ్యం?" ఆశ్చర్యంగా అన్నాడు లింగం.

"వకుళకు రక్తపానం ఇష్టం. మనుషుల్నేడిపించడం

ఇష్టం. ఈ పనులు స్వయంగా చేయడంకంటె ఒక యజమాని ఆజ్ఞలకు లోబడి చేయడం ఆమెకింకా ఇష్టం. ఆమె ఎవరి రక్తం తాగిందో-వారి రక్తాన్ని మరో మనిషి తాగడం సంభవిస్తే — వకుళ ఆ మనిషిని యజమానిగా అంగీకరిస్తుంది. వకుళ ఎవరి రక్తం తాగితే వారామెకు అనుచరులవుతారు. అలాగే నా అన్నయ్య ఆమెకు అనుచరుడయ్యాడు. ఓ రోజు పెన్సిలు చెక్కుతుండగా బ్లేడు తగిలి అన్నయ్య చెయ్యి తెగింది. అప్పుడు పక్కన రాగిణి వుంది. రక్తం కారుతున్న వేలును రాగిణి చటుక్కున నోట్లో పెట్టుకు చప్పరించింది. అంతే—.... కొద్ది క్షణాల్లో అక్కడికి వకుళ వచ్చి రాగిణికి సలాం చేసింది. అల్లావుద్దీన్ అద్భుత దీపం కథ వినలేదూ— అలాగన్నమాట!" జలజ ఆగింది.

లింగం ఆలోచిస్తున్నాడు. ఇదంతా తమాషాగా వుంది. ఇంట్లో తాము చర్చించిన విధంగానే జరుగుతోంది వ్యవహారమంతా! అంటే వకుళ ఇప్పుడు రాగిణి వశమైందన్నమాట! అంటే రాగిణి వకుళ నుపయోగించి-సేవా కార్యక్రమాలు ప్రారంభించింది. ఒకవిధంగా చెప్పాలంటే రాగిణి చాలా తెలివైనది. వినోద్ వద్ద ఆమెకు చనువెక్కువో, లేక అసలు రహస్యం ఆమెకు తెలుసో — కానీ ఓ దుష్టశక్తిని ఆమె వశపర్చుకొని ప్రజోపయోగకర కార్యాలు చేయగల్గుతోందామె. కానీ ఇలా ఎంతకాలం కుదురుతుంది? వకుళనామె ఎంత కాలమని అదుపులో వుంచగలదు?

"నీ ఆలోచనలు నాకు తెలుస్తున్నాయి—" అంటూ జలజ నవ్వింది. అదే నవ్వు....గుండెలదరగొట్టే నవ్వు....

"వకుళ తన యజమానిని తనే ఎన్నుకోగలదు. రాగిణి

ఆమెకు నచ్చింది. అందుకే ఆమెలో రక్తపాన ప్రేరణ కలిగించింది. రాగిణితో ఆమె విసిగిపోతే మరో యజమానిని వెతుక్కుంటుంది. కొత్త యజమాని పాత యజమానిని చంపగలడు—"

లింగం ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. రాగిణి మంచిది. ఆమె వకుళను మంచి పనులకుపయోగిస్తోంది. కానీ వకుళ ఎన్నుకొన్న మరో యజమాని దుష్టుడైతే.... అప్పుడు పరిణామాలెలా వుంటాయి?

"నువ్వు వకుళను గురించి చాలా విశేషాలు తెలుసుకోగలిగావు. ఇన్ని వివరాలెలా వచ్చాయి నీకు?"

"అంతా రాగిణి చెప్పింది. అవన్నీ విన్నాకనే వకుళ అంటే భయం పోయింది. నిజం చెప్పాలంటే వకుళ గురించి సత్ప్రచారం చేయాలని కూడా వుంది నాకు. నువ్వు వింటానంటే వకుళ చేసే మంచి పనులన్నీ ఏకరువు పెడతాను—"

"వద్దులే—కాసేపు ప్రేమ కబుర్లు చెప్పుకుందాం—" అన్నాడు లింగం.

"కబుర్లలో ప్రేమ ఏమిటి?" అంటూ దగ్గరగా జరిగింది జలజ.

లింగం వళ్ళు వెచ్చబడింది. జలజ తన రెండుచేతులూ అతడి చుట్టూ పెనవేసింది. కౌగిలి బిగుసుకుంటోంది. ఆ కౌగిలి వెచ్చగాలేదు. ఇరుకుగా, బిగుతుగా వుంది. క్రమంగా ఊపిరిసలపని విధంగా వుంది.

"వదులు. ఇదేం కౌగిలి. ఇంత బలమేమిటి నీకు?" అంటూ కేకలుపెట్టాడు లింగం. ఏమనుకుందో ఆమె అతణ్ని వదిలేసింది.

లింగం ఆయాసపడుతూ ఆమెవంక అదోలా చూస్తూ-

ఆమెకు కాస్త దూరంగా జరిగి—

"సందేహంలేదు. నువ్వు వకుళ అనుచరురాలివే— నీ కౌగిలికి నేను వచ్చాననే అనుకున్నాను—" అన్నాడు,

"వకుళ నా రక్తం తాగలేదు. కానీ మరోవిధంగా నేనామె అనుచరురాలి నే-ఇంకా చెప్పాలంటే నేనామె భక్తురాలిని. అందువల్ల ఆమె నాకు కొంత బలాన్ని ఇచ్చిందేమో—" అని నవ్వింది జలజ. అదే నవ్వు ... గుండెలు తోడేసే నవ్వు....

"సరే—అయితే ఈ వేళ్టికీ సమావేశం చాలు. మనం మళ్ళీ కలుద్దాం—" అంటూ లేచాడు లింగం.

"అప్పుడే వెళ్ళిపోతానంటే ఎలా?" అంటూ చేయి పట్టుకొని లాగిందతణ్ని జలజ. లింగం ఎలాగో తమా లించుకొని ఆమె పట్టు వదలగానే అక్కణ్నించి పరుగు లంకించుకున్నాడు. ఊహించని ఈ పరిణామానికి జలజ అక్కణ్నించి లేచి అతణ్ని తరిమింది. అలా రోడ్డుదాకా వచ్చారు. లింగం పరుగు ఆపలేదు. జలజ అక్కడే ఆగి పోయి అదేపనిగా నవ్వసాగింది.

జనం ఆమెచుట్టూ మూగారు. వాళ్ళనామె గమనించ లేదు. జనంలోంచి ఓ మనిషి ముందుకు వచ్చి—"కాస్త నీ నవ్వునాపు తల్లీ — ఇదేమైనా నాటికలో దెయ్యం వేషమనుకున్నావా?" అన్నాడు.

జలజ చటుక్కున నవ్వునాపి చుట్టూ చూసి—"ఈ నవ్వు విని నా ప్రియుడు జడుసుకొని పారిపోయాడు. ఆడాళ్ళు మగాళ్ళని భయపెట్టడం మీరెప్పుడైనా విన్నారా?" అనడిగింది.

ఈలోగా లింగం పరుగుపరుగున ఇల్లు చేరాడు. ఆయాసం తగ్గగానే జరిగిన జథ చెప్పాడు. అది విని మహా

దేవుడు, శివశంకరం ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

"రాగిణిని మనం మెచ్చుకోవాలి. వకుళవంటి దుష్ట శక్తిని ఆమె చక్కగా వుపయోగించుకుంటున్నది. మన దేశంలో సమసమాజం ఏర్పడాలంటే దుష్ట శక్తులు పని చేయక తప్పదు. సామాన్య పద్ధతుల్లో ఇక్కడి అన్యాయాలనణచడం కష్టం—" అన్నాడు మహాదేవుడు.

"రాగిణికి సంబంధించినంతవరకూ ఫరవాలేదు. కానీ ఆ తర్వాత వకుళ ఏ స్మగ్లర్‌కో లోబడితే?" అన్నాడు శివశంకరం.

"కాస్త మీ చర్చను ఆపి జలజను గురించి ఏం చేయాలో ఆలోచించండి. ఆమెతో నా సమావేశాన్ని తలచుకుంటుంటే నా గుండె లవిసిపోతున్నాయి—" అన్నాడు లింగం.

"అవును. వాటంచూస్తే జలజ వకుళకు లోబడినట్లున్నది. ఆమెను మళ్ళీ మామూలు మనిషిని చేయాలి-" అన్నాడు మహాదేవుడు.

"నా బాధ అది కాదు. మళ్ళీ ఆ జలజ దగ్గరకు వెడితే ఏం చేస్తుందోనని హడిలిచస్తున్నాను. ఆ వకుళ శక్తుల బారినుండి తప్పించుకోవడానికి వేరే మార్గంలేదా?" అన్నాడు లింగం.

"అంటే?" అన్నాడు శివశంకరం.

"ఏదైనా రక్షా కవచంలాంటిది ...." అన్నాడు లింగం.

మహాదేవుడు తల పట్టుకుని — "ఇన్నేళ్ళ సైన్సు ప్రయోగాల తర్వాత నా అసిస్టెంటుకు రక్షక కవచం తయారుచేయడం గురించి ఆలోచించాల్సిన అగత్యం పట్టింది. సైన్సు ఓడిపోయింది—" అన్నాడు.

శివశంకరం చిరాగ్గా తమ్ముడివంక చూసి — "ఈ సృష్టి రహస్యాలను అర్థం చేసుకునేందుకు చేసే నిరంతర ప్రయత్నమే సైన్సు. దానికి ఓటమి వుండదు. మనమిప్పుడు త్వరగా ఆ జలజను పట్టుకుని ఆమె ద్వారా వకుళను సాధించాలి. అందుకు రక్షా కవచాలు తయారుచేయాలి. సైన్సు గురించి తర్వాత ఆలోచించవచ్చు—" అన్నాడు.

"అయితే రక్షా కవచాలు నీవు చేయగలవా?" అన్నాడు మహదేవుడు.

"సదానందుడి శక్తోపాఖ్యానం మనకన్ని విధాలా బాగా వుపయోగపడుతోంది. అదే లేకపోతే మనమసలు వకుళ గురించి తెలుసుకోగలిగి వుండేవాళ్ళమే కాము. అందులో రక్షా కవచాల గురించి వుంది. రక్షా కవచం ఆమెబారినుండి మనను రక్షించుకోవడానికి మాత్రమే ఉపయోగిస్తుంది. మనం ఆమె నేమీ చేయలేము...." అన్నాడు శివశంకరం.

శివశంకరం అనుజ్ఞ మేరకు లింగం అప్పటికప్పుడు మూడు రుద్రాక్షమాలలు తీసుకువచ్చాడు. వాటిలోకి మూడు లాకెట్లు అమర్చారు. శివశంకరం చిన్న డ్రాయింగ్ పేపర్ పై ఆంజనేయుడి బొమ్మ గీశాడు. ఆ బొమ్మలు లాకెట్లోకి ఇమిడిపోయాయి. బొమ్మ వెనుక మూడేసి తులసిదళాలు వుంచాడు. ఆ విధంగా మొత్తం మూడు రుద్రాక్షమాలా లాకెట్సు తయారయ్యాయి.

"ఇవే మనకు రక్షా కవచాలు. తులసిదళాలు ఎండిపోగానే మనం మార్చుతూ వుండాలి. ఈ ఆంజనేయ రూపాన్ని చూపి వకుళను బెదిరించాలి. ఇంక మనం బయల్దేరవచ్చు—" అన్నాడు శివశంకరం.

"ముగ్గురం కలిసి వెడతామా-విడివిడిగా వెడతామా?"

అన్నాడు లింగం.

"వసుళవంటి దుష్టశక్తిని ఎదిరించడానికి మనం ఓ మంచి ముహూర్తం ఎన్నుకోవడం మంచిది-" అన్నాడు శివశంకరం.

"అన్నట్లు ఈ రోజు అమావాస్య. రాత్రి పన్నెండు గంటలకు బయల్దేరితే మంచిది—" అన్నాడు మహాదేవుడు.

"అలా వద్దు—ఇప్పుడే బయల్దేరి ఆమె ఆనుపానులు తెలుసుకొని రాత్రికి ఏం చేయాలో నిర్ణయించుకోవడం మంచిదని నా అభిప్రాయం—" అన్నాడు లింగం.

అంతా అదే మంచిదనుకున్నారు. అయితే ముందుగా లింగం వెళ్ళి ఆమెను కలుసుకోవాలనీ అతణ్ని దూరాన్నుంచి తాము కనిపెడుతూ అనుసరిస్తూంటామనీ మహాదేవుడు, శివశంకరం అన్నారు.

లింగం ఆటో ఒకటి కుదుర్చుకున్నాడు. మహాదేవుడు, శివశంకరం అతణ్ని కార్లో అనుసరిస్తున్నారు.

లింగం ముందు జలజ యింటికి వెళ్ళాడు. అక్కడ ఆమె లేదని తెలిసింది. తర్వాత రాగిణి ఇంటికి వెళ్ళాడు. అక్కడ ఉన్నదామె.

"పారిపోయి మళ్ళీ వచ్చావా?" అంది జలజ లింగాన్ని చూసి.

"నీ అందం అలాంటిది. నీతో చాలా మాట్లాడాలి. వస్తావా?" అన్నాడు లింగం.

జలజ లింగంతో బయల్దేరేముందు రాగిణితో—"ఆ కార్యక్రమం ఈ రోజు ముగించబడిందంటే — ఇంక పూర్తిగా నీ పనులమీదే దృష్టి కేంద్రీకరించవచ్చు—" అంది.

"సరే—ముందు నీ స్నేహితుడి సంగతి చూసుకో—" అంది రాగిణి.

లింగం, జలజ రోడ్డుమీదకు వచ్చారు. అక్కడ ఆటో వుంది.

"మనకోసం ఆటో తెచ్చాను. ఏదైనా హోటల్‌కు వెడదామా?" అన్నాడు లింగం.

"నువ్వెక్కడికంటే అక్కడికే—" అంది జలజ.

లింగం ఆటో ఎక్కాడు. జలజ తనూ ఆటో ఎక్క పోయి—"పెళ్ళికాని ఆడపిల్ల పరాయి మగాడి పక్కనే ఆటోలో ఎలా కూర్చుంటుంది? వూరిలో గౌరవం మంట కలిసిపోతుంది. నేను ఆటో ఎక్కను. మనం నడిచే పోదాం—" అంది.

"నాతో హోటల్‌కు రావడానికి సిధపడ్డావు. ఆటో ఎక్కనంటున్నావు. నీ ప్రవర్తన చిత్రంగా వుంది—" అన్నాడు లింగం.

జలజ అతడివంక తీవ్రంగా చూసి—"హోటల్‌కంటే గది తీసుకుందామనుకుంటున్నావా? అలాగైతే నేను రాను—" అంది. లింగం ఆటో దిగి—"నేను ఆంజ నేయుడి భక్తుడ్ని. బ్రహ్మచర్యం నా వ్రతదీక్ష. నావల్ల నీకేం భయంలేదు—" అన్నాడు. ఆటో వెళ్ళిపోయింది.

"ఆ సంగతి నాకు తెలుసు. అందుకేగా నేను కాగ లించుకోగానే పరుగుపెట్టావు—" అంది జలజ నవ్వుతూ. ఆ నవ్వు ఎప్పటిలాగానేవుంది. ఇంత అందమైన యువతికీ నవ్వు ఏమిటో—అనుకున్నాడు లింగం.

"అయితే హోటల్‌కు వెడుతున్నామా?" అన్నాడు లింగం.

"హోటల్‌కు వెడతాం — కానీ హోటల్ రూంకు

కాదు—" అంది జలజ.

ఇద్దరూ దగ్గర్లోని పద్మజా హోటల్‌కు వెళ్లారు. అక్కడ రెండేసి సీట్లు మాత్రమే వున్న ఫామిలీ అపార్టుమెంట్సున్నాయి. ఇద్దరూ ఒకదాంట్లోకి వెళ్ళి ఎదురెదురుగా కూర్చున్నారు. సర్వర్ వచ్చాడు.

"ఏం ఆర్డరిద్దాం?" అన్నాడు లింగం.

"అన్నింట్లోకీ ఏది బాగా ఆలస్యమవుతుంది?" అనడిగింది జలజ సర్వర్ని.

"మిక్స్చర్ ఊతప్పం—" అన్నాడు సర్వర్.

"అవే — రెండు చెప్పు—" అంది జలజ. సర్వర్ వెళ్ళిపోయాడు. అప్పుడామె లింగంవంక చూసి —

"అసలు నీతో రూమ్‌కైనా వచ్చేదాన్నే—ఆటోలో నీ పక్కనైనా కూర్చునేదాన్నే—కానీ అలా చేయలేదు. ఎందుకో తెలుసా?" అనడిగింది.

"తెలియదు—" అన్నాడు లింగం.

"మెడలో రుద్రాక్ష మాలలు వేసుకునేవాళ్ళంటే నాకు చాలా అసహ్యం—" అంది జలజ.

"అసహ్యంకాదు. భయం!" అన్నాడు లింగం.

"నాకా, భయమా?" అంది జలజ నిర్లక్ష్యంగా.

"అవును—భయమే — నువ్వు వకుళకు ఏజంటువు కదా!" అన్నాడు లింగం.

"నేను ఏజంటును కాదు. అభిమానిని—" అంది జలజ.

"అంతమాత్రాన నీకంత భయమెందుకు?" అంటూ పక్కకు చూసిన లింగం బ్రమాన్పడిపోయాడు.

అక్కడ ఎపార్టుమెంట్ గోడకు అద్దమున్నది. ఆ ఆ అద్దంలో తామిద్దరి ప్రతిబింబాలూ స్పష్టంగా కనబడు

తున్నాయి. కానీ అద్దంలోని జలజ ప్రతిబింబం జలజది కాదు. ఆ ప్రతిబింబం కళ్ళు తెరిచేవున్నాయి. కానీ రెప్పలు పడడం లేదు. నోరు తెరిచివుందికానీ ఏదో తిన డానికి తెరిచినట్లులేదు. శవం నోరు తెరచినట్లున్నది. తన కెదురుగా కుర్చీలో ఓ శవం కూర్చున్నట్లున్నది. ఎవరో ఊపుతూంటే శవం కదులుతున్నట్లుగా ఉంది తప్పితే మనిషి చరిస్తున్నట్లులేదు.

ఆ శవాన్ని కూడా లింగం గుర్తుపట్టాడు. అది వకుళది!

లింగం నరనరాల్లోకీ విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఆ శవానికే తను ఇంజక్షన్ చేసి అందులో చలనం సృష్టించి చరిత్రాత్మకమైన ప్రయోగం చేశాడు. అప్పుడు మాయమయిన శవం ఎన్నో తమాషాలు చేసి ఆఖరికి ఇప్పుడు తన కళ్ళబడింది. దీనికోసమే తను వెతుకు తున్నాడు.

తన ఎదురుగా కూర్చున్న జలజ జలజ కాదు. ఆమె రూపంలో తన్ను మోసం చేస్తున్న వకుళ!

లింగం చటుక్కున లేచాడు.

"ఏమయింది?" అనడిగింది జలజ.

"నన్ను సహ్యించుకునే ఆడదానితో కలిసి టిఫిన్ చేయను నేను. టాటా—" అన్నాడు లింగం.

"సరే—అయితే వెళ్ళు. రెండూతప్పాలూ నేనే తినేస్తాను—" అంది జలజ.

లింగం బయటకు వచ్చాడు. హోటల్ ఎంట్రెన్స్ దగ్గర కూర్చుని వున్న మహాదేవుడు, శివశంకరం అతడి కళ్ళబడ్డారు. అతడు వారిని సమీపించి — "గొప్ప రహస్యం తెలుసుకున్నాను. వకుళ జలజ రూపంలో

తిరుగుతోంది—" అంటూ తను చూసింది చెప్పాడు.

"సదానందుడు దుష్టశక్తి గురించి రాసినది అక్షరాల నిజం. అద్దంలో దాని అసలు రూపం కనబడుతూంది. అయితే మనకిప్పుడు చాలా రహస్యాలు తెలిశాయి. ఇన్నాళ్ళకు వదుళ ఉనికి తెలిసింది. ఇంక ఆంజనేయ చక్రం ప్రయోగించి ఆమెను బంధించాలి—" అన్నాడు శివశంకరం.

"అయితే ఇప్పుడేం చేద్దాం—" అన్నాడు లింగం.

"ముగ్గురం ఆమె వెంటబడదాం. ఆంజనేయ దండకం ప్రారంభిద్దాం—" అన్నాడు శివశంకరం.

"రోడ్డుమీద ఓ అమ్మాయి వెంటబడి ఆంజనేయ దండకం చదివామంటే జనం ఆంజనేయుడిగామారి మనల్ని పిశాచాల్ని బాదినట్టు బాదుతారు—" అన్నాడు లింగం.

శివశంకరం నవ్వి — "నేనంత తెలివితక్కువవాణ్ణి కాదు. నా వద్ద పాకెట్ టేపురికార్డరున్నది. అందులో ఆంజనేయ దండకం టేపు వున్నది—" అన్నాడు.

వాళ్ళక్కడ పావుగంటసేపు ఎదురు చూశారు. చివరికి జలజ బైటకు వచ్చింది. లింగం ఆమె కళ్ళబడకుండా జాగ్రత్తపడ్డాడు. మహాదేవుడు, శివశంకరం ఆమె ననుసరిస్తూంటే కాస్త దూరంలో అతనూ వాళ్ళ ననుసరించసాగాడు.

శివశంకరం టేపు ఆన్ చేశాడు. ఆంజనేయదండకం ప్రారంభమయింది. అది జలజకు వినబడే స్థాయిలో నే వున్నది.

జలజ నడక వేగం పెంచింది. శివశంకరం, మహాదేవుడు కూడా వేగం పెంచారు.

ఉన్నట్లుండి జలజ పరుగెత్త సాగింది. శివశంకరం, మహాదేవుడు కూడా ఆమె వెనుక పరుగెత్తారు.

ఆమె తన కెదురైన టాక్సీ ఒకటి చటుక్కున ఆపి-తను అందులో కూర్చుంది. టాక్సీ తమను దాటుకుపోతూంటే శివశంకరం టేపురికార్డర్‌ను టాక్సీలోకి విసిరాడు.

కొద్ది సెకండ్లలో టాక్సీ ఆగింది. లింగం ఆ టాక్సీ ముందే వున్నాడు. జలజ టాక్సీ తలుపు తీసుకుని బైటకు పరుగెత్తింది. లింగం టాక్సీలోంచి టేపురికార్డర్ తీసుకుని ఆమె ననుసరించి పరుగెత్తాడు.

జలజ పరుగు ఆపింది. తనూ ఆగింది. లింగం తనను సమీపించేదాకా ఆగి—"సౌండ్ మరి కాస్త పెంచు—" అంది.

లింగం సౌండ్ పెంచాడు. జలజ అతడివంకే చూస్తూ నవ్వసాగింది. అదే నవ్వు. ఆమెకే ప్రత్యేకమయిన నవ్వు.

మహాదేవుడు, శివశంకరం కూడా ఆమెను సమీపించారు. విచిత్రమయిన ఆమె నవ్వు వినడం అదే మొదటిసారి వాళ్ళిద్దరకూ. టేపు రికార్డర్ ఆమెపై ఏ విధమయిన ప్రభావమూ చూపకపోవడం వాళ్ళకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

"కట్‌చేయ్ లింగం—" అన్నాడు శివశంకరం.

లింగం టేపు ఆఫ్ చేశాడు.

నవ్వాపి-"మీ భ్రమలోంచి మీరు బయటపడ్డారా?" అంది.

"భ్రమ ఏమిటి?" అన్నాడు మహాదేవుడు.

"దండకాలతో నన్ను జయించగలననుకోవడం?" అంది జలజ.

"నాది భ్రమకాదు. నీమీద దండకం పనిచేస్తింది. అందుకే నడివీధిలో పరుగులెత్తావు. కానీ తర్వాత ఏం జరిగిందో తెలియడంలేదు—" అన్నాడు శివశంకరం.

"ఈమె అన్న వినోద్ విషయంలోనూ ఇలాగే జరిగింది—ముందు బాధ నభినయించాడు. తర్వాత దండకం వింటూ హుషారెక్కిపోయాడు కూడా—" అన్నాడు మహాదేవుడు.

"అన్నయ్యకూ నాకూ కూడా ఓ విద్య తెలుసు. దానితో ఏ జ్ఞానేంద్రియాన్నైనా స్తంభింపజేయగలం. కాసేపు శబ్దగ్రహణాన్ని స్తంభింపజేశాను. అందుకే మీ దండకం నాకు వినిపించలేదు—" అని నవ్వి—"మీరు నా జోలికి రాకండి. అలాగే వకుళ గురించీ మర్చిపొండి. ఆమెను మీరేమీ చేయలేరు. ఏమయినా చేయాలనుకుంటే అది మీకే ప్రమాదమని గుర్తుంచుకోండి—" అంటూ అక్కడ్నించి వెళ్ళిపోయింది జలజ.

"వకుళను జయించడం అనుకున్నంత సులభంకాదు-" అన్నాడు శివశంకరం నిరుత్సాహంగా.

వెళ్ళిపోతున్న జలజవంకే చూస్తూ ముగ్గురూ అక్కడే చాలాసేపు నీరసంగా నిలబడిపోయారు.

# 34

రాత్రి పదిన్నరయింది.

అప్పుడే వీధులన్నీ నిర్మానుష్యంగా అయిపోతున్నాయి.

షణ్ముఖరావు, సూర్యావతి గాఢనిద్రలోకి అప్పుడే వెళ్ళిపోయారు.

సూర్యావతి పక్కనే పడుకున్న చంటిబాబు చటుక్కున లేచి కూర్చున్నాడు. ఒకసారి వంగి తలిదండ్రు

లిద్దర్నీ పరిశీలనగా చూశాడు. తర్వాత మంచం అంచు దాకా పాకి అక్కడ్నించి రెండు చేతులూ పట్టె చివర ఆధారంగా ఉంచి — వ్రేలాడుతూ మంచం దిగాడు. తలుపులు తీసుకుని వీధిలోకి వచ్చాడు. చకచక నడక ప్రారంభించాడు.

వాడు మనుషుల కంట బడకుండా జాగ్రత్తపడుతూ జోగారావు ఇంటికి వచ్చాడు.

వాడు గుమ్మం దగ్గరకు రాగానే గడియ దానంతటదే ఊడింది. తలుపులు వాటంతటవే తెరుచుకున్నాయి. వాడు చకచకా వంటింట్లోకి వెళ్ళాడు. అలమారాలో ఉన్న పెద్ద కత్తి తీసుకున్నాడు.

ఆ కత్తి వాడికంటె పొడుగ్గా వున్నది. అది కొబ్బరి కాయల కత్తిలా వుంది. చంటిబాబు దాన్ని అవలీలగా మోసుకుంటూ పిల్లలు పడుకునే గదిలోకి వెళ్ళాడు.

అక్కడ రమ, సూర్యం పడుకుని వున్నారు.

చంటిబాబు వాళ్ళవంక పరీక్షగా చూశాడు. వాడి ముఖంలో క్రూరమయిన మందహాసం కనబడింది.

వాడు మంచమెక్కి కత్తిని గాలిలోకి ఎత్తాడు. మళ్ళీ క్రిందకు దింపాడు.

అలా రెండుసార్లు చేశాడు.

మొదటిసారి రమ తలకాయ, రెండోసారి సూర్యం తలకాయ మొండేలనుంచి వేరై నేలమీద పడ్డాయి.

చంటిబాబు కొద్దిక్షణాలు ఉత్సాహంగా మంచం మీద నృత్యంచేశాడు.

ఉత్సాహం అణగారేక వాడు మంచంమీంచి క్రింద కురికేడు. జోగారావు గదిలోకి నడిచాడు.

ఆ గదిలో జోగారావు, శారద నిద్రపోతున్నారు.

చంటిబాబు మంచం ఎక్కాడు. క్రూరంగా జోగారావువంక చూశాడు. కత్తిని గాలిలోకి లేపి, క్రిందకు దింపాడు.

ఒక్కసారిగా రక్తం చిమ్మి — శారద ముఖం తడిసింది.

చంటిబాబు కత్తిని దూరంగా విసిరి—నేలమీదకురికి క్రింద పడుకున్నాడు. వాడిప్పుడు మళ్ళీ చంటిపిల్లాడిలా, ఏమీ ఎరుగని అమాయకుడిలాగున్నాడు.

శారద ఉలిక్కిపడి నిద్రలేచింది. గదిలో వెలుతురు అంతగాలేదు.

ఏదో ఇనుప వస్తువు క్రిందపడ్డ శబ్దం ఆమె స్పష్టంగా విన్నది. ఆమెకు భయంవేసింది.

"ఏమండీ!" అన్నది.

జోగారావు మాట్లాడలేదు.

అప్పుడే శారద గుర్తించింది. తన ముఖంనిండా తడితడిగా జిగురుజిగురుగా ఉన్నదని. చీరకొంగుతో ముఖం తుడుచుకుని ఆమె భర్తను తట్టిలేపింది.

జోగారావు ఉలకలేదు, పలకలేదు.

"ఏమండీ—" అంది శారద భయంగా.

జోగారావునుంచి సమాధానంలేదు.

"మాట్లాడరేమండీ—నాకు భయం వేస్తోందండీ—" శారద కంఠంలో వణుకు ప్రారంభమయింది.

జోగారావు చలించలేదు.

ఇంక లాభంలేదనుకుని శారద తన రెండు చేతులతోటీ జోగారావు తలను పట్టుకుని కదిపింది. తల మొండెం నుండి విడివడి ఆమె చేతిలోకి వచ్చింది.

శారదకు జరిగిందేమిటో తెలుసుకోడానికి కొద్ది

క్షణాలు పట్టింది.

భర్త తల తన చేతిలో వుంది. మంచంమీద భర్త మొండెం మాత్రం ఉన్నది.

కెవ్వుమని కేక పెట్టింది శారద.

ఆమె కేక విని మాట్లాడ్డానికి అక్కడెవ్వరూ లేరు.

శారదకు స్పృహతప్పినట్లే అయింది కానీ తప్పలేదు. కానీ ఆమెకు మతిపోయినట్లుంది. తానెక్కడుందో ఏం జరుగుతోందో—అంతా అయోమయమయిపోయింది.

ఆమె నిశ్చేష్టురాలయింది. ఆమె చేతిలో భర్త తల ఇంకా అలాగే వుంది. ఆమె పక్కనే భర్త మొండెమూ వున్నది.

ఉన్నట్లుండి గదిలో దీపం వెలిగింది.

ఆ వెలురుకు శారద ఒక్కసారి కళ్ళు మూసి తెరిచింది. అప్పుడామె స్పష్టంగా అంతా చూసింది.

తన పక్కనే భర్త మొండెం—తన చేతుల్లో భర్త తల—మంచం నిండా రక్తం, తన చేతుల్నిండా రక్తం తన వళ్ళంతా రక్తం. శారద హడిలిపోయి పెద్దగా కేక పెట్టి చేతుల్లోని తలను దూరంగా విసిరేసి ఒక్కసారి కళ్ళు మూసుకుంది. మళ్ళీ భయపడుతూ భయపడుతూ కళ్ళు తెరిచి చూసింది.

తను విసరిన తల దూరంగా పడింది. ఆమె ఉలిక్కిపడింది.

ఆ తలకు పక్కగా సూర్యావతి కొడుకు పడుకున్నాడు.

అయితే ఇదంతా వాడి పనేనా?

భయం, ఆశ్చర్యం, కోపం, ఆవేశం—అన్నీ కలగలుపుగా వచ్చాయామెకు.

చంటిబాబు మాత్రం నిశ్చింతగా నిద్రపోతున్నట్లున్నాడు. వాడు బ్రతికే వున్నాడన్నందుకు సూచనగా పొట్ట పైకీ క్రిందికీ కదుల్తోంది.

శారద లేచి నిలబడింది.

అప్పుడే పడుకున్న చంటిబాబు కూడా లేచి నిలబడ్డాడు.

శారద మళ్ళీ కెవ్వుమని అరిచింది.

చంటిబాబు నాలు గడుగులు వేసి దూరాన వున్న కత్తితీసి చేత్తో పట్టుకున్నాడు.

శారద గుడ్లప్పగించి చూస్తోంది.

చంటిబాబు కత్తి తీసుకుని శారద మీదకు వస్తున్నాడు.

ఉన్నట్లుండి శారద గుమ్మం వైపు పరుగెత్తింది. ఐతే నాలుగడుగులయినా వేయకుండానే ఆమె ఆగిపోయింది.

గుమ్మంలో వకుళ నిలబడి ఉంది.

వకుళ ముఖంలో కోపం—కళ్ళల్లో క్రూరత్వం.

"పిన్నీ!" గుసగుసలాడుతున్నట్లుగా పిలుపు.

శారద వెర్రిమొహం వేసుకొని వకుళవైపే చూస్తూ ఉండిపోయింది.

"చంటిబాబు గురించి భయపడకు. నేను నిన్ను రక్షిస్తాను—" అంటూ ఆమె చేయి జాపింది. ఆ చేయి చంటిబాబు నందుకునేంతవరకూ సాగి వాణ్ని అందుకొంది. ఆ చేయి తనను తాకగానే చంటిబాబు చేతిలోని కత్తిని అవతల పారేశాడు.

వకుళ వాణ్ని దగ్గరగా తెచ్చుకొంది. ఆమె చేయి మళ్ళీ యథాప్రకారం అయిపోయింది.

"నీ అక్కరకు లేకలేక పుట్టినవాడు నీడు. కానీ వీణ్ని

నేను వశపర్చుకొన్నా—ఎప్పుడో తెలుసా?" అంది వకుళ.

శారద ఉలుకూ పలుకూ లేకుండా వకుళ వంకే చూస్తోంది.

"ఈ ప్రపంచమంతా డబ్బులో వుంది పిన్నీ—అందుకే నేను డబ్బు సంపాదించాను. ఆ డబ్బుతో చాలామంది మనుషుల్ని కొనేశాను. అలాగే మంగమ్మనూ కొని ఈ వీధిలో ప్రవేశపెట్టాను. మంగమ్మ నాకోసం చాలా పనులు చేసిపెట్టింది. మధు ఇంట్లోని శంకాన్ని అదే మార్చేసింది. అందుకే మీ తాయెత్తులూ, శంకాలూ నా మీద పనిచేయలేదు. అది ఒక రోజున చంటిబాబు నాడి నూండగా నేను వచ్చి వీడి రక్తం కొద్దిగా తాగి వీడిలో పిశాచత్వం ప్రవేశపెట్టి నీకు వ్యతిరేకంగా ప్రేరేపించాను. అప్పుడు వీడు కవ్వమని అరిస్తే ఊరుకోపెట్ట డానికి దారితోచక మంగమ్మ పాలిచ్చినట్లు నటించింది. నే నక్కడ్నించి వెళ్ళిపోయాను. నేను మంగమ్మ రక్తం తాగలేదు కాబట్టి అది నాకు అన్నివిధాలా సహాకరించ గలిగింది.... చంటిబాబు నా ప్రేరేపణలో నిన్ను చంప కుండా—శారీరకంగా, మానసికంగా ఎంతగావో హింసిం చాడు. ఈ రోజుతో ఆ కార్యక్రమం ముగిసింది—" అంటూ వకుళ చంటిబాబు చేతిని నాకడం మొదలు పెట్టింది. అలా భుజాలవరకూ నాకి చటుక్కున అక్కడ కొరికిందామె.

భయంకరమైన ఆ దృశ్యాన్ని శారద గుడ్లప్పగించి చూస్తోంది. కొద్దిసేపట్లో వకుళ చంటిబాబును అవతలకు విసిరేసింది. వాడు సరిగ్గా జోగారావు తల పక్కనే పడ్డాడు—నిర్జీవంగా.

"నిన్ను నేను చంటిబాబు బారినుంచి ఎందుకు తప్పించానో తెలుసా?" అంది వకుళ.

శారద మాట్లాడడంలేదు. వణికిపోతోంది. ఇప్పుడు భయం ఆమె శరీరాన్ని పూర్తిగా కమ్మేసింది.

"నిన్ను నేను చంపే క్షణం ఇప్పుడే వచ్చింది. నా పగంతా నీమీద. బ్రతికున్నంతకాలం నీమీద పగ తీర్చుకోవాలన్న కసితోనే పెరిగాను. ఇప్పటికి నా పగ తీరింది. ఇంక నిన్ను చంపొచ్చు. నిన్ను నేను స్వయంగా చంపాలని అనుకున్నాను. అందుకే చంటిబాబు బారి నుంచి తప్పించాను ..."

వకుళ మాటలు పూర్తి కాకుండానే శారద గది లోంచి పరుగెత్తబోయింది. అయితే వకుళ తన చేతిని పొడుగ్గా చాపి ఆమెను ఒడిసి పట్టుకొన్నది. రెండో చేతిని చాపి కత్తిని అందుకొన్నది.

అప్పుడు వకుళ తన చేతుల్ని ఇంకా పొడుగు చేసి శారదను బాగా వెనక్కి నెట్టింది.

అప్పుడు వకుళ గది గుమ్మం దగ్గర వున్నది. శారద ఎదురుగా ఉన్న గోడ దగ్గర ఉన్నది.

"క్షణాలు లెక్కపెట్టుకో—నీకు మృత్యువు గడియలు దగ్గరపడుతున్నాయి—" అంది వకుళ.

శారద అతి కష్టం మీద గొంతు పెగిల్చి—"నన్ను వదిలిపెట్టు...." అంది

"ఇంకా నీకు జీవితం మీద ఆశ ఉందా? లోపల భర్త మరణించాడు. అవతల గదిలో పిల్లలిద్దరూ చచ్చిపడున్నారు. అన్నట్లు మరిచేపోయాను. వాళ్ళను నువ్వు చూడనేలేదు కదూ?" అని ఆగింది వకుళ.

అప్పుడు శారదకు తన పిల్లలు గుర్తొచ్చారు. హఠా

తుగా ఆమెలో మాతృప్రేమ పెల్లుబికి భయం స్థానాన్ని ఆత్రుత ఆక్రమించి—"ఎక్కడ నా పిల్లలు?" అందామె.

"తొందరపడకు. వాళ్ళను చూశాక నే చదువుగాని" అంది వకుళ.

వకుళ చేయి ఆమెను పట్టుకొనే గాలిలోకి లేచింది. ఆమె చేయి అతి సులభంగా అటు తిరిగింది. అక్కడే నిలబడి వకుళ శారదను చేతితో పట్టుకొనే పిల్లల గది ముందుంచింది.

గదిలోని దృశ్యం చూసి శారద "రమా, సూర్యం" అంటూ గుండెలు బాదుకొని రోదించసాగింది. ఆమెను కాసేపలా ఏడ్వనిచ్చి మళ్ళీ గది గోడదగ్గరకు చేర్చి—"ఎలా ఉంది పిన్నీ నువ్వు చూసిన దృశ్యం?" అనడిగింది.

శారద ఇంకా ఏడుస్తూనే "ఎన్ని ఘోరాలు చేశావే పాపిష్టిదానా?" అంది.

"ఘోరాలే చేశాను పిన్నీ-కానీ ఎందుకో తెలుసా?" అంది వకుళ.

"నీకు కారణాలు కూడా ఉంటాయా?" అంది శారద.

"అం-నీకంటే మంచి కారణాలే ఉంటాయి నాకు. చిన్నతనం నుంచీ చచ్చేదాకా ఒక్కక్షణం కూడా మనిషిలా చూడలేదు గదా నువ్వు-అందుకేమయినా కారణాలున్నాయా?" అంది వకుళ.

శారద మాట్లాడలేదు.

"నీ పిల్లలకు బట్టలు కొని ఆ ఎన్నిక నాచేత చేయించావు. ఇంట్లో వున్నంతసేపూ స్కూలు పుస్తకాలు దాచేసి బళ్ళో నాకు చెడ్డపేరు తెప్పించావు. చిన్నపిల్లనని జాలి లేకుండా నాచేత ఇంటెడు చాకిరీ చేయించావు.

నాన్న చేత నన్ను కొట్టించావు. అందరికీ నా గురించి చెడ్డగా ప్రచారం చేశావు. నీ పిల్లల ముందు నన్ను పని మనిషిని చేశావు. పరాయి మగాళ్ళకు నన్ను లోకువ చేశావు. నామీద రౌడీలు అమానుషం చేయడానికి ఉసి గొల్పావు. స్పృహా తెలియకుండా నేనుంటే నన్ను దిక్కు లేకుండా వదిలేసి నీ అక్క కొడుకు శారసాలకు వెళ్ళావు. అందుకే అందరిమీదా పగ తీర్చుకున్నాను. నా మీద అవకాశం తీసుకున్న మధు ఇప్పుడు జీవచ్ఛవ మయ్యాడు. నీ కుటుంబం సర్వనాశనమైంది. నీ అక్క కొడుకు నిన్నెడిపించి మరీ చచ్చాడు. ఇంక నువ్వు మిగి లావు. నీ పని కూడా పూర్తిచేసి ఈ ప్రపంచం మీద పడతాను. నీ పని పూర్తిచేస్తేగానీ నేనింక దేనిమీదా దృష్టి పెట్టలేకపోతున్నాను. కాచుకో నా దెబ్బ—" అని అగింది వకుళ.

శారద పరిస్థితి మరోసారి చూసింది.

వకుళ గది గుమ్మం వద్ద వుంది. ఆమె రెండు చేతులూ ఎదుటి గోడను తాకేటంత పెద్దవిగా వున్నాయి. ఒక చేయి తనను ఒడిసి పట్టుకుంది. రెండో చేతిలో రక్తసిక్తమైన కత్తి వుంది.

గదిలో జోగారావు శవం. మొండెం ఒకచోట-తల ఒకచోట! సూర్యావతి బిడ్డ శవం. పక్క గదిలో తలలు వేరైన తన బిడ్డల శవాలు. కొద్దిసేపట్లో తనూ శవంగా మారనుంది.

శారద వకుళవంక చూసింది. ఆ కళ్ళు అగ్నిగోళాల్లా మండుతున్నాయి.

అప్పుడు శారద అన్నీ మరిచిపోయింది. ఆమెను ప్రాణభయం ఆవహించింది—"నన్ను వదిలిపెట్టు నీ

తృప్తికోసం ఏం చేయమంటే అది చేస్తాను...."
అందామె.

వకుళ క్రూరతరకంగా పగలబడి నవ్వింది. ఈ నవ్వు ఇంకోరకంగా భయంకరంగా వుంది.

"ఇంత జరిగాక కూడా ఇంకా నీకు బ్రతకాలని వుందా? నీలాంటివాళ్ళను బ్రతకనివ్వకూడదు" అంటూ ఆమె శారదను సమీపించసాగింది. ఆమె శారదను సమీపిస్తూంటే ఆమె చేతులు ఒరలోకి పోతున్నట్లుగా క్రమంగా చిన్నవై పోయాయి.

వకుళ శారదకు బాగా దగ్గరకు వచ్చి కత్తివున్న చేతిని గాలిలోకి లేపింది.

శారద చావుకేక పెట్టింది.

ఆ కేకకు తెరచుకొన్న నోరలా వుండగానే శారద తల మొండెం నుంచి విడివడి దూరంగా జోగారావు తల పక్కనే పడింది.

వకుళ కత్తిని దూరంగా విసిరేసి గదిలో వికటాట్టహాసం చేసింది. అంతులేని ఆనందంతో ఆ గదిలో ఆమె చాలాసేపు నాట్యం చేసింది. తరువాత ఆమె ఆ యింట్లో వున్న నాలుగు మొండేలనూ హాల్లో గోడకు తల క్రిందులుగా చేరగిల వేసింది. నాలుగు తలలనూ ఆయా మొండేల కాళ్ళపై వుంచింది.

చంటిబాబు శవాన్ని ఆ నలుగురిముందూ పడుకో బెట్టింది.

అక్కడి ఆ దృశ్యాన్ని చూస్తూ ఆమె ఆగకుండా ఆ దేపనిగా నవ్వసాగింది. నవ్వుతున్నకొద్దీ ఆమెలో పిచ్చి ఆనందం పెరిగిందో ఏమో-వుత్సాహంగా నాట్యం చేయ సాగింది.

అది నాట్యంలా కాక విలయతాండవంలా వున్నది.

ఆమె నాట్యం అలా కొనసాగుతూండగా వీధి తలుపులు తెరుచుకున్నాయి.

వకుళ ఆ చప్పుడు వినలేదు. ఆమె వుత్సాహంగా నాట్యం చేస్తోంది.

"శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్య తేజం భజేకీ ర్తి కాయం...." అంటూ హెచ్చు స్వరంతో చక్కటి ఉచ్చారణతో ఆంజనేయదండకం వినబడసాగింది.

వకుళ నాట్యం ఆగిపోయింది. ఆమె చుట్టూ చూసింది. ఎవరూ కనబడలేదు. కానీ ఆమె శరీరంలో బాధ ప్రారంభమైంది. ఆమె అసహనంగా అటూ యిటూ కదిలింది.

దండకం స్థాయి పెరిగింది.

వకుళకు కాసేపు బుద్ధి పనిచేయలేదు. ఎదుర్కోలేని ఆపద తటసపడినట్లుగా ఆమె వణికిపోతూ అటూ యిటూ పరుగులు పెట్టసాగింది. ఆఖరికి ఆమె హాల్లో వున్న ఓ గుమ్మంలోంచి దొడ్డివైపుగా పారిపోదామని ప్రయత్నించింది. అయితే గుమ్మం సమీపించగానే బ్రేకు వేసినట్లుగా ఆగిపోయిందామె. గుమ్మంలో ఏదో ఆకారం కనపడిందామెకు. దానిని చూడగానే అప్రయత్నంగానే కీచుమంటూ అరిచింది.

అక్కడ గుమ్మంలో గదాధారుడైన హనుమంతుడు నిలబడి వున్నాడు. ఆమె వైపు హనుమంతుడు గుడ్లురిమి చూస్తున్నాడు.

అవతల దండకం ఆగకుండా వినబడుతోంది. ఇవతల హనుమంతుడు.

వకుళ రెండో గుమ్మం—అనగా జోగారావు పడక గది వయిపు పరుగెత్తింది. అక్కడ్నించి వంటింట్లోకీ, అలా దొడ్లోకీ దారులున్నాయి.

వకుళ ఎక్కువగా ఆలోచించలేకపోతోంది. ఆగకుండా వినబడుతున్న ఆంజనేయ దండకం ఆమెకు మతి లేకుండా చేస్తోంది.

గుమ్మందాకా వెళ్ళిన వకుళ మళ్ళీ కీచుమంటూ అరిచింది. ఆ గుమ్మంలో కూడా గదాధరుడైన హనుమంతుడున్నాడు.

ఇప్పుడు ఆంజనేయ దండకం వీధిలోంచి రావడం ఆగిపోయింది. అందుకని ఆమె వీధి వైపు పరుగెత్తింది. అయితే అక్కడ ఆమెకు గదాధరుడైన మరో హనుమంతుడు ఎదురుపడ్డాడు.

వకుళ త్వరగా హాలు మధ్యకు వచ్చేసరికి ముగ్గురు హనుమంతులూ ఆమె చుట్టూ చేరి వలయాకారంలో తిరుగుతూ ఆంజనేయ స్తోత్రం చేయసాగారు.

"ఏమిటిదంతా?" తీవ్రంగా అరిచింది వకుళ.

"ఇది అంజనేయ చక్రం. దీనినుంచి నువ్వు బయట పడలేవు. నీ ఆట కట్టించె. మర్యాదగా లొంగిపో—" అన్నాడు ఒక హనుమంతుడు.

"నేనెందుకు లొంగిపోవాలి? లొంగి ఏం చేయాలి?" అంది వకుళ.

"నీలో సర్వశక్తులూ నశించాలి. నువ్వు మామూలు శవానివి కావాలి—" అన్నాడు ఇంకో హనుమంతుడు.

"అసాధ్యం—నాకు నాశనం లేదు. నేను అమర జీవిని-" అంది వకుళ.

"అయితే ఈ అంజనేయ చక్రంలో బంధింపబడి

అమరజీవిగా అనుభవించు" అన్నాడో హనుమంతుడు. వాళ్ళలా వలయాకారంగా తిరుగుతూ ఆమె చుట్టూ సుద్దతో వలయం గీస్తున్నారు.

వకుళ వారివంక నిస్సహాయంగా చూస్తూ అలా నిలబడిపోయింది.

ముగ్గురు హనుమంతులూ ఆంజనేయ స్తోత్రం ఆపేశారు. వలయం గీయడం కూడా పూర్తయింది. వారిలో ఒకడు "ఇంక ఇదే నీవు స్థానం" అన్నాడు.

"ఈ చక్రం శాశ్వతం కాదు. కానీ నేను శాశ్వతం. ఆ విషయం మరిచిపోకండి—" అంది వకుళ.

"ఈ చక్రాన్ని నేను శాశ్వతం చేయగలను. నువ్వు శాశ్వతమైతే మాత్రం ఏమి చేయగలవు? స్నానం లేక వెలుగును చూడలేవు. రక్తం లేక శక్తిని కోల్పోతావు. అప్పుడు నీవల్ల ప్రపంచానికి ప్రమాదముండదు-" అన్నాడో హనుమంతుడు.

"నేను ప్రపంచానికి ప్రమాదం తలపెట్టను. మీకు లోబడి వుంటాను. మీరు చెప్పినట్లే వింటాను. నన్ను బంధ విముక్తురాల్ని చేయండి" అంది వకుళ.

"దుష్టశక్తి ఉనికి ప్రపంచానికే ప్రమాదం. నువ్వు మాకు బానిసగా పడివుంటానన్నా సరే-నిన్ను మేము వదలిపెట్టము. నీకీ చెర తప్పదు" అన్నాడో హనుమంతుడు.

"చెర .... నా జీవితమంతా చెరగానే గడిచింది. తనువు చాలించి అపూర్వశక్తులు సాధిస్తే ఇప్పుడూ చెర బ్రతుకే అయింది" అని నిట్టూర్చింది వకుళ.

ముగ్గురు హనుమంతులూ వలయం చూస్తూ చతికిలబడి "ఇంతగా నిట్టూర్చే నీ జీవితగాథ చెప్పు—" అన్నారు.

వకుళ క్లుప్తంగా వారికి తన కథ చెప్పింది. తర్వాత

"మీరు నన్ను గుర్తించి నా దగ్గర కెలా రాగలిగారు?" అంది.

ముగ్గురు హనుమంతులూ తమను తాము పరిచయం చేసుకొన్నారు. ప్రొఫెసర్ మహాదేవుడు, అతడి అన్న శివశంకరం, మహాదేవుడి అసిస్టెంటు లింగం!.... వారు తమ పరిశోధనల గురించిన వివరాలన్నీ చెప్పేక ఈ రోజు లింగం అద్దంలో నీ ప్రతిబింబం చూసి జలజ రూపంలో నువ్వు తిరుగుతున్నట్లు గుర్తించాడు. ఆ తర్వాత ఈ రోజంతా నీ యింటిముందు కాపలా కాశాం. రాత్రి పది న్నరకు నువ్వు ఇల్లు వదలి బయటకు వచ్చావు. నిన్ననుస రించి కొంతదూరం వచ్చాం. తర్వాత నువ్వు మా కన్ను గప్పావు. అప్పుడు మేము ముగ్గురమూ ఆలోచించుకొని నువ్వు నీ పాత యింటికి వెళ్ళి వుండవచ్చునని ఊహించాము. ఈ వేషాల గురించి ముందే అనుకొన్నాము. ఆంజనేయ రూపం ఎదుట నుండగా నువ్వు నీ శక్తులు ప్రదర్శించలేవు. నీ యింటికి రాగానే మాకు నీ వికటాట్ట హాసాలు వినబడుతున్నాయి. వెంటనే సిద్ధమయ్యాము. నిన్ను బంధించాము—" అన్నాడు మహాదేవుడు.

"మీరు నాకు పునర్జన్మ ప్రసాదించారు. అందువల్ల పితృసమానులు. నన్నిలా హింసించడం మీకు తగునా! నేనెలాగూ మీ జోలికి రానని మీకు తెలియదా?" అంది వకుళ.

"దుష్టశక్తికి నీ, నా భేదముండదని నీ ప్రవర్తనే చెప్పక చెబుతుంది. ఇంతకూ నాకు కొన్ని సందేహాలున్నాయి. వాటి నెలా సాధించావో చెప్పాలి?" అంటూ "మధు కట్టుకొన్న తాయెత్తు మహిమను నువ్వెలా అధిగమించావు?" అనడిగాడు మహాదేవుడు.

"మంగమ్మ అనే అందగత్తెను దబ్బిచ్చి లోబరచు కొన్నాను. నేను నా శక్తులతో అందర్నీ జయిస్తూంటే మంగమ్మ తన అందంతో మధు, రతన్‌లాల్ లాంటి వాళ్ళను మంత్రించి వాళ్ళ ఆయెత్తులు మార్చేసింది. ఆమెకు నేను మానవాతీతురాలినని తెలియదు కానీ విచిత్ర వ్యక్తి ననుకొంది—" అంది వకుళ.

"జలజ రూపాన్నెలా ధరించావు?"

"కోరిన రూపాన్ని ధరించగల శక్తి నాకుంది. అడు వారిపై నాకాసక్తి తక్కువ. అందువల్ల జలజ అన్న వినోద్‌ను లోబర్చుకొని అతని యింట నా స్థావరం పటిష్టం చేసుకున్నాను. అప్పుడప్పుడు జలజ రూపంలో బయట తిరిగేదాన్ని. అయితే ఒకసారి ఆమె నన్ను నా గదిలో చూసి ఆ సమాచారం అందరికీ అందజేయాలని బైటకు వెళ్ళింది. అప్పుడు వినోద్ నన్ను రక్షించాడు. మనుషులకు చల్లటి నా శరీర స్పర్శ తెలియకుండా శరీరానికి పల్చటి తొడుగు ధరించాను—కానీ అప్పట్నించీ జలజను ఓ గదిలో బంధించడం జరిగింది. ఆమె రూపంలో నేను మాత్రమే బైటతిరుగుతున్నాను—" అంది వకుళ.

"రాగిణిని నీ యజమానురాలిగా ఎందుకు ఎన్నుకున్నావు?"

"ఆమెలో మంచి ఆశయాలున్నాయి. దౌర్జన్యాలను, అక్రమాలను, అవినీతిని ఆమె సహించదు. బ్రతికున్నప్పుడు నాలో లోపించిన ధైర్యసాహసాలామెలో ఉండడం చూసి ఆమెను నా యజమానిగా నిర్ణయించుకున్నాను. అందుకే ముందుగా ఆమెచేత జగ్గూని శిక్షింపజేసి—ఆ తర్వాత ఆమె ప్రవర్తన ఎలా వుంటుందో పరిశీలించాను. తను చేసిన పనికి ఆమె ఆశ్చర్యపడింది, సంతోషపడింది—

తప్పితే—భయపడలేదు. అందుకే ఆమె నాకు నచ్చింది. నా గురించి ఆమెకు తెలియగానే నన్నామె చక్కగా ఉపయోగించుకుంది. నాకెంతో మంచి పేరు కూడా వచ్చింది—" అంది వకుళ.

"ఇంతకీ నువ్వేం సాధించానని అనుకుంటున్నావ్?" అన్నాడు శివశంకరం.

"నన్ను శారీరకంగా, మానసికంగా హింసించిన వాళ్ళందరిపైనా పగతీర్చుకున్నాను. ఇప్పుడు నాకెంతో తృప్తిగా వుంది. ఆ తృప్తి ఎలాంటిదో మీరూహించలేరు—" అంది వకుళ.

"ఇంకా ఏం సాధించాలనుకుంటున్నావ్?"

"తెలిసిగానీ, తెలియకగానీ సాటిమనిషికి అన్యాయం చేసే ప్రతి ఒక్క మనిషిని ఏరిపారేద్దామనుకుంటున్నాను. అన్యాయమంటే వాడిలిపోయే స్థితికి ఎదిగేలా మానవుల్ని తయారుచేయాలనుకుంటున్నాను—"

"అలాగైతే — ఇన్ని కోట్ల మానవుల్లో మచ్చుకొక్కడు మిగలడే!" అన్నాడు లింగం.

"ప్రతివాడూ సాటిమనిషికి అన్యాయం తలపెట్టేటప్పుడు—ఆ మానవజాతి ఉంటేనేం — ఊడితేనేం?" అంది వకుళ తీవ్రంగా.

మహాదేవుడు నిట్టూర్చి — "నువ్వు మేమనుకున్నంత దుర్మార్గురాలివికాదు—" అన్నాడు.

"మరి నన్ను వదిలిపెడతారా?" అంది వకుళ ఆశగా.

"పరిమితంగా పుచ్చుకుంటే బ్రాందీ అంత మంచిదిలేదు. కానీ మనిషి దానికి బానిస అయి—జీవితాన్ని నాశనం చేసుకుంటున్నాడు. దుర్భేద్యమైన పర్వతాల్ని వశంచేసు

కోసడం కోసం డైనమైట్ కనిపెడితే — మనిషి దాన్ని దౌర్జన్యకాండకు వినియోగిస్తున్నాడు. అణువులోంచి అనంతమైన శక్తిని కనిపెడితే — మనిషి దాన్ని మరణకాండకు వినియోగించి ఈ సృష్టికే ముప్పు తీసుకు వస్తున్నాడు. అప్పటికి అవి అస్వతంత్ర శక్తులు. పేరుకో యజమానిని నెన్నకున్నా నువ్వు స్వతంత్ర శక్తివి. నీవలన ప్రపంచానికి ముప్పు తప్పదు. అందువల్ల నిన్ను వదిలిపెట్టే ప్రసక్తి లేనే లేదు—" అన్నాడు మహాదేవుడు.

వకుళ నీరసంగా ఆ చక్రం లోపల కూలబడింది.

"ఇలా ఎంతకాలం మనమీ మెకు కాపలా?" అన్నాడు లింగం విసుగ్గా.

"అలా దొడ్లోకి వెడదాం. మీకో రహస్యం చెప్పాలి—" అన్నాడు శివశంకరం.

ముగ్గురు హనుమంతులూ దొడ్లోకి వెళ్ళారు.

"ఈ మెనిలా ఎంతసేపని ఎక్కడ నిలబెడతాం? ఈ మెను శాశ్వతంగా బంధించే ఏర్పాటేదైనా చేయాలి? అందుకు మీరేదైనా ఉపాయం ఆలోచించండి—" అన్నాడు శివశంకరం.

"మేమేం చెప్పగలం? నువ్వే చెప్పాలి—" అన్నాడు మహాదేవుడు.

"ఆ శరీరానికి నాశనంలేదు. దానికి చలనం స్తంభించవచ్చు. శక్తి క్షీణించవచ్చు. కానీ నాశనం మాత్రంలేదు. అందువల్ల ఈ మెను శాశ్వతంగా బంధించడానికి నాకు ఒక్కటే దారికనబడుతోంది. ఒక కొయ్యపెట్టెలో ఈ మెనుంచి — దానిచుట్టూ శాశ్వతంగా ఆంజనేయ చక్రంవేసి ఉంచుదాం—" అన్నాడు శివశంకరం.

"ఈ యింట్లో ఎన్నో హత్యలు జరిగాయి. వాటికి మనం సంజాయిషీ యివ్వకతప్పదు. ఈమె గురించిన రహస్యాలేమీ మనం దాచడానికి వీల్లేదు—" అన్నాడు లింగం.

"మన ప్రయోగం విషయం మాత్రం రహస్యంగా ఉంచకతప్పదు. ఎందుకంటే ప్రమాదకరమైన ప్రయోగం చేయడం మన తప్పు. అలాటి ప్రయోగం చేయగల శక్తి మనకున్నదని తెలియడం మరింత ప్రమాదకరం. ఈ రెండు కారణాలవల్లా వకుళ దుష్టశక్తి అన్న విషయం మాత్రం మనం అందరికీ తెలియనివ్వవచ్చు. ఆమె దుష్టశక్తిగా ఎలా మారిందీ అన్న విషయం మనమెవరికీ చెప్పవద్దు—" అన్నాడు మహాదేవుడు.

"అయితే ఇప్పుడేం చేయాలి?" అన్నాడు లింగం.

"నువ్వు వెళ్ళి పోలీసుల్ని పిల్చుకునిరా—" అన్నాడు మహాదేవుడు.

సరేనని బయల్దేరాడు లింగం.

"ఇదిగో—ఈ వేషంలో కాదు—ముందు వేషం మార్చుకో—" అన్నాడు మహాదేవుడు.

ఈలోగా ఇంటిముందు ఏదో జీపు ఆగిన శబ్దమైంది.

ముగ్గురూ హడావుడిగా హాల్లోకి వచ్చారు. బూట్లు టకటకలాడించుకుంటూ ఒక పోలీసు ఇన్స్పెక్టర్ నలుగురు కానిస్టేబుల్స్ వచ్చారు. వారి వెనుకనే షణ్ముఖరావు, సూర్యావతి వచ్చారు.

ఇన్స్పెక్టర్ ముగ్గురు హనుమంతుల్నీ చూసి ఉలిక్కిపడి చిరాగ్గా—"ఏమి టీ వేషాలు?" అనడిగాడు.

(సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 5 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

## పిచ్చిది కరిస్తేనో - ?

పత్రికా విలేఖరిణి 'ప్రతిభ' పిచ్చి ఆసుపత్రికి వెళ్ళింది. ఆసుపత్రి సూపరింటెండెంటును ఇంటర్వ్యూ చేయమని ఆమెను పత్రిక యాజమాన్యం కోరింది.

సూపరింటెండెంటు ఆమెను సాదరంగా రిసీవ్ చేసుకున్నాడు.

ఆమె అతడిని ఆఫీసు గదిలో ఇంటర్వ్యూ చేస్తోంది.

ఆఫీసు గదిలోకి తాటకిలాంటి ఓ స్త్రీ ప్రవేశించింది. భారీ శరీరానికి తోడు పీచులాగా ఎగురుతోన్న జుత్తూ నుదుటను రూపాయి బిళ్ళలాంటి ఎర్రటి బొట్టూ చికిలించిన కళ్ళూ ఆమె రూపానికి భయంకరమైన మెరుగులు దిద్దాయి.

ప్రతిభ ఆమెవైపు భయంగా చూచింది.

సూపరింటెండెంటు ఆమెను ఫరవాలేదన్నట్టుగా నవ్వి వరండాలోకి తీసుకు వెళ్ళాడు. అక్కడ ప్రతిభ అడుగుతోన్న ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వసాగాడు.

తాటకి వరండాలో మళ్ళీ ప్రత్యక్షమయింది. కళ్ళు మరింత చికిలించుకుపోయాయి.

అప్పటికే ప్రతిభకు సూపరింటెండెంటు చెప్పివుంచాడు. తాటకికి ఇంగ్లీషు రాదుట.

"ఈ రాక్షసిని ఆసుపత్రి ఆవరణలో ఇంత విచ్చలవిడిగా వదిలారు" వ్యాఖ్యానించింది ప్రతిభ.

"తప్పలేదు" అన్నాడు సూపరింటెండెంటు సెల్ వైపు నడుస్తూ.

తాటకి భారీ అడుగులతో వారిని వెంబడిస్తోంది.

"ఆమెను ఒక సెల్‌లో వుంచండి. హానికరంగదా!"

"ఎవరికి హాని చేయదు!"

"పిచ్చిది! కరిస్తేనో...."

"ఇంతవరకూ నన్నుతప్ప ఎవరినీ కరవలేదు."

"మైగాడ్! మిమ్మల్ని కరచిందా?"

"నేను తప్ప మరెవరు కరిపించుకుంటారు?"

"మీరు కరిపించుకుంటారా? ఎందుకు?"

"భర్త అయాక తప్పదుగదా!"

—ఎమ్. శిరీష్, విశాఖ.

## అసలు రహస్యం?

మోహనరావు పందిరి మంచం సమీపించాడు. పందిరి మంచానికి మల్లెపూల గుత్తులు వ్రేలాడుతోన్నాయి. ప్రక్క నున్న టీపాయ్‌మీద స్టాండులో అగరువత్తులు వెలుగు తోన్నాయి.

రాణి స్టౌముందు కూర్చుంది. స్టౌమీద పాలు మరుగు తోన్నాయి.

"ఏమండీ!" పిలిచింది రాణి.

"ఏం రాణీ?" అడిగాడు మోహనరావు.

"మీకు బోర్నవిటా కలపనా? పాలే తాగుతారా?" అడిగింది రాణి.

"నువ్వేం తాగితే అదే ప్రియా. నీతోడిదే లోకం రాణీ!"

రాణి తన మూతిని మూడు వంకరలు త్రిప్పింది.

"ఏం లాభం! పెళ్ళయి రెండేళ్ళయింది. మనకి ఇంత నలుసయినా పుట్టలేదు!" అంది రాణి.

"మాత్రలు మింగుతోన్నావు కదా!"

"నావల్ల కాటి మాత్రలు! ఈ రెండు సంవత్సరాలుగా తెగమింగించారు. ఇంకా మింగమంటారు. ఇక నావల్ల కాదు!"

"బలం వద్దా?"

"బలమా? పాడా? పిల్లలు పుట్టనిదానికి?"

"అయితే ఇక మాత్రలు మింగనంటావు?"

"వూహూఁ!"

"నాకోసం? మన ప్రేమకోసం?"

"ప్రేమ వుంటే మాత్రం అవి మింగాలా. నా మొహం పై త్యాన పడుతూంది."

"అయితే రాణీ ఈ నెలలో నువు నెల తప్పుతావు."

"నిజంగానా? జోకా?"

"నిజమే! మాత్రలు మానెయ్యి. పిల్లలు పుడతారు."

"ఎలా?"

"అవి గర్భ నిరోధక మాత్రలు. మనం కొంతకాలం ఎంజాయ్ చేయాలని నీచేత వాటిని మింగించాను."

"అంటే!" భార్య గుడ్లు తేలేసింది.

—ఎమ్. సత్యవతి, విశాఖపట్టణం.

# ముద్దంటే భయం!

స్నేహితులం అందరమూ నిర్ఘాంతపోయాం.

రాబర్ట్ తన ముప్ఫయ్యో ఏట తన ఘోటక బ్రహ్మచర్యం విడిచిపెట్టి ఒక యింటివాడయాడు. అందుకు మేము నిర్ఘాంతాపోలేదు. కమల లాంటి అందగత్తెను ప్రేమించి విడిచిపెట్టాడు. మేరీని పెళ్ళాడాడు.

మేరీ నల్లగా వుంది. లావుగా వుంది. ఎత్తు పళ్ళతో వుంది. అంత ఎందుకు? రాబర్ట్‌లాంటి దొండపండుకు కాకి లాగా తయారయింది.

"నీకు మతి వుందట్రా? నీ బ్రహ్మచర్యం ఈ సుందరాంగి దగ్గర నాశనం చేసుకుంటావా?" అని అడిగాం.

రాబర్ట్ ఎప్పటిలాగే మనోహరంగా నవ్వాడు.

మౌనంగా మేరీ పేరుతో వున్న బాంక్ అకౌంటు పుస్తకం చూపించాడు.

అక్కౌంటు నాలుగు లక్షల రూపాయలు వుంది.

అటుతర్వాత ఎక్కడ చూచినా రాబర్ట్ దంపతులే! ఏ పార్టీలో చూచినా వాళ్ళే! ఏ సినిమా థియేటర్లో అయినా వాళ్ళే దర్శనమిచ్చేవారు.

ఎర్రగా రాబర్టూ, వాడి నీడలాగా మేరీ.

"ఒరేయ్! మేరీని పెళ్ళి చేసుకున్నావ్. సరే! బాంకు బాలన్స్‌కోసం అని సరిపెట్టుకున్నాం! అలా వెంటేసుకు తిరుగుతావు. మతి వుందట్రా?" చీవాట్లు వేశాం.

రాబర్ట్ మరల మనోహరంగా నవ్వాడు.

"వెంటపెట్టుకు తిరగడమే సుఖంరా నాయనలారా! ఇంట్లో వుంచి బయలుదేరితే ముద్దు పెట్టుకుని మరీ బయలుదేరాలంటుంది. ఇదే కాస్త నయం కదా!—"

—ఎమ్. వి. వి. సత్యనారాయణ.

